THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

ఫిబ్రవరి 2004 ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక వెల : రూ.5/-




















మహాసభల ప్రత్యేక సంచిక

14V01A 427

# ఐక్య ఉపాధ్యాయ


విద్యా విషయక మాసపత్రిక

జనవరి-ఫిబ్రవరి, 2004

సంపుటి : 30 సంచిక : 1-2




ఈ సంచికలో .....


| | |
|---|---|
| సందేశాలు | 2 |
| వార్తాప్రపంచం | 5 |
| రాష్ట్ర మహాసభల విశేషాలు | 6 |
| కోర్టు తీర్పులు | 35 |
| ప్రపంచ సామాజిక వేదిక పిలుపు | 37 |
| మైనేని స్మృతి | 39 |
| డి.ఎఫ్.ఐ.డి. సహాయం.... | 40 |
| మాతృభాషా దినోత్సవం | 40 |
| ప్రభుత్వ ఉత్తర్వులు | 41 |



సంవత్సర చందా : రూ. 60-00

విడిప్రతి : రూ. 5-00



ఐక్య ఉపాధ్యాయ

గగన్ మహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ,
హైదరాబాద్-29.

ఫోన్ : 27636840 ; ఫ్యాక్స్ : 27650366

UTF ఆఫీస్, ఫోన్: 27677242, ఫ్యాక్స్: 27650366

E-mail UTF : aputf 2000@yahoo.com

*Ramireddy* : dachuri_ramireddy@yahoo.co.in


## ఫిబ్రవరి 24 సమ్మెలో పాల్గొనండి

సంపాదకీయం

ఉద్యోగులకు, కార్మికులకు సమ్మె హక్కు యాచిస్తే వచ్చింది కాదు. సుదీర్ఘ పోరాటాల ద్వారా, త్యాగాల ద్వారా సాధించుకున్న హక్కు. అంతేగాక పరిశ్రమల యజమానులు కూడా "పోరాటాల వల్ల ఫాక్టరీల విధ్వంసంకన్నా శాంతి యుతంగా జరిగే సమ్మెయే మేలు" అని అంగీకరించారు. ఎవరైనా అన్ని పోరాట రూపాలు విఫలమైన తర్వాతనే 'గరళ వైద్యం'గా సమ్మె అస్త్రాన్ని ప్రయోగిస్తారు. అదే పోరాటాల చివరి రూపం.

స్వాతంత్ర్యోద్యమ కాలంలోనే సమ్మెను కార్మిక వర్గ ప్రధాన ఆయుధంగా జాతీయ నాయకత్వం గుర్తించింది. అందుకే మన రాజ్యాంగ ఆదేశిక సూత్రాల్లో సమ్మె చేసేందుకు అనుమతించింది. స్వాతంత్ర్యానికి పూర్వమే అహమ్మదాబాద్‌లో బట్టలమిల్లు కార్మికులు గాంధీజీ నాయకత్వంలో సమ్మె చేశారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కార్మికులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు అనేక సార్లు సమ్మె చేశారు. గత సం॥ మార్చి నెలలో దేశ వ్యాప్తంగా ప్రభుత్వోద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. జయలలిత ప్రభుత్వం తప్ప మరే ప్రభుత్వమూ సమ్మెకు దిగిన ఉద్యోగుల పై యింత క్రూరంగా వ్యవహరించలేదు. తమిళ నాడులో అప్పీళ్ళ తరువాత 999 మంది డిస్మిస్ చేశారు. వారిలో 148 మంది ఉపాధ్యాయులు. ఈ దుర్మార్గాన్ని ముక్త కంఠంతో ఖండించాలి. బాధితులకు శక్తి కొలది సహాయం చేయాలి.

కోర్టు తీర్పులు ఉద్యమాలనాపలేవు. బంద్ వద్దన్న తర్వాత కూడా బంద్‌లు జరుగుతూనే ఉన్నాయి. సమ్మెను నిషేధించిన తర్వాతనే మన రాష్ట్రంలో జూనియర్ డాక్టర్లు నెల రోజులకు పైగా సమ్మె చేశారు. ఈ రోజు తమిళనాడులో జరిగిందే రేపు మన రాష్ట్రంలో జరుగవచ్చు. జరుగదని నిశ్చింతగా, ప్రమత్తంగా ఉండడం క్షేమదాయకం కాదు. నిరంకుశమైన పాలక వర్గాల కత్తి ఎప్పుడూ మన నెత్తిమీద వేలాడుతూనే ఉంటుందన్న స్పృహను మనం కోల్పోవద్దు. దానిని కోల్పోతే మన ఉనికే ప్రశ్నార్థక మవుతుంది.

దేశంలో అత్యున్నత న్యాయస్థానం ఉద్యోగ వర్గానికి వ్యతిరేకంగా తీర్పు యిస్తే దానిని సరిచేయవలసిన బాధ్యత కేంద్ర ప్రభుత్వం మీద ఉంది. ఎన్నికలలో ఓట్ల వేటలో అన్ని వర్గాలకు వరాలమీద వరాలు కురిపిస్తున్న ప్రభుత్వం ఈ విషయం పై నోరు విప్పడం లేదు. ప్రపంచ బ్యాంకు విధానాలలో "కార్మిక వర్గాన్ని అదుపు చేసే కఠినమైన చట్టాలు చేయాలి" అన్న షరతు కూడా ఉన్నది. ఎన్నికల అనంతరం తాము మళ్లీ గెలిస్తే "ఏరు దాటి తెప్ప తగుల పెట్టి" నట్లు లోటును పన్నుల బాదుడు ద్వారా పూడ్చుకోవచ్చునని, అప్పుడు పోరాటాలు ఉధృతంగా జరిగితే ఈ 'సమ్మె నిషేధ' అస్త్రాన్ని వాడుకోవాలనే కుట్ర కేంద్ర ప్రభుత్వ మౌనంలో దాగివుంది.

సమ్మె హక్కు కోసం ఉద్యమించడమే కాదు. నూతన ఆర్థిక విధానాల వల్ల, విద్యా రంగ ప్రైవేటీకరణ వల్ల జరుగుతున్న విద్యా వ్యాపారం, కాంట్రాక్టు నియామకాలు, పెన్షనర్లకు డిఏ కోత లాంటి అన్ని సమస్యల ఎడల మన నిరసనను తెలుపాలి. కోరిక, కోపం ఉంటే చాలదు - సమయం వచ్చినపుడు దానిని స్పష్టంగా వెల్లడించాలి, దృఢంగా ఆచరణలో పెట్టాలి. 'ఉద్యమే నహి సిద్ధ్యంతే - కార్యాణి, న మనో రథైః'. ఈ సమ్మెలో మనం పాల్గొనడమే కాదు- మేధావి వర్గంగా మనం వివిధ జీవన రంగాలకు చెందిన ప్రజలను కూడా ప్రోత్సహించి, చైతన్యపరచి ఈ సమ్మెలో పాల్గొనేటట్లు చేయాలి.

ఈ సమ్మె ఆషామాషీగా జరగడం లేదు. మన అందరి జీవన్మరణ సమస్యతో ఇది ముడి పడి ఉంది. ఈ సమ్మె ఎంత పెద్ద ఎత్తున జరిగితే అంతగా పాలక వర్గాలు తమ ప్రజావ్యతిరేక విధానాల నుండి వెనుకకు తగ్గుతాయి. లేక పోతే విజృంభిస్తాయి. ఫలితంగా మనమే కాదు అందరం- దేశం మొత్తం- అధః పాతాళానికి పోవలసి వస్తుంది. అందుకని దేశ వ్యాప్తంగా అన్ని వర్గాల కార్మికులు, ఉద్యోగులు ఫిబ్రవరి 24 సమ్మెలో పాల్గొని సంఘటిత శక్తిని ప్రదర్శించడానికి, నిరసనను తెలుపడానికి సంసిద్ధులు అవుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా అన్ని ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాలు సమ్మెకు పిలుపునిచ్చాయి. కావున ఉపాధ్యాయులందరూ ఈ సమ్మెలో పాల్గొని తమ పోరాట పటిమను చూపాలని ఆ విధంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజా, ఉద్యోగి వ్యతిరేక విధానాలను తిప్పి కొట్టాలని కోరుతున్నాము.

"మనం ముందుకు పోతాం- ప్రపంచం మన వెంట వస్తుంది"- శ్రీశ్రీ



राष्ट्रपति के प्रेस सचिव
Press Secretary to the President



राष्ट्रपति सचिवालय
राष्ट्रपति भवन
नई दिल्ली - 110004
President's Secretariat
Rashtrapati Bhavan
New Delhi - 110004

*The President of India Dr.A.P.J.Abdul Kalam, is happy to know that the 9th State Level Educational Conference of the Andhra Pradesh United Teachers' Federation is being held during December, 28-31, 2003 at Hyderabad.*

*The President extends his warm greetings and felicitations to the organisers and the participants and wishes the Conference all success.*

*Sd/-*
*PRESS SECRETARY TO THE PRESIDENT.*

---

**Prof. K.N. Panikkar,**
Vice Chancellor
Sri Shankaracharya Samskruta Vishwa Vidyalaya
Kaladi, Kerala

25.12.2003.

Dear Mr. Narayana,

I am glad to learn that the state level Educational Conference is taking place in Hyderabad from 28 to 30 of December 2003. I am sure that the conference would address the challenges education system is facing from the onslaught of communalism and globalisation. I wish the conference all success.

Regards,

Yours sincerely
K.N.Panikkar

---

**PRO. YASH PAL**
Former Chairman, U.G.C,
New Delhi,

*Dear Mr. Narayana,*

My best wishes for the success of your conference. One needs some fresh thinking to contribute in that direction. Iam attaching a recent piece I wrote on this topic.

Sincerely,
**YASH PAL.**

---

**Prof. ANIL SDGOPAL**
Dept. of Education,
University of Delhi & Senior Fellow,
Nehru Memorial Museum & Library,
New Delhi.

24th December, 2004

*Dear Mr. Narayana,*

I am happy to note that the 9th State-level Conference of A.P. United Teachers' Federation will be held from 28th to 31st December 2003. I know that your organization is one of the leading Teachers' organization of the country. My participation in your Vijayawada Conference earlier this year convinced me of the great potential APUTF has in determining the future of India's education.

You are aware of the great dangers that are ahead of us due to the intervention in our education system by the World Bank and several other international funding agencies. I spoke about these dangers at the Vijayawada Conference. I am attaching herewith two of my recent articles from Frontline (December 5, 2003) and Hindustan Times (November 11, 2003) (in 3 files) for your reference. I demonstrate in these articles how our policy regarding women's education has been diluted as a result of globalization agenda and how the State is abdicating itself of its Constitutional obligations.

You must be aware of the two drafts of 'Free and Compulsory Education Bill, 2003' prepared by the Union Government. The second draft is more alarming than the first one. There is a brief observation on this in my Frontline article. The first draft legitimised discriminatory education and proposed to penalize the poor parents. The second draft retains all these deformities and adds a proposal to establish a parallel structure (parallel to Government, Zila Parishads and Village Panchayats) to control elementary education from the Centre down to State, District, Block and habitation levels. This is being done in order to provide Sangh Parivar a space for controlling schools. The second draft is dated 10th December 2003 – obviously written to consolidate the recent electoral victory of BJP in three States. It poses a major danger to Indian unity. The Ministry says that its copies were sent to all the State Govts. But none replied. What about AP Govt.? The first draft can be downloaded from the Ministry of HRD website. The second draft is still not there. You must pass a resolution against the Bill and urge political parties to resist it in the Parliament. It is likely to be presented in the next session.

I take this opportunity to convey my best wishes to APUTF for a successful convention. I sincerely hope that you will resolve to resist the imperialist design on Indian education and struggle to re-establish the Constitutional agenda of building a secular, democratic, egalitarian and resurgent India.

Regards.

Yours Sincerely,
**ANIL SADGOPAL**

---

**WORLD FEDERATION OF TEACHERS' UNIONS**
Federation International Sindicl De la ensenanza
(Phone & Fax: 9133 2557 -1293, Email fise 1 @vnsl.net)
6/6 Kalicharan Ghosh Road, Kolkata - 700 050
www.fise-worldteachers.

Dear Friend,

I find great pleasure in sending warm felicitations to the delegates attending the 9th State Level Educational conference of A.P.U.T.F. and wishing the conference great success.

Your Conference is meeting at a crucial time when the anit-people offensive of capitalist globalisation is playing havoc with the education system of the developping countries. Union government of India is working ruthlessfully to dismantle the public education system painstakingly built in the last five decades after independence. Efforts are also being made to instill communal and obscurantist ideas in the young minds by subverting our national curricula. Your conference will certainly deal with the above among other issues.

FISE is going to organise an international seminar on Public funded Education in the context of Globalisation on 18th January 2004 as part of the World Social Forum in Mumbai. We expect many colleagues from A.P.U.T.F. to attend this programme and the WSF.

Once gain I wish you all the best on behalf of FISE and personally on my own behalf.

**Mrinmoy Bhattacharyya,**
General secretary
World Federation of Teachers' Unions (FISE)

****

## సెంటర్ ఆఫ్ ఇండియన్ ట్రేడ్ యూనియన్స్

ఆంధ్రప్రదేశ్ కమిటీ

1-1-60/4, ఎన్.వి.బి. స్మారక కేంద్రం, ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్

హైదరాబాదు-20 ఫోన్.27612474

అధ్యక్షులు: సి. హెచ్. నర్సింగరావు, ప్రధానకార్యదర్శి:యస్. వీరయ్య

తేది. 27.12.2003

కామ్రేడ్ నారాయణ గారికి,
ప్రధానకార్యదర్శి
యునైటెడ్ టీచర్స్ ఫెడరేషన్
హైదరాబాదు.

కామ్రేడ్,

9వ రాష్ట్ర మహాసభలు జరుపుకుంటున్న యు.టి.యఫ్. సభ్యులకు మరియు నాయకులకు సి.ఐ.టి.యు. అభినందనలు తెలుపుతున్నది.

యు.టి.యఫ్. తన సభ్యుల సమస్యలపైనే కాక, ప్రజల సమస్యల పైన మరియు సమాజ అభ్యున్నతికి కృషి చేస్తున్నది. ప్రభుత్వ విధానాల కారణంగా కరువు బారిన పడిన పీడిత ప్రజలకు అంబలి కేంద్రాలు నిర్వహించడం ద్వారా ఇతర సంఘాలకు యు.టి.యఫ్. ఆదర్శంగా నిలిచింది. పలు అభిప్రాయాలు కలవారినందరినీ ఐక్య ఉపాధ్యాయ వేదిక పైకి సమీకరించడంలో యు.టి.యఫ్. ఆదర్శవంతంగా నిలుస్తున్నది.

సి.ఐ.టి.యు. మరియు యు.టి.యఫ్ లకు ప్రధాన అంశాలన్నింటి పై ఏకాభిప్రాయం ఉన్నది. రాష్ట్రంలోని ఉపాధ్యాయులు, ఉద్యోగుల మరియు కార్మికుల ఐక్యతను పెంపొందించడంలో మనం మరింత పట్టుదలతో కృషి చేద్దాం.

ప్రభుత్వ విధానాల కారణంగా నేడు విద్య అంగట్లో సరుకుగా మారింది. కొనగలిగే వారికే చదువు లభ్యమయ్యే పరిస్థితి నెలకొంది. రాష్ట్రంలో ప్రస్తుతం నెలకొన్న పరిస్థితులలో ఉపాధ్యాయ ఉద్యమాన్ని ఐక్యం చెయ్యడంలో యు.టి.యఫ్. అగ్రగామిగా నిలవాలని, యు.టి.యఫ్. మరింత శక్తివంతం కావాలని సి.ఐ.టి.యు కోరుకుంటున్నది. ఈ దిశగా 9వ రాష్ట్ర మహాసభలు తీసుకునే నిర్ణయాలు యు.టి.యఫ్. ఉద్యమ చరిత్రలో మైలురాళ్ళు కావాలని, మహాసభలు జయప్రదమవ్వాలని సి.ఐ.టి.యు. ఆకాంక్షిస్తున్నది.

**ఎస్.వీరయ్య**
ప్రధానకార్యదర్శి

## ALL BENGAL PRIMARY TEACHERS' ASSOCIATION

89, Mahtma Gandhi Road Culcutta - 700 007
(Affiliated to FISE)
Rcognised by the Govt. of West Bengal REG.No. 9349)

Dear Comrade,

Many thanks for your invitation to participate in the 9th Educational Conference of Andhra pradesh United Teachers' Federation to be held on 28th to 31st December, 2003. Iam trying my level best to participate personally in your State Conferece.

Friends, all of you are fully aware that the present situation and the system of Education of our country is in a critial juncture. The B.J.P. led NDA govcernments policy of privatisation, down sizing of government departments, the process of closure of Offices, retrenchment of staff in central offices and communalize the entire education system has created a severe dengerous situation in our country. The Liberal economic policy of the second generation pursued by NDA Govt. has brought about serious menace to the education system of the country. The budget provision for education is slashed down and the heinous attack on the common people is a great challenge before the nation. But through our experience from the glorious movement through out the country, firmly believe that the present challenge must be defeated by the united massive movement of the entire common pople.

I am fully aware the remarkable teachers' movement in your state under the leadership of Andhra Pradesh United Teachers' Federation. On behalf of the All Bengal Primary Teachers' Association I would like to convey our heartfelt revolutionary greetings to the participating delegates of the conference. I wish grand success of the conference.

Withe greetings,
**PRADIP BISWAS**
General secretary

Kolkata
Dt. 25.12.2003

## రాజస్థాన్ శిక్షక్ సంఘ్

(షెఖావత్)

**994-95, శిక్షక్ భవన్, రాంనగర్, శాస్త్రీనగర్**
**జైపూర్ -16**
ఫాక్సు **0141-2303312** ఫోన్-**2300847**

| | |
|---|---|
| సుల్తాన్ సింహ ఓలా | విద్యాధర సింహ గిల్ |
| అధ్యక్షులు | సభాధ్యక్షులు |
| సురేంద్రగర్గ | భవర్ పురోహిత్ |
| కోశాధికారి | రాష్ట ప్రధానకారదర్శి |

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
అధ్యక్షులు/ప్రధానకార్యదర్శి
ప్రియమైన కామ్రేడ్స్,

మీ సంఘం 9వ రాష్ట్ర మహాసభల ఆహ్వానం మా సంఘకార్యకర్తలు అందరికీ ఆనందం కలిగించింది. ఇటీవల దేశంలో కార్మికులు, ఉపాధ్యాయుల పోరాటాలకు వ్యతిరేకంగా ప్రభుత్వం, దాని వివిధ అంగాలు, ప్రత్యేకించి న్యాయస్థానాలు, కుమ్మక్కై దాడులు చేస్తున్నాయి. ప్రజాస్వామ్యంలో ప్రాథమిక హక్కుఅయిన సమ్మెను నిషేధించి, దాని ఉనికినే ప్రశ్నిస్తున్నాయి ఈ నేపధ్యంలో జరుగుతున్న మీ మహాసభలకు అత్యంత ప్రాధాన్యత ఉంది

మీ మహాసభలు ఆమోదించే తీర్మానాలలో వచ్చే ఫిబ్రవరిలో జరుగనున్న దేశవ్యాప్త సమ్మె విషయం కూడా ఉంటుందని, ఆ సమ్మె సంపూర్ణంగా విజయవంతం కావడానికి మీరు అన్ని విధాలా కృషి చేస్తారని మేము విశ్వసిస్తున్నాము.

రాజస్థాన్ శిక్షక్ సంఘ్ (షెఖావత్)కు చెందిన మేమందరం మీ మహాసభలు విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాము.

రైలు టిక్కెట్టు లభ్యంకానందున మా సంఘప్రతినిధులం ఎవరమూ ఈ మహాసభలలో పాల్గొనలేక పోతున్నందుకు విచారిస్తున్నాము మేము రాలేక పోతున్నందుకు క్షమించాలని కోరుతున్నాము.

జయకరణ్ సింహ షీల్
కార్యాలయ కార్యదర్శి

## స్పందన



*Dr. P.Sai Nath*
*International Awards Winning Journalist*
*Mumbai.*

Dear Narayana,

I was most impressed and astonished by the scale and success of the UTF Conference in Hyderabad. My congratulations to the organisers. Without total dedication that kind of mobilisation is simply not possible.. I was also happy to be invited to particpate in the conference. It is not every day that one goes to a conference of 12,000 to 15,000 delegates.

May I offer a few words by way of friendly suggestions? This is a suggestion I make to all such bodies like the UTF, public sector employees, all the progressive bodies whose strength we all wish to see enhanced. I do appreciate that my knowledge of the preparatory stages being very limited, I may be making suggestions that in some ways were already followed. Nonetheless, I offer these for what they are worth,

It is very difficult for people who have come huge distances, even with such enthusiasm, to sit in one place and listen to four days of speeches. In sessions in which they individually have little to do. when we do that, we are making very heavy demands on their patience and endurance. I know that I would never last four days of speeches, so I would not ask it of others.

Secondly, these teachers are the eyes and ears of the progressive movements. the ones who really know what is happening to education at the micro level in the small town and village In the class rooms and playgrounds. It seems to me a great loss if after bringing them all there, we are not drawing on this phenomenal pool of knowledge. The education sector displays the impact of the problems of all other sectors - health, poverty, agriculture etc., and it is very important to gather and distil their knowledge. They are among the finest sources we have.

They should be active participants right through, not listeners only. This is very possible, Particularly with sections like teachers. This February (2003) I was privileged to be at the KSSP conference in Kannur and watched in amazement as they managed to not only involve every single delegate in some activity they also managed to involve hundreds of families in nearby villages in the content and discussions of the conference.

In practical terms how could such a situation be achieved?

Firstly by holding not just one delegates session but by making most of the sessions revolve around the delegates and their professional expertise and between, every now and then there could be a plenary session where your public speakers come in to the picture.

For instance: there could be a workshop for Science teachers. those teachers could discuss various Problems confronting them in their sector. People could be asked to document and present meterial on Science and Astrology, on the bogus science the hindutvavadis are trying to promote and possible ways of countering this degradation of science.

Also for instance, a workshop of history teachers where all the problems and issues and progress of that sector are examined in public. The saffronization of textbooks, the falsification of history - how to counter it. While India has many outstanding, brilliant progressive historians, I have always believed the teacher in the village class room could wield as much clout as they do and in some situations more. There could be discussions on how to make the writting of good history textbooks more accessible to the young readers in the classrooms.

This does not stop the conference from having outside speakers. In fact, it would allow them to deploy those speakers far more effectively. For instance, the text book experts could interact with teachers in the session on textbooks. They would not only impart specialised knowledge to the teachers. They would learn a great deal themselves that would help them make their work more effective. The Progressive scientist you bring to the conference could similarly intervene, add to and benefit from the Science teachers workshop.

Or a session on education and the Media. Many in the media are woefully ignorant of what is happening in the schools that cater to poor children. All this does not prevent the organisers from also holding plenary sessions where they can bring in top political leaders etc.,

The greatest benefit of this model would be deepening the personal involvement of each and every teacher in the prgressive movement in adding their many individual and collective strengths to the process. In enriching the existing pool of knowledge on education. In educating the experts and the public about what is really going on at the ground level and in building the identification with involvement in and commitment to the progressive movement of each and every teacher who comes there.

With warm regards to you and all my teacher colleagues.

*SAINATH*

****

## విరాళములు

### ఐక్య ఉపాధ్యాయకు

| | |
|---|---|
| ఎ. భానుఋషి (వరంగల్) | 516 |
| ఎస్. సాంబ శివ రావు | 558 |

### ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌కు

| | |
|---|---|
| పి. ఆదినారాయణ (తూ॥గో) | 500 |
| వై. సత్యనారాయణ (తూ॥గో) | 500 |
| డి. సత్యవతి (తూ॥గో) | 558 |
| ఎం. గురుమూర్తి (విజయనగరం) | 300 |
| కె. సాంబయ్య (నల్లగొండ) | 520 |
| ఎం.పి. రంగా రావు (ప్రకాశం) | 516 |

### ఎ.వి.ఎస్. స్మారక నిధి

| | |
|---|---|
| జి. నర్సింహా రావు (కృష్ణా) | 1000 |

### తమిళనాడు ఉద్యోగుల సహాయ నిధి

| | |
|---|---|
| సిహెచ్. లక్ష్మి కుసుమ కుమారి | 500 |

## కేంద్ర ప్రభుత్వ మధ్యంతర బడ్జెట్‌లో ఎన్నికల తాయిలాలు (3.2.2004)

1. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు బేసిక్‌లోకి 50% డి.ఎ. విలీనం.
2. రైతులకు క్రెడిట్, ఇన్సూరెన్సు పథకాలు
3. మరోక 50 లక్షల కుటుంబాలకు "అంత్యోదయ అన్న యోజన" పథకం
4. పెద్ద పట్టణాలలో మెగా నీటి పథకం
5. ఆరు రాష్ట్రాలలో స్పెషాలిటీ ఆసుపత్రులు
6. దూరపు దీవులలో నియమించే వారికి 25% ప్రత్యేక అలవెన్సు.
7. ఆర్థికంగా వెనుక బడిన వారి ఆదాయ గరిష్ఠ పరిమితి 2.5 లక్షలకు పెంపు.

## భారత ఐ.టి. పరిశ్రమ పై అమెరికా వేటు

ఫెడరల్ ప్రభుత్వం కాంట్రాక్టులు పొందిన అమెరికన్ కంపెనీలు చౌకగా ప్రాజెక్టులను పూర్తి చేసేందుకు వీలుగా భారత్, ఇతర దేశాల కంపెనీలకు సబ్ కాంట్రాక్టులు ఇవ్వడాన్ని నిషేధిస్తూ అమెరికన్ సెనేట్ జనవరి 23న ఒక ఒక బిల్లును ఆమోదించింది.

స్థానికులకు ఉద్యోగాలు పోతున్నాయని అందుచే విదేశీయులను ఉద్యోగాలలోకి రాకుండా చేయడానికి, అమెరికా, బ్రిటన్లు ఈ ఔట్‌సోర్సింగ్‌కు దిగాయి.

ఇతర దేశాలు మాత్రం ప్రపంచానికి అన్ని రంగాలలో ద్వారాలు తెరిచి ఉండాలని శ్రీరంగ నీతులు చెప్పే అమెరికా తన రక్షణార్థం ఔట్‌సోర్సింగును నిషేధించడం దాని ద్వంద్వప్రమాణాలకు నిదర్శనం.

## సార్వత్రిక సమ్మెకు కార్మిక నేతలు సమాయత్తం

బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం అవలంబిస్తున్న, కార్మికవర్గ వ్యతిరేక ధోరణులకు నిరసనగా కార్మిక లోకం తమ నిరసన తెలియజేసేందుకు ఫిబ్రవరి 24న కేంద్ర కార్మిక సంఘాలు నిర్వహించతలపెట్టిన సార్వత్రిక సమ్మెను రాష్ట్రంలో విజయవంతం చేయడానికి రాష్ట్ర కార్మిక సంఘాలు పలు విస్తృత కార్యక్రమాలను చేపట్టాయి. హైదరాబాదులో జరిగిన ఒక విలేకరుల సమావేశంలో పొట్లూరి నాగేశ్వర రావు (ఎఐటియుసి) ఎస్. వీరయ్య (సిఐటియు) ఎన్. నారాయణ(యుటియఫ్) పి. సుబ్బారెడ్డి (ఎస్‌టియు) ఎం. జనార్ధనరెడ్డి (ఎపిపిఎస్ఇఎస్) బి.ఎస్.రాంబాబు (ఆర్థిక రంగ ఉద్యోగుల సమన్వయ సంఘం) వి. నాగేశ్వర రావు (సిసిఇడబ్ల్యు) బి.వి. సుబ్బారావు (ఎపిఎన్‌జిఓ) నరసింహన్ (కేంద్రప్రభుత్వ ఉద్యోగుల సమాఖ్య) తదితరులు మాట్లాడుతూ జనవరి 25వ తేదీ నుంచి ఫిబ్రవరి 7 వరకు అన్ని జిల్లాల్లో విస్తృతంగా సదస్సులు, జనవరి 30న నగరంలోని గాంధీభవన్‌లో రాష్ట్రస్థాయి సదస్సు, ఫిబ్రవరి 5వ తేదీ నుంచి 23 వరకు పారిశ్రామిక వాడల్లోను, పట్టణాలలోను గేటు మీటింగ్‌లు, సమావేశాలు నిర్వహిస్తున్నామని చెప్పారు. 24న కేంద్ర కార్మిక సంఘాలు-వాటి అనుబంధ కార్మిక సంఘాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు, బ్యాంకు, ఎల్ఐసి, రవాణా, ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాలు, పబ్లిక్ సెక్టార్, కో-ఆపరేటివ్, ప్రైవేటురంగకార్మికులు, అసంఘటిత కార్మికులు చైతన్య వంతంగా సమ్మెలో పాల్గొని దోపిడీ వర్గాలకు దళారి పాత్రధారులయిన పాలకులకు తగిన బుద్ధి చెప్పాలని వారు పిలుపు నిచ్చారు.

ఉద్యోగులకు సమ్మె హక్కులేదని ప్రకటించిన సుప్రీంకోర్టు తీర్పును ఉద్యోగులు, కార్మికులు యావత్ మేదావి వర్గం, ప్రజాస్వామిక వాదులు తిరస్కరించినప్పటికీ, కేంద్ర ప్రభుత్వం తదనుగుణంగా చేపట్టవలసిన చర్యల పట్ల మౌనం వహించి వింత పోకడలతో వ్యవహరించడం పుండు మీద కారం చల్లినట్లుగా కార్మికలోకం భావిస్తున్నదని వారు చెప్పారు. ప్రభుత్వాలు ప్రజల ఆస్తులైన ప్రభుత్వ రంగాన్ని స్వదేశీ, విదేశీ గుత్త కంపెనీలకు కారు చౌకగా అప్పగించి, ప్రపంచబ్యాంకు కనుసన్నల్లో వ్యవహరిస్తూ ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగులను పెంచుతున్నదని, ప్రజల ఆరోగ్యాన్ని, విద్యను పూర్తిగా మార్కెట్ శక్తులకు ధారాదత్తం చేస్తున్నాయని వారు ఆరోపించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రైవేటీకరణను అతివేగంగా అమలు చేస్తున్నాయని, ఉద్యోగులకు భద్రత కరువైందని, కొత్త పెన్షన్ పేరుతో ఉద్యోగుల పెన్షన్‌ను బహుళజాతి కంపెనీలకు తాకట్టు పెడుతున్నారని, ఖాళీ పోస్టులను భర్తీ చేయడం లేదని వారు అన్నారు. రాష్ట్రంలో గత 40 రోజులుగా సమ్మె చేస్తున్న జూనియర్ డాక్టర్ల డిమాండ్ల విషయంలో రాష్ట్ర ప్రభుత్వం నిర్లక్ష్యధోరణిని అవలంబిస్తున్నదని వారు అన్నారు. దేశంలోని 37 కోట్ల అసంఘటిత కార్మికులపై కేంద్ర ప్రభుత్వం మొసలి కన్నీరు కారుస్తూ వారికి రాజ్యాంగ బద్ధంగా అందవలసిన ప్రయోజనాలను సైతం తృణీకరిస్తూ, ఉపాధి హామీ, ఆరోగ్యబీమా, పెన్షన్ పథకాలకు ఉద్దేశించబడిన సమగ్ర శాసనాన్ని తొక్కి పెడుతున్నదని వారు నిశితంగా విమర్శించారు.

## వారం రోజుల్లో లక్ష్మణ్ మూడో సెంచరీ

క్రికెట్‌లో హైదరాబాదుకు చెందిన వివిఎస్ లక్ష్మణ్ జైత్రయాత్ర కొనసాగుతోంది. జింబాబ్వేతో శనివారం జరిగిన మ్యాచ్‌లో సెంచరీ సాధించడం ద్వారా భారత్‌ను ఫైనల్‌కు చేర్చడంలో లక్ష్మణ్ ప్రధాన భూమిక పోషించారు. వారం రోజుల్లో మూడో సెంచరీ (138 బంతులు-13 ఫోర్లు, 1 సిక్సర్‌తో 131) చేసిన ఈ వెరీవెరీ స్పెషల్ (వివిఎస్) ఆటగాడికి ఇది వరుసగా రెండో శతకం కావడం విశేషం. అంతేగాక ఈ మ్యాచ్‌లో లక్ష్మణ్ అద్భుతమైన క్యాచ్‌లు అందుకుని ఫీల్డింగ్‌లోనూ తన సత్తాచూపాడు. జింబాబ్వే జట్టు నాలుగు బంతుల్లో ఏడు పరుగులు చేయాల్సిన ఉత్కంఠభరిత క్షణాల్లో ఆండీబ్లిగ్నాట్‌ను పెవిలియన్‌కు పంపేందుకు మిడ్‌వికెట్‌లో లక్ష్మణ్ పట్టిన క్యాచ్ ప్రశంసలనందుకుంది. బ్యాటింగ్ సమయంలో కేవలం నాలుగు పరుగులకే మూడు వికెట్లు కోల్పోయిన క్లిష్ట పరిస్థితి నుంచి జట్టును ఒడ్డుకు చేర్చేందుకు లక్ష్మణ్ బాధ్యతని భుజానికెత్తుకున్నాడు. రాహుల్ ద్రావిడ్ (56)తో కలిసి 133 పరుగుల భాగస్వామ్యంలో పాలుపంచుకున్న లక్ష్మణ్ తర్వాత రోహన్ గవాస్కర్‌తో మరో విలువైన భాగస్వామ్యం ఏర్పరచాడు. అద్భుతమైన పుల్‌షాట్లు, కవర్ డ్రైవ్‌లతో అలరించిన లక్ష్మణ్ మరోసారి 'మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్' అవార్డును కైవసం చేసుకున్నాడు.

## హైకోర్టు తీర్పుతో తమిళనాడు ఉద్యోగులకు ఒకింత ఊరట

తమిళనాడు రాష్ట్రంలో ప్రభుత్వ ఉద్యోగులు, ఎయిడెడ్ టీచర్స్, తమ రిటైర్మెంట్ బెనిఫిట్స్‌పై విధించిన కోతల నుండి బయట పడటానికి నిర్వహించిన సమ్మెను జయలలిత ప్రభుత్వం అమానవీయంగా అణచివేసింది. ఉద్యోగులను సామూహికంగా బర్తరఫ్ చేసి, అరెస్టులకు పాల్పడింది. మూడు రోజులు పాటు సాగిన సమ్మెలో ఉద్యోగులు అనేక నిర్బంధాలకు గురయ్యారు.

ప్రభుత్వ ఉత్తర్వులను త్రిప్పికొట్టే నేపథ్యంలో కొన్ని సంఘాలు దాఖలు చేసిన రిట్ పిటిషన్లను పరిష్కరించడంలో జస్టిస్ పి.కె. మిశ్రా మరియు ఎఫ్.ఎమ్. ఇబ్రహీమ్‌లతో కూడిన డివిజనల్ బెంచ్ తమిళనాడు ప్రభుత్వం మార్చి 19న విడుదల చేసిన జి.ఓ.నెం.72 మరియు జి.ఓ.73లను కొట్టివేసింది. ప్రభుత్వం జి.ఓ. 72లో ఉద్యోగులు రిటైర్మెంట్ సమయంలో తమ యొక్క ఆర్జిత సెలవును నగదుగా మార్చుకొనే అవకాశాన్ని 330 నుండి 300కి కుదించింది. జి.ఓ. 73లో రిటైర్ అయిన ఉద్యోగులు చేసుకొనే కమ్యుటేషన్‌లో కోతను 4 శాతం నుండి 8 శాతానికి పెంచింది. ఈ రెండు జి.ఓ.లను హైకోర్టు కొట్టివేయడం తమిళనాడు ఉద్యోగులకు కాస్త ఊరట ఇచ్చిన మాట వాస్తవమే అయినప్పటికి ఇంకో రెండు ఉత్తర్వులను జి.ఓ. 71 మరియు జి.ఓ. 74లను కోర్టు సమర్థించడం విచారకరం.

వీటిలో ఒక జి.ఓ.లో ప్రభుత్వ ఉద్యోగులు పూర్తి పెన్షన్ పొందే సర్వీసు పరిమితిని ప్రస్తుతం వున్న 30 సంవత్సరాల నుండి 33 సంవత్సరాలకు పెంచింది. మరియొక్క ఉత్తర్వులో పెన్షన్ కమ్యూటేషన్ గరిష్ఠ పరిమితిని ప్రస్తుతం వున్న 40 శాతాన్ని 33.33 శాతానికి కుదించింది.

# యుటియఫ్ ఉద్యమంలో ఉజ్వల ఘట్టం

# 9వ రాష్ట్ర విద్యావైజ్ఞానిక మహాసభలు

- నాగటి నారాయణ,
యుటియఫ్ ప్రధానకార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 9వ రాష్ట్ర విద్యావైజ్ఞానిక మహాసభలు ప్రప్రథమంగా హైదరాబాద్ లో 2003 డిసెంబర్ 28,29,30,31 తేదీల్లో అత్యంత వైభవోపేతంగా జరిగాయి. రాష్ట్ర రాజధాని నగరంలో జరిగిన ఈ మహాసభలు ఐక్య ఉపాధ్యాయ ఉద్యమంలో నూతన అధ్యాయాన్ని సృష్టించాయి. హైదరాబాద్ నగరంలో దోమల్ గూడలోని సువిశాలమైన ప్రభుత్వ వ్యాయామ విద్యా కళాశాల ఆవరణలో యుటియఫ్ నిర్మాత అమరజీవి అప్పారి వెంకటస్వామి నగర్‌గా అలంకరించబడిన ప్రాంగణం మహాసభల వేదికగా వెలిగిపోయింది. కార్యకర్తలు అహోరాత్రులు శ్రమించి లిబర్టీ సెంటర్, గగన్‌మహల్ వీధులను స్వాగత ద్వారాలు, తోరణాలు, బేనర్‌లతో శోభాయమానంగా అలంకరించారు.

## గురుజన ప్రభంజనం

డిసెంబర్ 28 తెల్లవారు జామున జంట నగరాల్లో ఎక్కడ చూసినా జనం జనం... గురుజన ప్రభంజనం! సికింద్రాబాద్, కాచిగూడ, నాంపల్లి రైల్వే స్టేషన్‌లు; మహాత్మాగాంధీ (ఇమ్లీబన్) బస్‌స్టేషన్, జూబ్లీ బస్‌స్టేషన్- అన్నీ ఉపాధ్యాయులతో కిక్కిరిసిపోయాయి. టూరిస్ట్ బస్సులు, వ్యాన్‌లు, కార్లు మహాసభల ప్రత్యేక వాహనాలు ప్రధాన రహదారుల్లో ఎల్లెడలా కనబడ్డాయి. ఈ మహాసభలలో 20 వేల మంది పైగా ఉపాధ్యాయులు పాల్గొన్నారు. వారందరికీ మహాసభల ప్రాంగణానికి 5 కి.మీ. ల పరిధిలో గల 20 కేంద్రాల్లో వసతిని సమకుర్చబడింది. మహాసభల ప్రాంగణానికి సమీపంలోని స్కౌట్స్, గైడ్స్ ఆవరణలో భోజనశాలను ఏర్పాటు చేశారు.

## ఉత్తేజభరితంగా సాగిన పతాక యాత్రలు

యుటియఫ్ గత మహాసభలు జరిగిన ఎనిమిది ప్రాంతాల నుండి పతాక యాత్రలు బయలుదేరి దారిలో ముఖ్య కేంద్రాలలో ఉపాధ్యాయుల స్వాగతాలను అందుకుంటూ 27.12.2003 రాత్రికి హైదరాబాదుకు చేరాయి.

ప్రథమ మహాసభ జరిగిన రాజమండ్రి, ఎనిమిదవ- రజతోత్సవ మహాభలు జరిగిన కాకినాడల నుండి 17 వాహనాలలో 175 మందితో బయలు దేరిన తూర్పు గోదావరి జిల్లా పతాక యాత్ర కొవ్వూరు, కొయ్యలగూడెం, జంగారెడ్డి గూడెం ద్వారా ఖమ్మం జిల్లా సత్తుపల్లికి చేరింది.

ఖమ్మం నుండి బయలుదేరిన పతాక యాత్ర ఇల్లెందు, మానుకోట (మహబూబాబాద్), వరంగల్లు, హనుమకొండ, జనగాం, ఆలేరు, భువనగిరి మీదుగా హైదరాబాదుకు చేరింది.

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం నుండి బయలుదేరిన పతాక యాత్ర 100 మందితో ఏలూరు, చింతలపూడి మార్గంగా సత్తుపల్లికి చేరింది. ఈ రెండు బృందాలు కలసి ఖమ్మంలో విశ్రాంతి తీసుకొని మరుసటి రోజు నల్లగొండ జిల్లాలో ప్రవేశించి సూర్యాపేట, నకిరేకల్లు, నల్లగొండల ద్వారా హైదరాబాదుకు చేరాయి.

విజయవాడ నుండి బయలుదేరిన కృష్ణా జిల్లా పతాక యాత్ర నందిగామ, జగ్గయ్యపేట, కోదాడ, సూర్యాపేట, చౌటుప్పల మీదుగా హైదరాబాదు చేరింది.

నెల్లూరులో 10 మందితో బయలుదేరిన పతాక యాత్ర బుచ్చి, ఆత్మకూరు, మర్రిపాడులలో స్వాగతం అందుకుంటూ కడప జిల్లాలో ప్రవేశించి బద్వేలు, మైదుకూరు ద్వారా కర్నూలు జిల్లాలోకి ప్రవేశించింది. చాగలమర్రి, ఆళ్లగడ్డ, నంద్యాల, కర్నూలులలో సభలను నిర్వహించి మహబూబ్ నగర్ చేరింది. మహబూబ్ నగర్‌లో పెద్దఎత్తున ఊరేగింపు, సభ జరిగాయి. అక్కడ నుండి యాత్ర ఆ సాయంత్రం హైదరాబాదుకు చేరింది.

గుంటూరు నుండి బయలుదేరిన పతాక యాత్ర సత్తెనపల్లి మీదుగా పిడుగురాళ్లకు చేరింది.

ఒంగోలులో 20 మందితో రెండు వాహనాలలో బయలుదేరిన పతాక యాత్ర అద్దంకి, సంత మాగులూరులో స్వాగతాలు అందుకుంటూ పిడుగురాళ్లకు చేరుకుంది. అక్కడ నుండి గుంటూరు దళంతో కలసి దాచేపల్లి, మిర్యాలగూడెం, నల్లగొండల మీదుగా హైదరాబాదుకు చేరాయి.

ఈ విధంగా 10 జిల్లాలలోఅపూర్వంగా సాగిన పతాక యాత్రలు యుటియఫ్ ఆశయాలను, ఆదర్శాలను, కృషిని వివరిస్తూ, 9వ మహాసభల సందేశాన్ని ప్రచారం చేస్తూ, ప్రతి పట్టణంలో, మండల కేంద్రంలో ఘన స్వాగతాలు అందుకుంటూ హైదరాబాదుకు చేరుకున్నాయి.

## ప్రతిష్ఠాత్మకంగా పతాకావిష్కరణలు

మహాసభల ప్రాంగణం మధ్యలో యుటియఫ్ ఉద్యమ పతాకాలు ఆవిష్కరించ బడినాయి. తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి నుండి వచ్చిన ప్రథమ మహాసభల పతాకాన్ని సీనియర్ నాయకులు శ్రీ డి. రామిరెడ్డి, ఖమ్మం నుండి వచ్చిన 2వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర గౌరవాధ్యక్షులు శ్రీ పి. కృష్ణమూర్తి, పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం నుండి వచ్చిన 3వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర అధ్యక్షులు శ్రీ కె. జోజయ్య, కృష్ణా జిల్లా విజయవాడ నుండి వచ్చిన 4వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర సహాధ్యక్షులు శ్రీ ఎన్. రమణయ్య శాస్త్రి, నెల్లూరు నుండి వచ్చిన 5వ మహాసభల పతాకాన్ని సీనియర్ నాయకులు శ్రీ జి. చిట్టిబాబు, గుంటూరు నుండి వచ్చిన 6వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర కార్యదర్శి శ్రీ సిహెచ్. సుభాస్ చంద్రబోస్, ప్రకాశం జిల్లా ఒంగోలు నుండి వచ్చిన 7వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర కార్యదర్శి శ్రీమతి సి. కమల కుమారి, తూర్పుగోదావరి జిల్లా కాకినాడ నుండి వచ్చిన 8వ మహాసభలు- రజతోత్సవాల పతాకాన్ని రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. నారాయణ స్వీకరించి ప్రతిష్ఠించారు.

9వ మహాసభల పతాకాన్ని రాష్ట్ర అధ్యక్షులు శ్రీ కె.జోజయ్య

ఆవిష్కరించారు. అఖిలభారత ఉపాధ్యాయ సమాఖ్య (ఎస్.టి.ఎఫ్.ఐ.) జెండాను 'స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా' (ఎస్.టి.ఎఫ్.ఐ.) అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి ఆవిష్కరించారు. పతాకావిష్కరణల వేడుక జరిగినంత సేపూ నినాదాలు, హర్ష ధ్వానాలతో మహాసభల ప్రాంగణం మారు మ్రోగింది. ఖమ్మం జిల్లా కార్యదర్శి శ్రీ టి.వి. చలం బృందం యుటియఫ్ ఉద్యమ గీతాన్ని ఆలపించారు. అనంతరం శ్రీ జగన్ నాయకత్వం లోని ప్రజా నాట్యమండలి బృందం అరుణాంజలి గీతాన్ని ఆలపిస్తుండగా మహాసభల ప్రతినిధులు అమరవీరుల స్థూపానికి నివాళులు అర్పించారు.

సభల ప్రారంభంలో అమర జీవులు చెన్నుపాటి లక్ష్మయ్య, అప్పారి వెంకటస్వామి, మైనేని వెంకట రత్నం చిత్ర పటాలకు నాయకులు పూల మాలలు వేసి జోహారులు అర్పించారు. ప్రజానాట్య మండలి బృందం మహాసభ స్వాగత గీతాన్ని ఉత్తేజ కరంగా ఆలపించింది.

## జాతీయోద్యమ స్ఫూర్తినిచ్చిన ప్రారంభ సభ

ప్రముఖ స్వాతంత్ర్యోద్యమ నేత, నేతాజీ సుభాస్ చంద్రబోస్ నాయకత్వంలోని ఆజాద్ హింద్ ఫౌజ్ నాయకురాలు డా॥ కెప్టెన్ లక్ష్మీ సెహగల్ మహాసభలను ప్రారంభించారు. ఆమె తమ ఉపన్యాసంలో జాతీయోద్యమ స్ఫూర్తిని; జాతి నిర్మాతలుగా ఉపాధ్యాయుల కర్తవ్యాన్ని గుర్తు చేశారు. మతోన్మాదం, ప్రాంతీయ భేదాలు వంటి సామాజిక సమస్యల పరిష్కారానికి సాగే మహోద్యమంలో ఉపాధ్యాయులు గురుతర బాధ్యత వహించాలని ఆమె పిలుపు యిచ్చారు. రాష్ట్ర పాఠశాల విద్యాశాఖ మంత్రి శ్రీ మండవ వెంకటేశ్వర రావు మహాసభల్లో ముఖ్య అతిథిగా పాల్గొని ఉత్తేజపూరిత ప్రసంగం చేశారు. శరవేగంగా మారిపోతున్న సామాజిక పరిస్థితుల్లో ఉపాధ్యాయుల ప్రాధాన్యత ముందుకు వస్తోందన్నారు. ఉపాధ్యాయుల పట్ల సమాజ దృక్పథం పూర్తిగా మారి పోయిందని అన్నారు. ఇంత కాలం బతక లేని బడిపంతులు అనే వారు. కాని బ్రతుకు నేర్పేవారుగా ఉపాధ్యాయులు కీలక పాత్ర పోషించగలరని ఆయన పేర్కొన్నారు.

యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు శ్రీ కె. జోజయ్య ప్రారంభ సభకు అధ్యక్షత వహించారు. ప్రభుత్వం అనుసరిస్తున్న అనుచిత విధానాల కారణంగా విద్యారంగంలో ప్రమాణాలు పడిపోతున్న విషయాన్ని ఆయన తన ఉపన్యాసంలో వివరించారు. (పూర్తిపాఠం యిదే సంచికలో ఉంది). ఆహ్వాన సంఘం అధ్యక్షులు, ప్రముఖ విద్యావేత్త డా॥ చుక్కా రామయ్య తమ స్వాగతోపన్యాసంలో సమాజానికి దిశానిర్దేశం చేసే అర్హత ఉపాధ్యాయులకే వున్నదని ఉద్బోధించారు. పాఠశాల విద్యాశాఖ కమీషనర్ డా॥ మన్మోహన్ సింగ్ గౌరవ అతిథిగా పాల్గొని రాష్ట్రంలో విద్యాభివృద్ధికి ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలను, ఉపాధ్యాయ వృత్తికి పెరుగుతున్న డిమాండ్‌ను వివరించారు. సభావేదికపైన ఎస్.టి.ఎఫ్.ఐ. అఖిలభారత అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు, వివిధ రాష్ట్రాల ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు ఆసీనులయ్యారు.

## ప్రపంచీకరణ, మతోన్మాద ప్రమాదాలను ప్రతిఘటించాలన్న 'చైతన్య సదస్సు'

డిసెంబర్ 28 మధ్యాహ్నం జరిగిన చైతన్య సదస్సులో ఆంగ్లవారపత్రిక పీపుల్స్ డెమోక్రసీ సంపాదకులు శ్రీ సీతారాం ఏచూరి, జర్నలిజం లో అంతర్జాతీయ అవార్డుల విజేత డా॥ పాలగుమ్మి సాయినాథ్, ఆంధ్రజ్యోతి దిన పత్రిక సంపాదకులు శ్రీ కె. రామచంద్ర మూర్తి, ఉస్మానియా యూనివర్సిటీ జర్నలిజం శాఖలో అసోసియేట్ ప్రొఫెసర్ డా॥ కె. నాగేశ్వర్ విలువైన ప్రసంగాలు చేశారు. ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు శ్రీ డి. రామిరెడ్డి ఈ సదస్సుకు అధ్యక్షత వహించారు.

ప్రపంచీకరణ, కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న అపసవ్య విధానాలు విద్యారంగంపై ప్రతికూల ప్రభావాన్ని చూపిస్తున్నాయని, మతతత్వం వికృత రూపం దాలుస్తోందని వక్తలు ఆందోళన వ్యక్తం చేశారు. దేశంలో రాజకీయ మధనం సాగుతోందని, ఈ మధనంలోంచి అమృతం వచ్చేందుకు ఉపాధ్యాయులు తమవంతు కృషి చేయాలని వారు పిలుపు యిచ్చారు. ఆర్థిక సంస్కరణల సంక్షోభంతో ఏ రంగంలో నష్టం వచ్చినా ఆ లోటు పూడ్చటానికి విద్యారంగాన్నే బలిపశువును చేస్తున్నారని వారు విమర్శించారు. ఈ తరుణంలో సమాజంలో నెలకొన్న వివిధ అసమానతలను రూపు మాపటానికి ఉపాధ్యాయులు కీలక పాత్ర పోషించాలని వారు పేర్కొన్నారు.

## మహిళా సాధికారత - ఉపాధ్యాయినులు సదస్సు

సమాజం అభివృద్ధి చెందుతున్నా, విద్యా ఉద్యోగ అవకాశాలు పొందినా సాధికారతకు మాత్రం మహిళలు యింకా చాలా దూరంలో వున్నారని, ఆ మాటకొస్తే మగవారికి కూడ సాధికారత కొరవడిందనీ, అన్యాయం జరిగితే ప్రశ్నించేందుకు వెనుకాడుతున్నారనీ, ఈ పరిస్థితిని ఎదిరించేందుకు ఉపాధ్యాయులు కృషి చేయాలని భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) జాతీయ ఉపాధ్యక్షురాలు శ్రీమతి మల్లు స్వరాజ్యం పేర్కొన్నారు. డిసెంబర్ 28 సాయంత్రం రాష్ట్ర కోశాధికారి శ్రీమతి ఎం. సంయుక్త అధ్యక్షతన జరిగిన 'మహిళా సాధికారత - ఉపాధ్యాయినులు' అనే సదస్సులో ప్రసంగించిన శ్రీమతి స్వరాజ్యం సమాజంలో మహిళల స్థితిగతులను వివరించారు.

ఈ సదస్సులో పాల్గొన్న రామన్ మెగసెసే అవార్డుగ్రహీత ప్రొఫెసర్ శాంతాసిన్హా కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన నిర్బంధ విద్యా చట్టంలోని లొసుగులను ఎత్తి చూపారు. బాలకార్మిక వ్యవస్థను రూపుమాపనంతకాలం సంపూర్ణ అక్షరాస్యత సాధించలేమని చెప్పారు. ఏ.పి.ఎన్. జి.ఓ. సంఘం మహిళా విభాగం కన్వీనర్ శ్రీమతి ఎం. విజయ వాణి మాట్లాడుతూ ఉద్యోగులుగా, ఉపాధ్యాయినులుగా మహిళలు నిర్వర్తించ వలసిన బహుముఖ వివరించి వారు చైతన్యవంతులు కావలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

## ప్రభుత్వ వైఫల్యాలను దుయ్యబట్టిన అందరికీ విద్య - సదస్సు

మహాసభల రెండవరోజు డిసెంబర్ 29 ఉదయం 'అందరికీ విద్య' అనే అంశంపైన జరిగిన సదస్సు విశేషమైన ప్రాచుర్యాన్ని పొందింది. మానవాభివృద్ధిలో అత్యంత ముఖ్యమైన విషయం అయిన 'అందరికీ విద్య' పట్ల వివిధ రాజకీయ పక్షాల వైఖరులను ఉపాధ్యాయులు తెలుసుకొనేందుకే ఈ సదస్సును ప్రత్యేకంగా నిర్వహించారు.

ఈ సదస్సులో ప్రసంగించిన కాంగ్రెస్ శాసన సభా పక్ష మాజీ నాయకులు డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి విద్యారంగంలో రాష్ట్ర ప్రభుత్వ వైఫల్యాలను దుయ్య బట్టారు. ప్రభుత్వ బాధ్యతా రాహిత్యం, ప్రైవేట్‌రంగం ఆధిపత్యంతో ధనవంతులకే తప్ప పేద, మధ్య తరగతి వారికి విద్యా అవకాశాలు లేకుండా పోయాయని చెప్పారు. ఉపాధ్యాయులు, ఉద్యోగులు ప్రశాంతంగా పనిచేస్తేనే విద్యాభివృద్ధి సాధ్యమనీ, తెలుగుదేశం ప్రభుత్వం ఈ విషయంలో పూర్తిగా విఫలమైందని అన్నారు. కాంగ్రెస్ అధికారంలోకి రాగానే ఖాళీ పోస్టులను భర్తీ చేస్తామని, పి.ఆర్.సి.ని నియమిస్తామని, పెన్షనర్లకు బకాయివున్న డి.ఏ. చెల్లిస్తామని హామీ యిచ్చారు. చట్ట సభల్లో ఉపాధ్యాయుల ప్రతినిధులు

పాల్గొనే విధంగా శాసనమండలిని పునరుద్ధరిస్తామని ఆయన పేర్కొన్నారు.

భారత కమూనిస్టు పార్టీ (సి.పి.ఐ.) రాష్ట్ర సమితి కార్యదర్శి శ్రీ సురవరం సుధాకర రెడ్డి మాట్లాడుతూ వ్యాపారీకరణ వలన విద్య అట్టడుగు వర్గాలకు అందకుండా పోతున్నదనీ, ఈ పోకడను వెంటనే నిలువరించాలని అన్నారు. ఉపాధ్యాయ సంఘాలు ప్రభుత్వ విధానాలలో మార్పుకోసం చేసే పోరాటాలను మరింత ముమ్మరం చేయాలని కోరారు.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) సి.పి.ఐ.(ఎం.) రాష్ట్ర కార్యదర్శి శ్రీ బి.వి. రాఘవులు మాట్లాడుతూ ఉపాధ్యాయ నియామకాల్లో కాంట్రాక్ట్ విధానాన్ని వ్యతిరేకించారు. కాంట్రాక్ట్ పద్ధతి పై నియామకాలు, అభద్రతా భావాన్ని కలిగించటం, తక్కువ జీతాలు యివ్వటం వంటి విధానాలు అమలు చేస్తున్న ముఖ్యమంత్రి తనకూ, తన మంత్రి వర్గానికి కూడ అదే పాటించగలరా అని ప్రశ్నించారు. ప్రభుత్వమైనా ప్రతి పక్షమైనా చేసే వాగ్దానాలు, యిచ్చే హామీలకే సంతృప్తి చెందకుండా అవి అమలయ్యే వరకు పోరాటాలు చేయాలని ఆయన ఉపాధ్యాయులకు పిలుపు యిచ్చారు.

యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. నారాయణ అధ్యక్షత వహించిన ఈ సదస్సులో మాల్కం ఆదిశేషయ్య అవార్డ్ గ్రహీత, ప్రొఫెసర్ జంధ్యాల బాలగంగాధర తిలక్ ప్రారంభోపన్యాసం చేశారు. ప్రపంచంలో ఏ దేశంలోనూ ప్రాథమిక విద్యలో ప్రైవేట్ రంగం ప్రవేశించలేదనీ, భారత దేశంలో మాత్రమే యిలా జరుగుతోందని ఆందోళన వ్యక్తం చేశారు. ఈ సదస్సులోని ప్రసంగాలను ఉపాధ్యాయులు ఉత్సాహంతో వింటూ పలుసార్లు హర్షధ్వానాలు చేశారు.

అనంతరం 'విద్యాబోధన, భాష, సంస్కృతి' అనే అంశం పైన మరో ముఖ్యమైన సదస్సు జరిగింది. ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గ సభ్యులు శ్రీ ఎం. నరహరి అధ్యక్షత వహించిన ఈ సదస్సులో రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు డా॥ సి. నారాయణ రెడ్డి, అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ పరుచూరి గోపాలకృష్ణ ప్రసంగించారు. ఏ భాషలో మాట్లాడేవారికి ఆ భాషలోనే బోధించే విధానమే సరైందని, ప్రపంచంలో ఎక్కడా లేనిది మనదేశంలోనే పరభాషా వ్యామోహం పెరిగి పోయిందని వారు ఆవేదన చెందారు. మాతృభాషలో విద్యా బోధనకు ఉపాధ్యాయుల సహకారం మరింత పెరగాలని వారు కోరారు.

## ఉప్పొంగిన ఉత్సాహంతో మహాప్రదర్శన

"ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో రాష్ట్ర రాజధాని హైదరాబాదులో జరిగిన అతి పెద్ద ఉపాధ్యాయ ప్రదర్శన యిదే" ఏ నోట విన్నా యిదే మాట. డిసెంబర్ 29 సాయంత్రం జరిగిన ఉపాధ్యాయ మహాప్రదర్శన కార్యకర్తలను ఉత్రూతలూగించింది. ప్రజలను ఉత్తేజపరిచింది. దోమల్ గూడలోని మహాసభల ప్రాంగణం నుండి ప్రారంభమైన ప్రదర్శన లిబర్టీ సెంటర్, హిమాయత్ నగర్, నారాయణ గూడ, చిక్కడపల్లి, ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్, అశోక్ నగర్, ఎన్.టి.ఆర్. స్టేడియం, యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యాలయం, గగన్ మహల్ రోడ్ గుండా తిరిగి మహాసభల ప్రాంగణం చేరుకున్నది.

ఏడు కి.మీ.లు నడిచినా ఎవరికీ అలసట అన్పించలేదు. ఆద్యంతం ఆనందోత్సాహాలు. బేనర్‌లు, ప్లేకార్డ్లు, సమస్యల పై గర్జించిన గళాలు. విద్యా రంగాన్ని నిర్వీర్యం చేస్తున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వినాశకర విధానాలకు వ్యతిరేకంగా నినాదాల హోరు. పాటలు.. కళారూపాలు... జానపద నృత్యాలు.. సాంస్కృతిక ప్రదర్శనలు... విద్యార్థుల పూల జల్లులు... చూపరుల పులకింతలు... ట్రాఫిక్ స్తంభనాలు... వాహనచోదకుల హర్షాతిరేకాలు.... నిజంగా అది మహా ప్రదర్శనే!

ప్రదర్శన అగ్రభాగాన ఎస్.టి.ఎఫ్.ఐ. అఖిల భారత అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు డి. రామిరెడ్డి, తుషార్ కె. పంచానన్, యుటియఫ్ రాష్ట్ర నాయకత్వం నడిచింది. వారి వెనుక 9వ మహాసభల సంకేతంగా 9 పెద్ద పతాకాలు, ఆ తర్వాత కావి రంగు చీరలు ధరించిన మహిళలు, యుటియఫ్ టీషర్ట్‌లు, టోపీలు ధరించిన పురుషులు, ఆ పైన జిల్లాల వారీగా వారివారి బ్యానర్లతో ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ప్రదర్శనలో యువకులతో పోటీగా రిటైరైన ఉపాధ్యాయులు కూడ పాల్గొన్నారు.

పలు జిల్లాల నుండి పాల్గొన్న ప్రముఖమైన కళారూపాలు ప్రదర్శనకు అదనపు శోభను చేకూర్చాయి. తూర్పుగోదావరి నుండి గారడి నృత్యం, ఖమ్మం జిల్లా నుండి డోలుకొయ్య నృత్యం, ఆదిలాబాద్ జిల్లా నుండి గుస్సాడి నృత్యం, నల్లగొండ నుండి పల్లెసుద్దులు, మహబూబ్ నగర్ జిల్లా నుండి డిల్లెం బల్లెం నృత్యం, రంగారెడ్డి జిల్లా నుండి డప్పు నృత్యం పాల్గొన్నాయి. యుటియఫ్ ప్రదర్శనలలో కళా బృందాలు పాల్గొనే నూతన ఒరవడి ప్రదర్శనకే వన్నె తెచ్చింది. ఆర్.టి.సి క్రాస్ రోడ్ వద్ద ఎఫ్.ఎఫ్.ఐ. విద్యార్థులు గురువులపై పుష్ప వర్షం కురిపించారు. దానితో ప్రదర్శకులు పులకించి పోయారు. ఉపాధ్యాయ విద్యార్థి ఐక్యత వర్ధిల్లాలని పెద్దపెట్టున నినదించారు.

రాష్ట్ర నాయకులు శ్రీయుతులు కె. వెంకటరావు, పి. బాబురెడ్డి, పి. మాణిక్‌రెడ్డి, బి. నాగేశ్వర రావులు మొత్తం ప్రదర్శన క్రమశిక్షణాయుతంగా జరిగేందుకు కృషిచేశారు. సి.ఐ.టి.యు. కార్యకర్తలు మధ్య మధ్యలో మంచినీళ్లు అందించి ఉపాధ్యాయుల ఉత్సాహాన్ని రెట్టింపు చేశారు.

## ఉద్యమ సదస్సు

సాయంత్రం ప్రదర్శన ముగిసిన తరువాత ఉద్యమ సదస్సు జరిగింది. సి.ఐ.టి.యు. అఖిలభారత అధ్యక్షులు శ్రీ ఎం.కె. పాంధే ప్రధాన ప్రసంగం చేశారు. ఉద్యోగుల ప్రయోజనాల రక్షణకు జరిగే ఉద్యమాలను అణిచివేసే చర్యలకు పాల్పడుతున్న పాలకులకు న్యాయస్థానాల తీర్పులు కూడ ఆయుధాలుగా మారటం పట్ల ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. సమ్మె హక్కులేదనే సుప్రీం కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా సమ్మె చేయాలని, ఆ విధంగానే సమ్మె హక్కును సాధించుకోవాలని ఆయన పిలుపు యిచ్చారు. ఉపాధ్యాయులకు కూడ కార్మిక హక్కులను సాధించేందుకు ఉద్యమాలు చేయాలని చెప్పారు. ఎస్.టి.ఎఫ్.ఐ. అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, ప్రధానకార్యదర్శి తుషార్ కె. పంచానన్, అఖిల భారత రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల సమాఖ్య ఉపాధ్యక్షులు శ్రీ జి. పూర్ణచంద్ర రావు, తమిళనాడు ఉపాధ్యాయ సంఘాల తరపున శ్రీ టి. రాజేంద్రన్ తదితరులు ప్రసంగించిన ఈ సదస్సుకు రాష్ట్ర గౌరవాధ్యక్షులు శ్రీ పి. కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు.

## సాంస్కృతిక కార్యక్రమాలు

యు.టి.యఫ్. రాష్ట్ర మహాసభలలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలను ప్రముఖ సంగీత దర్శకులు వందేమాతరం శ్రీనివాస్ ప్రారంభించారు. ప్రారంభ సభకు యుటియఫ్ సహాధ్యక్షులు శ్రీ యన్. రమణయ్య శాస్త్రి అధ్యక్షత

వహించారు. రాష్ట్ర కార్యదర్శి, సాంస్కృతిక కార్యక్రమాల కన్వీనర్ శ్రీ సిహెచ్. సుభాష్ చంద్రబోస్ అతిథులను వేదిక పైకి ఆహ్వానించారు. శ్రీ వందేమాతరం శ్రీనివాస్ తన ప్రారంభోప న్యాసంలో ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను విమర్శిస్తూ తానే రచించి, ఆలపించిన గేయం సభికులను ఉల్లాస పరిచింది. దేశాని ఉపయోగపడే పౌరులను తయారు చేసే ఉపాధ్యాయులంటే తనకెంతో గౌరవమని ఆయన అన్నారు. కళలు సామాజిక చైతన్యాన్ని కలిగిస్తాయని, సంగీతానికి స్పందించని వారు ఎవరూ ఉండరని, ఉపాధ్యాయులు సృజనాత్మకతతో పని చేసి ఉత్తమ పౌరులను తయారు చేసి దేశాభివృద్ధికి తమవంతు పాత్రను పోషించాలని కోరారు. ఉపాధ్యాయుల కోరిక మేరకు తన సంగీత దర్శకత్వంలో వచ్చిన ముఖ్యమైన సినిమా గీతాలను ఆలపించి సభికులను అలరించారు. అనంతరం గుంటూరు జిల్లా విద్యార్థినులు 'గుంటూరు వైభవం' నృత్య రూపకాన్ని ప్రదర్శించారు. ఖమ్మం జిల్లా వారు మూఢనమ్మకాలను విమర్శిస్తూ 'బోగస్' నాటికను ప్రదర్శించారు. ప్రజానాట్య మండలి నల్లగొండ జిల్లా వారు ప్రదర్శించిన 'వీర తెలంగాణా' నాటిక ఉపాధ్యాయులను ఉద్రూతలూగించింది. ఆ నాటి తెలంగాణలో నిజాం పాలనలో ప్రజలు పడిన కష్టాలను కళ్ళకు కట్టినట్లు ఆవిష్కరించారు. కమ్యూనిస్టుపార్టీ ప్రజల పక్షాన నిలబడి భూస్వాముల దురాగతాలను అణచివేతను ఎదుర్కొని వీరోచితంగా ఎలా పోరాడిందో చూపిన ఘట్టాలు సభికులను ఉత్తేజ పరిచాయి.

## ప్రతినిధుల సభ

డిసెంబర్ 30 ఉదయం ప్రతినిధుల సభ జరిగింది. శ్రీయుతులు కె. జోజయ్య, పి. కృష్ణమూర్తి, ఎన్. రమణయ్య శాస్త్రి, శ్రీమతి సి. కమలకుమారి అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు. 30వ రాష్ట్ర కౌన్సిల్ జరిగిన 2003 ఏప్రిల్ తరువాత కాలంలో మరణించిన ప్రముఖులకు సంతాపం ప్రకటిస్తూ రాష్ట్ర కోశాధికారి శ్రీమతి ఎం. సంయుక్త తీర్మానం ప్రతిపాదించగా సభ రెండు నిముషాలు మౌనం పాటించి నివాళి అర్పించింది.

సభా ప్రారంభంలో నిబంధనావళిని అనుసరించి రాష్ట్ర కౌన్సిలర్లుగా ఏడుగురిని కో-ఆప్ట్ చేసుకున్నారు.

ఉద్యమ సీనియర్ నాయకులు, ఎస్.టి.ఎఫ్.ఐ. అఖిలభారత అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి ప్రారంభోపన్యాసం చేశారు. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆవిర్భవించిన నాటి చారిత్రక కర్తవ్యానికి పునరంకితం కావాలని, సమాజంలో ఉపాధ్యాయుల విలువలను కాపాడేందుకు కృషి చేయాలని, 10వ మహాసభలను లక్షన్నర సభ్యత్వంతో నిర్వహించాలనే లక్ష్యంతో పని చేయాలని ఆయన పిలుపు యిచ్చారు. ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాల సంయుక్త మండలి (జె.ఏ.సి.) చైర్మన్ శ్రీ బి.వి. సుబ్బారావు, సెక్రటరీ జనరల్ శ్రీ ఎ. కృష్ణారెడ్డి, టి.ఎన్.జి.ఓ. సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ బి. సుధాకర్, జన విజ్ఞాన వేదిక (జె.వి.వి.) రాష్ట్ర కార్యదర్శి శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం సందేశాలు యిచ్చారు. రాష్ట్రంలోని ఉపాధ్యాయ సంఘాల్లో ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అతి పెద్దది అనే వాస్తవాన్ని ఈ మహాసభల ద్వారా చూస్తున్నామనీ, రాష్ట్రంలో ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక ఐక్య ఉద్యమానికి చేస్తున్న నిర్మాణాత్మక కృషిని మరింత పెంచాలని ఎన్.జి.ఓ. సంఘాల నాయకులు కోరారు.

రాష్ట్ర ప్రధానకార్యదర్శి శ్రీ ఎన్. నారాయణ సంఘ నివేదికను, కోశాధికారి శ్రీమతి ఎం. సంయుక్త ఆర్థిక నివేదికను, ఐక్య ఉపాధ్యాయ ప్రధానసంపాదకులు శ్రీ డి. రామిరెడ్డి పత్రిక నివేదికను, శ్రీ టి. కొండాచారి ప్రచురణల విభాగం నివేదికను, ఆడిట్ కమిటీ కన్వీనర్ శ్రీ జి. చిట్టిబాబు ఆడిట్ నివేదికను ప్రవేశ పెట్టారు. 30వ కౌన్సిల్ తరువాత కాలంలో సంఘం చేసిన బహుముఖ కార్యక్రమాలను, పెరిగిన ప్రతిష్ఠను ఆయా నివేదికల్లో పేర్కొన్నారు. (ఆ వివరాలన్నీ యిదే సంచికలో ఉన్నాయి.) నివేదికలపైన 4 గంటలకు పైగా జరిగిన చర్చలో వివిధ జిల్లా శాఖల ముఖ్య బాధ్యులు 32 మంది పాల్గొన్నారు. శ్రీయుతులు బి. నర్సింహారావు, జి. నాగమల్లేశ్వర రావు, (ఖమ్మం); జార్జివిక్టర్, ఐ. వెంకటేశ్వర రావు (తూర్పుగోదావరి); డి. రాము (విజయనగరం); జగదీశ్ బాబు, ఎ. నర్సిరెడ్డి (నల్లగొండ); బి.రమణయ్య, జి.వి. భాస్కర్ (నెల్లూరు); ఎస్. కిష్టయ్య (మహబూబ్ నగర్); వై. శ్రీనివాసులు రెడ్డి (చిత్తూరు); సాల్మీ, బాలయ్య (పశ్చిమగోదావరి); సి.కె. నాగేంద్రబాబు (అనంత పురం); ఎస్. సదానంద్ (వరంగల్); వి. రమేష్ చంద్ (కృష్ణా); జి. గిరిధర్ (శ్రీకాకుళం); బి. లక్ష్మీరాజం (కడప); ఎం. సోమేశ్వర్లు (నిజామాబాద్); ఎం. రామ సుబ్బారెడ్డి (విశాఖపట్నం); జి. అశోక్ (కరీంనగర్); కె.ఎస్.వి. దుర్గారావు, ఎన్. రామారావు (గుంటూరు); వెంకటి (ఆదిలాబాద్); ఎన్. పురుషోత్తమ రావు, మల్లారెడ్డి (రంగారెడ్డి); కె. ఆదినారాయణ (ప్రకాశం); లక్ష్మారెడ్డి (మెదక్); సురేష్ కుమార్ (కర్నూలు); పి. ఇంద్రజిత్ (హైదరాబాద్); శ్రీమతి సిహెచ్. చిట్టెమ్మ (ఖమ్మం) చర్చలలో పాల్గొన్నారు. పెరిగిన ఉద్యమ ప్రతిష్ఠను ప్రశంసించటంతో పాటు వారు పలు నిర్మాణాత్మక సూచనలు చేశారు. సమావేశం అన్ని నివేదికలను ఏకగ్రీవంగా ఆమోదించింది.

## నిబంధనావళి సవరణలు

2000 జనవరిలో 8వ మహాసభలు జరిగిన తరువాత 2002 నవంబర్‌లో, 2003 ఏప్రిల్‌లో జరిగిన కౌన్సిల్ సమావేశాల్లో నిబంధనావళికి కొన్ని సవరణలు చేయటం జరిగింది. అవి క్రింది విధంగా వున్నాయి.

1. చాప్టర్ V-2బి నిబంధన చివరలో క్రింది పేరా చేర్చబడింది:
   "మహిళా ప్రతినిధులను ఎన్నుకొనే అవకాశం లేనపుడు ఆయా స్థానాల్లోకి పురుషులు ఎన్నికవుతారు."
2. చాప్టర్ V-3డి నిబంధన క్రింది విధంగా సవరించబడింది.
   "సభ్యత్వం 50 గానీ అంతకు తక్కువగానీ వుంటే 5 మంది, 51 నుండి 100 వరకు వుంటే 7 మంది, 101 నుండి 150 వరకు వుంటే 9 మంది, 151 నుండి 200 వరకు వుంటే 11 మంది, 201 నుండి 400 వరకు వుంటే 13 మంది, 401 ఆ పైన ఎంతమంది వున్నా 15 మంది ఆఫీస్ బేరర్స్ ఎన్నిక అగుదురు. ఆఫీస్ బేరర్స్‌లో కనీసం ఒక మహిళ వుండును.
3. చాప్టర్ V-8 లోని మొదటి వాక్యం క్రింది విధంగా సవరించబడింది.
   "గత సంవత్సరం పనిచేసిన కార్యదర్శివర్గం (ఆఫీస్ బేరర్స్) తమకున్న ఉద్యమ నిర్మాణ అవగాహన ఆధారంగా నూతన కమిటీలకు, కౌన్సిలర్లకు పేనల్స్‌ను ప్రతిపాదించును."
4. చాప్టర్ V-7 ఎఫ్ నిబంధన క్రింది విధంగా సవరించబడింది.
   "రాష్ట్ర ఆడిట్ కమిటీకి ఒక కన్వీనర్ మరియు నలుగురు సభ్యులు మొత్తం 5 ఎ మంది ఎన్నిక అగుదురు."

ఈ సవరణలను రాష్ట్ర కార్యదర్శి శ్రీ సిహెచ్. సుభాష్ చంద్రబోస్ ప్రతిపాదించగా 9వ రాష్ట్ర మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

యుటియఫ్ సీనియర్ నాయకులు శ్రీ ఎన్. రామకోటేశ్వర రావు గారు ఎన్నికల అధికారిగా వ్యవహరించగా ఈ క్రింది కమిటీలు ఏకగ్రీవంగా ఎన్నిక అయ్యాయి.

## నూతన కార్యదర్శివర్గం (2003-04)

| | | |
|---|---|---|
| గౌరవ అధ్యక్షులు | : | శ్రీ పి. కృష్ణమూర్తి |
| అధ్యక్షులు | : | శ్రీ కె. జోజయ్య |
| సహ అధ్యక్షులు | : | శ్రీ యన్. రమణయ్య శాస్త్రి |
| ప్రధాన కార్యదర్శి | : | శ్రీ ఎన్. నారాయణ |
| కోశాధికారి | : | శ్రీమతి ఎం. సంయుక్త |

**కార్యదర్శులు**

| | |
|---|---|
| శ్రీ యం. ఎ.కె. దత్తు (గుంటూరు) | శ్రీ సి.కె. నాగేంద్రబాబు (అనంతపురం) |
| శ్రీమతి సి. కమల కుమారి (ఆదిలాబాద్) | శ్రీ పి. బాబురెడ్డి (నెల్లూరు) |
| శ్రీ సిహెచ్. సుభాష్ చంద్రబోస్ (ప.గోదావరి) | శ్రీ ఎన్. సోమచంద్రా రెడ్డి (చిత్తూరు) |
| శ్రీ పి. పుల్లయ్య (తూ.గోదావరి) | శ్రీ ఎన్. కిష్టయ్య (యం.నగర్) |
| శ్రీ వి. మాణిక్ రెడ్డి (రంగారెడ్డి) | శ్రీ జి. శేషయ్య (ప్రకాశం) |
| శ్రీ ఎస్.డి. జియాఉద్దీన్ (ఖమ్మం) | శ్రీమతి కె.విజయగౌరి (విజయ నగరం) |
| శ్రీ బి. నాగేశ్వర రావు(కృష్ణా) | |

## "ఐక్య ఉపాధ్యాయ" పత్రిక సంపాదక వర్గం

ప్రధాన సంపాదకులు : శ్రీ డి. రామిరెడ్డి

**సభ్యులు**

| | |
|---|---|
| శ్రీ కె. జోజయ్య | శ్రీ ఎన్. నారాయణ |
| శ్రీ యం. నరహరి | శ్రీ సిహెచ్. రవి |

## ఆడిట్ కమిటీ

కన్వీనర్ : శ్రీ జి. చిట్టిబాబు

**సభ్యులు**

| | |
|---|---|
| శ్రీ ఎ. ఇజ్రాయిల్ రాజు | శ్రీ ఎ. శ్రీనివాస్ |
| శ్రీ వి. మాలకొండా రెడ్డి | శ్రీ ఎస్. విజయకుమార్ |

## మహాసభలకు వస్తురూపం విరాళాలు

తూర్పుగోదావరి జిల్లా నుండి 5 వేల అరటిపండ్లు, రెండు బస్తాల దొండకాయలు, 7 క్వింటాళ్ల వంకాయలు, 500 మునగకాయలు, వెయ్యికొబ్బరి కాయలు, 3 బస్తాల కొత్తిమీర, ఒక క్వింటాల మిర్చి; పశ్చిమగోదావరి జిల్లా నుండి 8 అరటిగెలలు, 70 ఆనపకాయలు, 4 బెల్లం బుట్టలు, 150 కొబ్బరి కాయలు, 4 గుమ్మడి కాయలు, ఒక బస్తా పచ్చిమిర్చి; ఆదిలాబాద్ జిల్లా నుండి 20 వేలు కోడిగ్రుడ్లు; హైదరాబాద్ జిల్లా నుండి 100 కేజీలు టమాటా, 50 కేజీలు చిక్కుడు కాయలు; నల్లగొండ జిల్లా నుండి 3 బెల్లం దిమ్మెలు విరాళాలుగా వచ్చాయి.

వస్తురూపంలో ఈ విరాళాలు అందించిన దాతలకు, జిల్లా శాఖలకు ప్రత్యేక అభినందనలు తెలియజేస్తున్నాము.

## వివిధ రకాల సేవలు - అందించిన వారు

మహాసభల కోసం కొన్ని రోజుల పాటు సెలవులు పెట్టి రాష్ట్ర కార్యాలయంలో వివిధ రకాల పనులు చేసిన కార్యకర్తలు వున్నారు. ఖమ్మం జిల్లా నుండి శ్రీ పి. శరత్ బాబు, వరంగల్ జిల్లా నుండి శ్రీ జి. అశోక్, హైదరాబాద్ నుండి శ్రీ ప్రకాశ్ బాబు, నల్లగొండ నుండి శ్రీ నరసింహా రావు, రంగారెడ్డి నుండి శ్రీ నర్సింహాచారి, పశ్చిమ గోదావరి నుండి పి.వి. నర్సింహా రావు, ఖమ్మం నుండి శ్రీ డి. శ్రీనివాస్ మరియు ఎగ్జిబిషన్ మెటీరియల్, డెకరేషన్ మెటీరియల్ తయారు చేసిన శ్రీయుతులు రామిరెడ్డి (వరంగల్) నాగేశ్వర రావు (ఖమ్మం) నెల్లూరు జిల్లా నుండి పి. నాగరాజు, కె. రమేష్ తదితరులు వీరిలో వున్నారు. భోజన శాలకు అవసరమైన పదార్థాలను కొనుగోలు చేసే బాధ్యతను హైదరాబాదుకు చెందిన శ్రీ వీరయ్య, శ్రీ అంజయ్య, శ్రీ శ్యాంగిరి నిర్వహించారు. మహాసభలు జరిగిన రోజుల్లో వివిధరకాల బాధ్యతలు నిర్వర్తించిన వారు పలువురు ఉన్నారు. వందలాది మంది వాలంటీర్లుగా పని చేశారు. ఆహ్వాన సంఘం బాధ్యులు, వివిధ ప్రజా సంఘాల నాయకులు, కార్యకర్తలు చాలామంది అహర్నిశలూ కృషి చేశారు. వారందరికీ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

## స్వాగత గీతం

రచన శ్రీమతి డి. కమలారెడ్డి
హైదరాబాదు

స్వాగతం స్వాగతం సుస్వాగతం
ఉపాధ్యాయ నేతలకు
ఉద్యమ రథ సారథులకు
అతిథులకు అధిపతులకు
॥ స్వాగతం స్వాగతం ॥

మీరాకతో భాగ్యనగరు పులకించినవ్వింది
కుతుబ్ షాహి గోలకొండ తనువంతా మరచింది
చార్మినారు నయనాలు చెమరించి చూశాయి
మక్కాలో పావురాలు శాంతి గీతి పాడాయి
॥ స్వాగతం స్వాగతం ॥

చదువుకునే రోజుపోయి చదువు'కొనే' రోజొచ్చె
మీ సందేశం కొరకు నిరీక్షించె నిరుపేద
ఆశయాల సాధనలో అలుపెరుగని సారథులకు
చందనాల మాలలతో వందనాల స్వాగతాలు
॥ స్వాగతం స్వాగతం ॥

కందుకూరి వారసులం, గురజాడ అనుచరులం
చెన్నుపాటి అందించిన చైతన్యపు స్ఫూర్తితో
మైనేని ఆశలకు మకుటాలము అయినాము
అప్పూరి అడుగుజాడ అనుసరించినదుస్తాం
॥ స్వాగతం స్వాగతం ॥

అధ్యయనం, ఆధ్యాపన, సామాజిక స్పృహలుగలిగి
హక్కులు - బాధ్యతలు రెండు నేత్రాలుగ భావించి
ఉద్యమాలు నడిపినారు ఉన్నతికే ఎదిగినారు
మీకోసం ఈ లోకపు కనులు కలలుకంటున్నవి
॥ స్వాగతం స్వాగతం ॥

పిడికిలెత్తి నినదించు ఈ విద్యను రక్షించు
ప్రయివేటు కిరాతకులకు ఖబర్దార్ అని చెప్పు
పోరాటపు దారిలో నీ శక్తి నిరూపించు
మీ కోసం నవ సమాజం లాల్ సలామ్, లాల్ సలామ్
॥ స్వాగతం స్వాగతం ॥

స్వాగతోపన్యాసం

# ఈ మహాసభలు దిశా నిర్దేశం చేయాలి.

-డా॥ చుక్కా రామయ్య
ఛైర్మన్, ఆహ్వాన సంఘం

హైదరాబాదు మహానగరం చరిత్రకు సాక్షీభూతం, కాలపరీక్షకు నిలిచిన సజీవ శిఖరం, ఐదు శతాబ్దాలుగా ఆటుపోట్లకు తట్టుకొని అఖండంగా నిలిచి. ఆర్తులకు నీడనిస్తున్న మహావృక్షం. హైదరాబాదు చుట్టూ పరుచుకొని నాటి చరిత్రను స్ఫురణకు తెస్తున్న చారిత్రక కట్టడాలు ఎంత ప్రధానమో నగరాన్ని నవనవోన్మేషం చేసి వర్తమానానికి అందించిన సామాన్య ప్రజానీకం త్యాగాలూ అంతే ప్రధానం. వారి త్యాగఫలం ద్వారా నిలిచిన అజేయ మహానగరం మరోసారి కాలపరీక్షకు నిలచిన నేపథ్యంలో ఈ మహాసభలు జరుగుతున్నాయి. ఈ సంతోష సమయంలో అందరికీ ఆహ్వాన సంఘం, ఫెడరేషన్ తరపున శుభాభినందనలు.

విద్య సామాజిక పరివర్తనకు సాధనం. సామాజిక రుగ్మతలకు చికిత్సా ఉపకరణం. గతంలో సమాజంలోని అట్టడుగు మనిషి కన్నీళ్ళు తుడవడమే చదువు పరమార్థంగా భావించేవారు. వ్యక్తిగత ప్రతిభకు చదువు జ్యోతిలా నిలిచేది. విద్య అందించిన జ్ఞానపంసద, వివేచన, విలువల ద్వారా వ్యక్తి సామాజిక పరివర్తన ప్రక్రియలో భాగస్వామి అయ్యేవాడు. కానీ నేడు చదువు కేవలం వ్యక్తిగత ప్రతిభకు ఆసరా అయ్యింది. చదువు ద్వారా లభించిన ప్రతిభావ్యుత్పత్తులు మార్కెట్ శక్తుల ప్రయోజనాలకు ఉపకరణంగా నిలుస్తున్నాయి. గ్లోబలీకరణ నేపథ్యంలో ఎటువంటి మార్కెట్ శక్తులకు ఈ ప్రతిభావ్యుత్పత్తులు దోహదపడతాయో ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఫలితంగా విద్య ద్వారా సృష్టించే ఆర్థిక వనరులు సమాజంలోని అన్ని వర్గాలకు సమానంగా చేరడం లేదు. కొందరి చేతుల్లోకే వెళ్లి కేంద్రీ కృతమవుతున్నాయి.



విద్య సామాజిక పరివర్తనకు సాధనంగా ఉపయోగపడకపోగా నేడు మరొక ఉపద్రవం కన్పిస్తోంది. ఇటీవలికాలంలో విద్యలో విలువల పేరిట ఛాందసభావాలు, మతమౌఢ్యం జొప్పించే ప్రక్రియ ప్రారంభమైంది. 'విలువలతో కూడిన విద్య' అంటూ లౌకిక రాజ్య వలువలు ఒలవాలని, విద్యను ఆధునీకరించడమంటూ సనాతన ఛాందస భావాల ఛత్రం కిందకు తీసుకురావాలన్న కుయుక్తులు మొదలయ్యాయి. ఈ ఉపద్రవం ముందుకు వస్తున్న నేపథ్యంలో విద్యను ఆ శక్తులకు వదిలేయడమా లేక పోరాడి విద్యను ప్రజాహిత బాటలో నిలపడమా అన్నది ఈ మహాసభలు నిర్ణయించాలి.

ఉపాధ్యాయుడు నేడు 'సేల్స్‌మన్' పాత్రలోకి పరకాయ ప్రవేశం చేశాడు. ఎవరో శాసించిన విషయాలను తన ప్రమేయం లేకుండా 'వినియోగదారుడి' చేతిలో పెట్టడమే అతని పని అయిపోయింది. అమ్మిపెట్టమన్న వస్తువులను తన దగ్గరకు వచ్చే వారికి ఇవ్వడమే తన పని అయిపోయింది. దీని నుంచి, ఈ పరాధీన కర్తవ్యం నుంచి ఉపాధ్యాయుడు బయటపడాలి. పార్యప్రణాళిక విశాల నేపథ్యంలో ఉపాధ్యాయుడు స్వేచ్ఛగా తన భావాలను విద్యార్థి లోకానికి ప్రసరింపజేయగలగాలి. ఉపాధ్యాయుడు సమాజ నిర్మాణానికి కావలసిన పునాది రాళ్లను తరగతి గదిలో రూపొందించే కార్మికుడవ్వాలి. అందుకు కావలసిన దిశా నిర్దేశాన్ని ఈ మహాసభ ఇవ్వాలి.

ఉపాధ్యాయ ఉద్యమం సామాజిక కర్తవ్యాలకు కట్టుబడి పనిచేయాల్సిన అవసరం ముందుకు వస్తున్నది. మానవాభివృద్ధికి విద్య మూలాధారమని అన్ని నివేదికలూ అంగీకరిస్తున్నాయి. అందరికీ విద్య, సంపూర్ణ అక్షరాస్యత సాధించాలనే లక్ష్యం అతిపెద్ద సవాల్‌గా నిలిచి ఉన్నది. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల వాగాడంబరం కొనసాగుతూనే ఉంది. దశాబ్దాలు గడుస్తున్నా అ విద్య కొనసాగుతుండడం ప్రభుత్వాల బాధ్యతా రాహిత్య ఫలమేనన్న విషయాన్ని ఉపాధ్యాయ ఉద్యమం గుర్తించాలి.

విద్యా హక్కుని సంపూర్ణంగా సాధించటానికి ప్రభుత్వాలపై పోరాడేందుకు ఉపాధ్యాయులు ఉద్యమించాలి. పేదవర్గాల పిల్లలకు విద్యను గరిపేందుకు ఉపాధ్యాయులు పునరంకితం కావాలి. ప్రభుత్వ పాఠశాలల్లో కనీస ప్రమాణాలు గల విద్యను అందించటానికి సమున్నత కృషి చేయాలి, ప్రభుత్వ విద్య పట్ల ప్రజల్లో విశ్వాసం పెంపొందించాలి. పేదరికంతో పెనుగులాడుతున్న ప్రజలకు విద్య చేరువైతేనే ఉపాధ్యాయులకు సామాజిక గౌరవం లభిస్తుంది. విద్యా ప్రమాణాలు, విలువల పెరుగుదలకు పరిశోధనలు చేయాలి, ఫలితాలు సాధించాలి. ప్రైవేట్ విద్యలోని పటాటోపాన్ని బట్టబయలు చేయాలి. విద్యా రంగంలో పెరిగిపోతున్న దోపిడీ విధానాన్ని, పరాధీనతా ధోరణులను నిలువరించాలి.

సరళీకరణ విధానాలతో అన్ని రంగాలూ అతలాకుతలం అయినట్లు ఉపాధ్యాయుల పరిస్థితి కూడ దిగజారిపోతున్నది. భారత సమాజంలో గురుభక్తికి కొదవలేదు. ఉపాధ్యాయుల సామాజిక హోదా పెరగాలంటే ఆర్థిక హోదా పెరగాలని జాతీయ, అంతర్జాతీయ నివేదికలు నొక్కి వక్కాణించాయి. ఆ హోదా కోసం ఉపాధ్యాయ సంఘాలు చేసిన పోరాటాలు గణనీయమైన ఫలితాలు సాధించాయి. 'బతకలేక బడిపంతులు' స్థాయినుంచి మధ్య తరగతి జీవనానికి ఎదగటం జరిగింది. కాని పాలక వర్గాల తిరోగామి విధానాలతో ఉపాధ్యాయుల ఆర్థిక హోదా తిరుగుముఖం పట్టింది. అప్రెంటీస్ షిప్, కాంట్రాక్ట్ విధానంతో కనీస వేతనాలు కూడ పొందలేని దుస్థితి నెలకొన్నది. రిటైరైన తరువాత శేషజీవితాన్ని ప్రశాంతంగా గడిపేందుకు నెలకొల్పిన సామాజిక భద్రతాసదుపాయం కరువైపోతున్నది. ఈ పరిస్థితుల్లో ఉపాధ్యాయుల ఆర్థిక హోదాను, సామాజిక భద్రతను నిలబెట్టేందుకు ఉపాధ్యాయ ఉద్యమం పునరంకితం కావాలి.

ఉపాధ్యాయుల సామాజిక హోదా అనేది సామాజిక బాధ్యతతో ముడిపడి ఉన్నదనే వాస్తవాన్ని కూడ గుర్తించాలి. అంకితభావంతో పనిచేయటం, క్రమశిక్షణతో ప్రవర్తించటం, ఆదర్శంగా జీవించటం ద్వారానే అది సాధ్యం కాగలదు. బోధనా సామర్థ్యం ద్వారానే విద్యార్థుల ఆదరణ పొందగలం, భౌతిక శిక్షలు. అరాచక పద్ధతులు చరిత్ర చెత్తబుట్టదాఖలు కావాలి. అధునాతన పరిజ్ఞానంతో నవనవోన్మేషంగా ఎదగాలి. సామాజిక పరివర్తనకు మార్గదర్శిగా, ప్రజాతంత్ర ఉద్యమాలకు ప్రేరణ కలిగించాలి.

ఐక్య ఉపాధ్యాయ సంఘ కార్యకర్తలు ఉత్తమ సమాజ నిర్మాణానికి అంకితమయ్యే సమరయోధులని నాకు తెలుసు. కేవలం తమ జీత భత్యాల కోసం మాత్రమే పని చేసేవారుకారని, సామాజిక పరివర్తనకు కృషిచేసే శక్తులని నాకు తెలుసు. ఉపాధ్యాయుని జీవితం తెరచిన పుస్తకంలా ఉండాలి. వ్యక్తిగత జీవితం ఎంత పారదర్శకంగా ఉంటే అంతగా వృత్తికి ఔన్నత్యం వస్తుంది. ఫలితంగా పరిసరాల్లో స్ఫూర్తిని జ్వలింపజేయగలరు. మీరందరు ఆదర్శప్రాయంగా నిలుస్తూ ఐక్య ఉపాధ్యాయ పతాకం కింద పేదరికం, భయం లేని సమాజ ఆవిర్భావానికి ఇంధనంలా పనిచేసే నూతన విద్యా విధాన రూపకల్పనకు ఉద్యుక్తులు కాగలరని ఆకాంక్షిస్తున్నాను.

దిశానిర్దేశకులందరికీ మరోసారి శుభాభినందనలు.

# అధ్యక్షోపన్యాసం

- కొండవీటి జోజయ్య

**వే**దిక నలంకరించిన అమాత్యులారా! పెద్దలారా! విద్యావేత్తలారా! వివిధ శాఖల అధికారులారా! మహాసభ ప్రతినిధులారా! సౌహార్ద ప్రతినిధులారా! సోదర సంఘ నాయకులారా! పురప్రముఖులారా! ప్రసార మాధ్యమాల ప్రతినిధులారా! మీకందరకు హృదయ పూర్వక అభివందనములు.



ఎన్నో వ్యయప్రయాసల కోర్చి రాష్ట్రం నలుమూలల నుండి, ఇతర రాష్ట్రాల నుండి ఈ మహాసభలకు విచ్చేసిన మీకందరకు స్వాగతం ! సుస్వాగతం !

మన సంఘం 1974 ఆగస్టు 20న కాకినాడలో రిజిస్టరు చేయబడింది. ప్రథమ మహాసభ 1974 అక్టోబరు 20,21, తేదీలలో రాజమండ్రిలో జరిగింది. రజతోత్సవాలు 2000 జనవరి 18-20 తేదీలలో కాకినాడలో అపూర్వంగా జరిగాయి.

గత 8 మహాసభలు రాజధానికి దూరంగా జిల్లా కేంద్రాలలో జరిగాయి. రాజధానిలో యింతవరకు మనం మహాసభలు జరుపనందున మన ఉద్యమ శక్తి సామర్థ్యాలు, కార్యక్రమాలను గూర్చి, రాజధాని వాసులకు, ప్రభుత్వానికి సంపూర్ణమైన అవగాహన ఏర్పడలేదు. అందుకే 21వ శతాబ్దంలో జరిగే మన తొలి మహాసభలను రాజధాని హైదరాబాదులో జరుపదలచాం.

ఈ మహాసభలు జరిగే సమయానికి మనం రాష్ట్ర స్థాయి దాటి అఖిల భారత స్థాయి ఉపాధ్యాయ ఉద్యమంలో కూడ కీలక పాత్ర వహిస్తున్నాం. School Teachers' Federation of India (S.T.F.I.) అధ్యక్షులుగా మన నాయకులు రామిరెడ్డిగారు పనిచేస్తున్నారు. S.T.F.I. 10 రాష్ట్రాలకు చెందిన 15 ఉపాధ్యాయ సంఘాలకు ప్రాతినిధ్యం వహిస్తూంది. దీనిలో 7 లక్షల మంది సభ్యులున్నారు. ప్రపంచ ఉపాధ్యాయ సమాఖ్య F.I.S.E. లో మనం భాగస్వాములుగా ఉన్నాం.

హైదరాబాదులో ఈ సభలు జరపడం సాహసమే. ఇతర ఉపాధ్యాయ సంఘాలు యిచ్చట జరిపిన మహాసభలలో గరిష్టస్థాయిలో 3 వేలమంది పాల్గొన్నారు. మన సభలకు దాదాపు 20 వేల మంది హాజరవుతున్నారు. వేడుక కోసం యింత పెద్దసంఖ్యలో ఉపాధ్యాయులు యీ మహాసభలలో పాల్గొనుటలేదు. ఆందోళన కలిగిస్తున్న సమకాలీన పరిణామాలకు యీ మహాసభ ఒక మేరకైనా పరిష్కారం చూపుతుందని, అందుకు ఆశయ బలం, నిబద్ధత గల యుటియఫ్ ఉత్తేజ భరితమైన ఉద్యమ స్ఫూర్తినిస్తుందని అచంచల విశ్వాసంతో మీరంతా పాల్గొంటున్నారని భావిస్తున్నాను.

భాగ్యనగరం ప్రాశస్త్యం తమందరికి తెలియనిదికాదు.

మనం కేవలం ఉపాధ్యాయుల సంక్షేమానికి గాక, సామాజిక దృక్పథంతో జాతి మొత్తం క్షేమాన్ని దృష్టిలో వుంచుకొని కృషి చేస్తున్నాము. "అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ" మన ధ్యేయాలు. "హక్కులు - బాధ్యతలు" మన రెండు నేత్రాలు.

మనం ఈ రోజు 21వ శతాబ్దంలో ప్రయాణం సాగిస్తున్నాం.

గత శతాబ్దంలో మానవాళిని సర్వనాశనం చేసే యుద్ధాలు జరిగాయి. దానికి తగిన ఆయుధాలు తయారైనాయి. మరొకవైపు మనం కోరుకొన్న ప్రాణిని కోరుకున్న రీతిలో క్లోనింగు ద్వారా విశ్వామిత్ర సృష్టిచేయగలిగిన మేరకు శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందింది. మానవ శరీరంలో అన్ని అవయవాలు మార్చబడుతున్నాయి. అంతరిక్షయానం సాధారణ ప్రయాణమయింది. ఇంటర్‌నెట్ ద్వారా ప్రపంచం చిన్నదయిపోయింది. అత్యంత ప్రమాదకర వ్యాధులు రూపుమాసిపోయాయి. అదే సందర్భంలో నూతన రీతిలో ఎయిడ్స్‌లాంటి భయంకర వ్యాధులు పుట్టుకొస్తున్నాయి.

ఇదే విధంగా సామాజిక శాస్త్రాలలో కూడ విప్లవం వచ్చింది. దోపిడీకి నిలయమైన, వ్యక్తి శ్రేయస్సే సర్వస్వమైన పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయం ఉందని, దోపిడీ రహిత సామ్యవాద సమాజం సృష్టించవచ్చుని మార్క్స్ సూత్రీకరించారు. ఆయనను గత సహస్రాబ్దపు మేధావిగా ప్రకటించారు.

సామ్యవాద సమాజాన్ని స్థాపించడానికి వివిధ దేశాలలో వివిధ ప్రయోగాలు జరిగాయి. కొన్ని లోపాలతో రష్యాలాంటి చోట అపజయం ఎదురైంది. ఆ గుణపాఠాలతో జాగ్రత్త పడుతూ కొన్ని దేశాలు ముందుకు పోతున్నాయి. వర్ధమాన దేశాలన్నీ 1990 వరకు ఆ బాటలోనే పయనించాయి.

ఈ నేపథ్యంలో మనం 21వ శతాబ్దపు గమనాన్ని నిర్దేశించుకొని మన ప్రయాణం సాగిద్దాం.

విద్యారంగంలో పూర్తి నిరాశా నిస్పృహలు ఆవరించి ఉన్నాయి. స్వాతంత్ర్యం వచ్చి 56 సంవత్సరాలు దాటినా యింతవరకు స్థిరమైన, శాస్త్రీయమైన విద్యావిధానం రూపుదాల్చలేదు. కమిటీల మీద కమిటీలు వేయడం, సర్వేల మీద సర్వేలు చేయడమేగాని ఆ కమిటీల సిఫారసులలో తమకనుకూలమైన వాటిని తప్ప దేశానికి ఉపయోగపడే సిఫారసులు వేటినీ గత ప్రభుత్వాలు అమలు జరుపలేదు.

సర్వేపల్లి రాధాకృష్ణన్ కమిటీ, లక్ష్మణస్వామి మొదలియార్ కమిటీ, ఈశ్వరభాయి కమిటీ, యశ్‌పాల్ కమిటీ, రామమూర్తి కమిటీ వంటి అధికార కమిటీ సిఫారసులన్నీ పేపర్లకే పరిమిత మయినాయి.

ప్రపంచంలోని అన్ని అభివృద్ధి చెందిన దేశాలు 5 సంవత్సరాలలో నిరక్షరాస్యతను నిర్మూలించాయి. 10 సంవత్సరాలలో జనాభాలో 60 - 70 శాతం వరకు డిగ్రీ వరకు చదివేలా కృషి చేశాయి. కాని మన దేశంలో 2001 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యత శాతం 65.38; మన రాష్ట్రంలో 61.11. దేశంలో కూడ పురుషులలో అక్షరాస్యత 76% ఉండగా స్త్రీలలో 54% ఉంది. ప్రపంచంలో అక్షరాస్యతలో మనస్థానం 135లో ఉంది. క్రింది నుండి 7వ స్థానంలో ఉంది.

జనాభాలో స్త్రీల శాతం క్రమంగా తగ్గుతోంది. అయినా వారిలో నిరక్షరాస్యత శాతం ఎక్కువగా ఉండడమనేది దేశానికే అరిష్టదాయకం. షెడ్యూల్డు కూలాల, షెడ్యూల్డు తరగతుల, వెనుకబడిన వర్గాల పరిస్థితి మరీ దారుణంగా ఉంది.

పాఠశాలలో చేరిన తర్వాత మధ్యలో పాఠశాలలు వదిలివేళ్లే వారి సంఖ్య అత్యధికంగా వుంది. డ్రాపవుటు రేటు 1 నుండి 8 తరగతులలో 58.80% ఉండగా, బాలికలలో 67.55% ఉంది. ఇది సగటున అప్పర్ ప్రైమరీ స్థాయిలో 44%, సెకండరీ స్థాయిలో 52% ఉండగా అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో 50%, పోస్టు గ్రాడ్యుయేట్ స్థాయిలో 83%, రీసెర్చిలో 92% ఉంది. జనాభా పెరుగుతోంది. అక్షరాస్యులు పెరుగుతున్నారు. నిరక్షరాస్యత కూడా పెరుగుతోంది.

10 సంవత్సరాలలో 6-14 సం॥లలో అందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అందించాలని రాజ్యాంగంలో స్పష్టంగా వ్రాసుకొన్నాం. ఈ గడువు ప్రతి 5 సం॥లకు పొడిగించుకుంటూ వస్తున్నాము. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఈ గడువు 2005 సం॥గా నిర్ణయించుకున్నాము.

ఈ వైఫల్యాలకు గల కారణాలను విశ్లేషించుకోవాలి. గత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు విద్యారంగం యెడ సరియైన రాజకీయ దృక్పధం, అవగాహన లేకపోవడమే దీనికి ప్రధాన కారణం. విద్య మానవ సర్వతోముఖాభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడే కీలక అంశమనే దానిని విస్మరించి, కొంతకాలం సేవారంగంగా పరిగణించారు. నేడు కేవలం ఉత్పత్తికి తోడ్పడే రంగంగా పరిగణిస్తున్నారు.

ప్రపంచంలోని అన్ని దేశాలు తమ జి.డి.పి.లో 6%కి తక్కువగాకుండా నిధులు విద్యారంగానికి కేటాయిస్తున్నాయి. మన దేశంలో కేంద్ర ప్రభుత్వం మొదటి ప్రణాళికలో 7.86% కేటాయించి, 9వ ప్రణాళికలో 3.8% మాత్రమే కేటాయించింది. అందులో ప్రాథమిక విద్య వాటా కూడా మొదటి పంచవర్ష ప్రణాళికకు, 9వ ప్రణాళికకు తేడా ఉంది. మొదటి ప్రణాళికలో 5.6% ఉండగా నేడు అది 3.2%కు పడిపోయింది.

రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి బాగా లేనందున, విద్యాభారం రాష్ట్రాలే మోయాల్సి వస్తున్నందున ఏనాడూ రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెటులో 13-17%కు మించి ఈ రంగానికి కేటయించలేదు. ఈ డబ్బు ఉపాధ్యాయుల, ఇతర సిబ్బంది జీతాలకు, ఆఫీసు నిర్వహణకే సరిపోతోంది. ఇతర అభివృద్ధి పనులకు చాలడం లేదు.

1990లో థాయిలాండులో జరిగిన ప్రపంచ దేశాల సదస్సులో ప్రపంచ వ్యూహంలో భాగంగా ఐక్యరాజ్యసమితి, దాని అనుబంధ సంస్థలు అన్ని దేశాలలో 2000 సం॥ నాటికి అందరికి విద్యనేర్పడానికి విశేషంగా నిధులు అందించుటకు తీర్మానించాయి. వారి ప్రధాన ఉద్దేశ్యం విద్యతోపాటు, సమాజాన్ని మలచడం.

దానిలో భాగంగానే మన దేశానికి గత సం॥ల కాలంలో 5వేల కోట్లు ప్రపంచ బ్యాంకు విద్యారంగానికి అప్పుయిచ్చింది. కేంద్రం ఖర్చు చేసిన 4,700 కోట్లలో 3,700 కోట్లు ప్రపంచబ్యాంకు అప్పుగా యిచ్చింది. మన రాష్ట్రంలో కూడ గత 5 సం॥లో ఒ.డి.ఎ. పథకం క్రింద, డి.పి.ఇ.పి. పథకం క్రింద ప్రపంచబ్యాంకు నిధులు సమకూరాయి.

ఈ నిధులు వచ్చిన తర్వాత మాత్రమే ప్రాథమిక విద్యారంగంలో కొంత పురోగమనం కనిపిస్తోంది. అయితే ఈ నిధులు శాశ్వతంగా రావని గమనించాలి. ఈ నిధులతో బాటు వారి భావజాలాన్ని మన మీద రుద్దే ప్రయత్నమూ జరుగుతున్నది. 56 సం॥ల క్రితం మనం పారద్రోలిన పాశ్చాత్యులు, మారు రూపంలో నేడు తిరిగి ప్రవేశించి, మరల అన్ని రంగాలను ఆక్రమించారు.

మాతృభాషలో యూనివర్శిటీ వరకు విద్యాబోధన జరగాలని, మన భాష, సంస్కృతి ఈ తరానికి పరిపుష్టంగా అందించాలని పోరాడిన మనం ఈనాడు ఆంగ్ల భాషా వ్యామోహంలో పడి కొట్టుకుపోతున్నాం. జపాను, జర్మనీ, చైనా, రష్యాలాంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడ ఇంగ్లీషు వ్యామోహం లేదు. అవసరమైన వారే నేర్చుకొంటారు.

లాభాపేక్ష తప్ప, దేశాభిమానం, ప్రజాసంక్షేమం పట్టని ప్రైవేటు రంగజపం మితిమీరిపోయింది. అంతే కాకుండా మీడియా ద్వారా మన సంస్కృతి ఎంత విషపూరితమయిపోతున్నదో మన యిల్లు, ఒళ్ళు, కుటుంబ వ్యవస్థ, సాంఘిక వ్యవస్థలో వచ్చిన మార్పులు చూస్తే అర్థమవుతుంది. "అమ్మ-నాన్న" బూతు పదాలైనాయి. "మమ్మీ-డాడీ" మురిపమయింది.

యుటియఫ్ దీనిని తీవ్రంగా పరిగణిస్తోంది. స్వాతంత్ర్యపోరాట విలువలు కాపాడబడాలని కోరుతోంది.

ఉన్నత విద్యారంగాన్ని ప్రైవేటు పరం చేయాలని మనకు నీతులు చెప్పే పాశ్చాత్య దేశాలలో కెనడా 90.1%; జపాన్ 73.9%; జర్మనీ 72.9%; ఫ్రాన్స్ 89.7%; అమెరికా 78.9% ఖర్చు చేస్తున్నాయి. ఇండియా 20.5% ఖర్చు చేస్తోంది. ప్రభుత్వం ఈ మేరకు ఖర్చుచేస్తుంటేనే జనాభాలో డిగ్రీ చదివినవారు 6% దాటలేదు. ప్రభుత్వం ఈ రంగం నుండి వైదొలిగితే జనాభాలో 20% ఉన్న ధనికులే మొత్తం ఉన్నత విద్యారంగాన్ని ఆక్రమిస్తారు.

మన వృత్తి పవిత్రమైనది. ప్రత్యేకమైనది. భావి భారత పౌరులను తయారుచేసేది. మన సంక్షేమం కొరకు పోరాడాలి. సాధించుకోవాలి. అది ఒక పార్శ్వమే. కాని దానితో సంబంధంలేకుండా విద్యార్థులకు ఆదర్శంగా ఉండేవిధంగా ప్రవర్తిస్తూ, అంకితభావంతో పనిచేయాలి. విద్యార్థులలో నైతిక విలువలు, లౌకికతత్వం, దేశభక్తి పెంపొందించాలి. ప్రతిదానిని ప్రశ్నించే శాస్త్రీయ జిజ్ఞాసను అభివృద్ధి చెయ్యాలి. అవినీతిని, అన్యాయాన్ని ఎదిరించే పౌరులుగా తీర్చిదిద్దాలి. ఈ లక్ష్యం సాధించాలంటే దానికి తగినట్లు మనం వుండాలి. సమాజం అంతా కుళ్లిపోయిందనే సాకుతో, ముసుగుతో మన విద్యుక్తధర్మాన్ని విస్మరించరాదు. మన శ్రేయస్సు సమాజ శ్రేయస్సులో భాగమేకనుక నిరక్షరాస్యత నిండి ఉన్న మనదేశంలో చదువుకున్న వర్గ ప్రతినిధులుగా ఉపాధ్యాయులు ప్రజలకు మార్గ దర్శకులుగా పనిచెయ్యాలి.

ప్రభుత్వ పాఠశాలలపై క్రమంగా తరుగుతున్న ప్రజాభిమానాన్ని పునరుద్ధరించాలి. కేంద్ర ప్రభుత్వం చాపక్రింద నీరులా విద్యారంగంలో ప్రవేశపెడుతున్న మతతత్వ భావాలకు వ్యతిరేకంగా పోరాడాలి.

మనం ఆంగ్లభాషకు వ్యతిరేకం కాదు. అవసరమైనవారు, అవసరమొచ్చినపుడు నేర్చుకోవచ్చు. ప్రాథమిక విద్యవరకైనా మాతృభాషలోనే నిర్బంధ బోధన జరిగేలా ఉద్యమించాలి. 1,2 తరగతులలో ప్రామాణిక భాషలో గాక ఇంటి భాషలోనే బోధన జరగాలి.

ప్రైవేటు పాఠశాలల దాడిని ఎదుర్కోవాలి. మన రాష్ట్రంలో అన్ని కోర్సులకు ఎంట్రన్స్ విధానం వచ్చినప్పటి నుండే ప్రైవేటు పాఠశాలలు మూడుపువ్వులు ఆరు కాయలుగా విస్తరిస్తున్నాయి. ప్రభుత్వ సర్టిఫికెట్లకు యూనివర్శిటీ డిగ్రీలకు విలువ లేకుండా పోయింది. దానిని పునఃప్రతిష్ఠించేలా పోరాడాలి. ప్రభుత్వ పరీక్షల సర్టిఫికెట్లకు విలువను, గుర్తింపును సాధించాలి.

అశిక్షితులైనా ఉపాధ్యాయులుగ పనిచేయవచ్చని, అభద్రతా భావంతో మరింత మెరుగుగా పనిచేస్తారని, ప్రైవేటు విద్యావ్యాపారమే దేశానికి శ్రీరామరక్ష అనే సిద్ధాంతాలు ఈ మధ్య వినిపిస్తున్నాయి. ఇవి విద్యారంగాన్ని సర్వనాశనం చేసే సిద్ధాంతాలు. విద్యార్థి మానసిక స్థితిని గమనించి బోధించడానికి సుశిక్షితులైన ఉపాధ్యాయులు కావాలి. మనం ఈ అపసిద్ధాంతాలను ప్రతిఘటించాలి.

20వ శతాబ్దంలో జరిగిన విద్యారంగ కృషిని సమీక్షించుకొని 21వ శతాబ్దంలో విద్యారంగంలో రావలసిన మార్పులకు ఈ సభలో రూపకల్పన జరగాలి.

4 రోజుల కార్యక్రమంలో ఈ సభలకు విచ్చేసే, పెద్దలు, విద్యావేత్తలు, రాజకీయ నాయకులు యిచ్చే సలహాలతో మనం ఈ సభలలో ప్రవేశపెడుతున్న విద్యారంగ ముసాయిదా పత్రాన్ని పరిపుష్టం చేద్దాము.

గత 29 సం॥రాలలో మన ఉద్యమం కోసం విరామమెరుగక కృషిచేసి అమరులైన వారందరిని స్మరించుకొంటూ, జీవించి వున్న వారందరిని అభినందిస్తూ, నూతన దృక్పథంతో మన ప్రయాణం కొనసాగిద్దాం. ఈ మహా ప్రస్థానంలో ఎన్ని అడ్డంకులొచ్చినా ఎదుర్కొంటూ పయనిద్దాం. సమసమాజ నిర్మాణంలో మన వంతు కర్తవ్యం నెరవేరుద్దాం. దేశ వ్యాప్తంగా జరుగుతున్న ప్రజా పోరాటాలలో ఇతర ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలతోను, శ్రామిక, కార్మిక జనావళితోను భుజం భుజం కలిపి పోరాడుదాం. దేశస్వావలంబనను, మత సామరస్యాన్ని, లౌకికతత్వాన్ని పరిరక్షిస్తామని మరొకసారి శపథం చేస్తూ స్వర్ణోత్సవాల నాటికి మన ఉద్యమాన్ని రెట్టింపు చేస్తామని ప్రతిజ్ఞ చేద్దాం.

"అందరికీ విద్య" లక్ష్యం సాధించేందుకు కృషి చేద్దాం.




## లక్ష్మీ సెహగల్

యుటియఫ్ తొమ్మిదవ విద్యావైజ్ఞానిక మహాసభలను స్వాతంత్ర్య సమరయోధురాలు డా॥ కెప్టెన్ లక్ష్మీసెహగల్ ప్రారంభించారు. ఆమె తన ఉపన్యాసంలో జాతి నిర్మాణంలో కీలకమయిన ఉపాధ్యాయులు తమ కర్తవ్యాలకు పునరంకితం కావాలని పిలుపు నిచ్చారు. అంతా డబ్బుమయమైన ప్రస్తుత తరుణంలో ఆ ధోరణులు విడనాడి భావితరాలను బాధ్యతయుత పౌరులుగా తీర్చి దిద్దాలని ఆమె ఉద్బోధించారు.

**ఆమె ఇంకా ఇలా అన్నారు:-**

జాతి భవిష్యత్తులో విద్య ముఖ్యపాత్ర వహిస్తుంది. ప్రస్తుతం అంతా డబ్బు మయమయింది. ఉపాధ్యాయులు ఈ ధోరణికి భిన్నంగా నిస్వార్థంతో విద్యను బోధించి విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలి. మానవాళిని పట్టి పీడిస్తున్న వ్యాధుల నిర్మూలనకు కృషి చేయాలి. సాంకేతిక విజ్ఞానం పెరిగినా దానిపై ప్రకృతి శక్తులదే పైచేయిగా ఉంది. ఇరాక్‌లో వచ్చిన భూకంపమే దీనికి నిదర్శనం. విద్యార్థులకు శాస్త్రీయ ఆలోచనా ధోరణి అలవడేలా కృషి చేయాలి. ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగ పరిస్థితి ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాలతో పోల్చితే కొంత మెరుగుగా ఉంది. ఆ రాష్ట్రాలలో పాఠశాలల్లో కనీస వసతులు కూడ కరువయ్యాయి. ముఖ్యంగా బాలికలకు చదువు అందని ద్రాక్షలా మారింది. మహిళలకు సమాన హక్కులు కల్పించాలి. అప్పుడే సమాజం మొత్తంగా అభివృద్ధి చెందుతుంది.

ఈ రాష్ట్రంలో వేర్పాటువాద ధోరణులు ఎక్కువవుతున్న తరుణంలో అన్ని ప్రాంతాల నాయకులను కలుపుకొని యుటియఫ్ ముందుకు వెళుతున్నందులకు అభినందిస్తున్నాను.

◆

## మండవ వెంకటేశ్వర రావు

- పాఠశాల విద్యాశాఖామాత్యులు

ఈ మహాసభలకు ఇంత భారీ ఎత్తున ఉపాధ్యాయులు హాజరుకావడం ఆశ్చర్యం కలిగిస్తున్నది. మీ అందరితో మన రాష్ట్ర విద్యా విషయాలు చర్చించే అవకాశం లభించడం హర్షణీయం. ప్రభుత్వం విద్యాభివృద్ధికి చిత్తశుద్ధితో కృషి చేస్తున్నది. అయితే ప్రభుత్వాన్ని సరైన స్పృహలోనికి తీసికొని రావాల్సిన బాధ్యత ఉపాధ్యాయులదే. ఉపాధ్యాయులు తమ హక్కులను గురించి పోరాడడంలో తప్పులేదు. అయితే బాధ్యతలను విస్మరించరాదు. టీచర్ల కోర్కెలన్నీ తీర్చాలన్నదే ప్రభుత్వ అభిప్రాయం. అయితే బడ్జెటు కొరత వల్ల అది సాధ్యపడడంలేదు. అయినా త్వర్లో అన్ని సమస్యలను పరిష్కరిస్తాము. విద్యావాలంటీర్ల వ్యవస్థను రద్దుచేయాలన్నదే ప్రభుత్వ అభిమతం. అయితే అందరినీ రెగ్యులర్ టీచర్లనే నియమించి వారి జీత భత్యాలు చెల్లించే స్థితిలో ప్రభుత్వం లేదు. విద్య పై ప్రపంచబ్యాంకు పెత్తనం చేస్తోందనడం అవాస్తవం. మధ్యాహ్న భోజన పథకాన్ని పదవతరగతి వరకు విస్తరించాలనే యోచన ఉంది. ఇందుకు సరిపడా బియ్యాన్ని అందచేసేందుకు కేంద్ర ప్రభుత్వ సూత్ర ప్రాయంగా అంగీకరించింది. ఎన్నికల అనంతరం వచ్చే ప్రభుత్వంతో చర్చించి బియ్యం యిస్తే ఈ పథకాన్ని విస్తరిస్తాం.

పనిచేసే చోటనే నివాసముండాలనే నిబంధనల అమలు విషయంలో ఉపాధ్యాయ సంఘాల కోరిక మేరకు తాత్కాలికంగా కొంత వెసులు బాటు యిచ్చాం. ఈ విషయంలో ఉపాధ్యాయ సంఘాలు తీవ్రంగా ఆలోచించాలి. పనిచేసే చోట నివాసముంటే వారు పూర్తి బాధ్యత నేరవేర్చగలరు. 'అందరికీ విద్య' లక్ష్యాన్ని సాధించగలం.

◆

## డా॥ మన్మోహన్ సింగ్.,ఐ.ఎ.ఎస్.

-పాఠశాల విద్యాకమిషనర్ & సంచాలకులు

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 9వ మహాసభల సందర్భంగా నిర్వహిస్తున్న ఈ సదస్సులో పాల్గొన్న ఉపాధ్యాయులను చూస్తే రాష్ట్రంలో మీ బలమెంతో అర్థమవుతున్నది. యుటియఫ్ ఏర్పాటు చేసిన సమావేశాలలో గతంలో కూడ పాల్గొన్నాను. ఎం.ఇ.ఓ.లకు, ప్రధానోపాధ్యాయులకు మీరు నిర్వహించిన శిక్షణా తరగతులలో పాల్గొన్నాను. మీ సంఘం కేవలం హక్కుల కొరకు పోరాడడమే కాకుండా బాధ్యతల నిర్వహణ కొరకు కూడ కృషి చేయడం ముదావహం. కొందరు ప్రతి విషయాన్ని "నెగెటివ్" దృక్పథంతో చూస్తారు. ప్రభుత్వ కార్యక్రమమంటేనే వ్యతిరేకించాలనుకుంటారు. మీరు అలాకాకుండా విద్యారంగ అభివృద్ధికి కృషి చేస్తున్నందుకు అభినందిస్తున్నాను. మీ సంఘం 1991-92 సం॥లలో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమంలో విశేష కృషి చేసిందని విన్నాను. గత సంవత్సరం కొన్ని మండలాలను దత్తత తీసికొని అక్షరాస్యతా వ్యాప్తికి కృషి చేశారు. ప్రభుత్వం ఎంత ఖర్చు చేసినా ఉపాధ్యాయుల తోడ్పాటు లేకపోతే ఏ పథకమూ జయప్రదం కాదు.

మన రాష్ట్రంలో ప్రైవేటు పాఠశాలలు ఎక్కువగా ఉన్నా ప్రభుత్వ పాఠశాలలలోనే మంచి ఫలితాలు వస్తున్నాయని చెప్పడానికి గర్విస్తున్నాను. ప్రభుత్వ రెసిడెన్సియల్ పాఠశాలలలో 10వ తరగతి పరీక్షా ఫలితాలు అద్భుతంగా ఉన్నాయి.

మన ముందున్న ప్రధాన సమస్య బాలకార్మిక వ్యవస్థ. దీని నిర్మూలనకు ప్రభుత్వంతో పాటు అనేక స్వచ్ఛంద సంస్థలు కూడ కృషిచేస్తున్నాయి. మీరు కూడ సామాజిక స్పృహతో తోడ్పడాలి. ప్రాథమిక పాఠశాలలలో రెండవ ప్రధాన సమస్య డ్రాపవుట్లు. మన రాష్ట్రంలో 1-5 తరగతుల వరకు డ్రాప్ అవుట్ శాతం 32.39% ఉంది. అందులో బాలుర శాతం 33.74 అయితే బాలికల శాతం 30.91గా ఉంది. 1-7 వ తరగతులు చూస్తే ఈ శాతం 51.52%గా ఉంది. అందులో బాలురది 49.93% అయితే బాలికలది 53.22% గా ఉంది. దీనిని తగ్గించాలంటే యితర అంశాలతో పాటు ఉపాధ్యాయుల బోధనా విధానంలో మెరుగుదల రావాలి. శాస్త్రీయ పద్ధతిలో బోధన జరుగాలి. ఆడుతూ పాడుతూ ఉండే బోధన జరుగాలి.

-(తరువాయి 20వ పేజీలో)

◆







# చైతన్య సదస్సు

## ఉపాధ్యాయ వృత్తివిలువలను కాపాడుతున్న యుటియఫ్

డి. రామిరెడ్డి

సమాజంలో విద్య, ఉపాధ్యాయ విలువలను కాపాడడంలో యుటియఫ్ అగ్రభాగన నిలుస్తోందని స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (ఎస్.టి.ఎఫ్.ఐ) అధ్యక్షులు **డి. రామిరెడ్డి** అన్నారు. యుటియఫ్ 9వ రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని 30.12.2003 ఉదయం ప్రారంభమైన ప్రతినిధుల సభను ప్రారంభిస్తూ ఆయన ఉపన్యసించారు. యుటియఫ్ లక్ష్యాల సాధనలో ముందుండడంతో పాటు హక్కులను, బాధ్యతలను సమదృష్టితో చూస్తోందన్నారు. ఉపాధ్యాయుల హక్కుల కోసం నిరంతరం పోరాటాలు జరుపుతూ ఉపాధ్యాయుల ఆదరాభి మానాలను పొందుతోందన్నారు. ప్రభుత్వం రూపొందించే కార్యక్రమాలను నిశితంగా పరిశీలిస్తూ మంచిచెడులను విశ్లేషించి ప్రాతినిధ్యం చేయడంలో యుటియఫ్ అగ్రభాగాన ఉందని ఆయన అన్నారు. హక్కుల సాధనలో వ్యక్తులపై ఆధారపడకుండా చర్చలు, ఆందోళనల ద్వారా సాధించు కోవడానికి యుటియఫ్ ప్రయత్నిస్తోందని అన్నారు. పాలకుల హామీలను పరిగణనలోకి తీసుకోకుండా పోరాటాలతో హక్కులను సాధిస్తోందని రామిరెడ్డి అన్నారు. జాతీయ స్థాయి ఎస్.టి.యఫ్.ఐ. లో భాగస్వామి కావడంతో పాటు అందులో ప్రధాన పాత్ర పోషిస్తోందని అన్నారు. దీనంతటికి యుటియఫ్ లోని క్రమశిక్షణ, ఉద్యమ స్ఫూర్తియే కారణమని కారణమని నొక్కివక్కాణించారు. ఉపాధ్యాయుల కోసం పాటుపడుతున్న యుటియఫ్‌లో లక్షపై చిలుకు సభ్యత్వంతో 9వ రాష్ట్ర మహాసభలలోకి ప్రవేశించడం గర్వకారణమని అన్నారు. 10వ మహాసభలకు ఈ సభ్యత్వం లక్షన్నరకు చేరేవిధంగా కృషి చేయాలని ప్రతినిధులకు రామిరెడ్డి పిలుపునిచ్చారు. యుటియఫ్ ఉపాధ్యాయ ఉద్యమాలకే పరిమితం కాకుండా సమాజంలో వచ్చే మార్పులను ఎప్పటికప్పుడు గమనిస్తూ వాటిపై కూడా పోరాటాలను చేస్తోంది. అదే విధంగా ఐక్య ఉద్యమాలలో కూడా యుటియఫ్ అగ్రభాగాన నిలువడం ఐక్యఉద్యమంపై దానికి గల నమ్మకాన్ని చాటి చెబుతోందని రామిరెడ్డి అన్నారు.

## కేంద్ర విధానాలతో చదువంతా వ్యాపారమయం

సీతారాం ఏచూరి

'పీపుల్స్ డెమొక్రసీ' ఆంగ్ల వార పత్రిక సంపాదకులు, సి.పి.(ఐ.)యం. పొలిట్ బ్యురో సభ్యులు శ్రీ సీతారాం ఏచూరి 28.12.2003న జరిగిన చైతన్య సదస్సులో ప్రసంగించారు. "యుటియఫ్ మహాసభలన్నిటిలో పాల్గొనడం నాకు ఆనందంగా ఉంది. ఈ తొమ్మిదవ మహాసభలు రాజకీయంగా చాల కీలకమయిన సమయంలో జరుగుతున్నాయి. త్వరలో ఎన్నికలు రాబోతున్నాయి. గత 5 సం॥లలో కేంద్ర ప్రభుత్వం అనుసరించిన ఆర్థిక, విద్యా విధానాల వల్ల జరిగిన నష్టాన్ని జాగ్రత్తగా, లోతుగా విశ్లేషించి ప్రతి ఉపాధ్యాయుడు సరియైన అవగాహనను ఏర్పరచుకోవాలి.

విద్యారంగంలో ప్రైవేటీకరణ మూలంగా వ్యాపార ధోరణి పెరిగింది. ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేకపోవడం వల్ల 'అందరికీ విద్య' అనే ఆశయం 50 సం॥ల నుండి నెరవేరకుండా పోయింది. ప్రభుత్వ ఆర్థిక విధానాలే విద్యారంగ దుస్థితికి కారణం. గడచిన 5 సం॥లలో నిరుద్యోగం విపరీతంగా పెరిగింది. వ్యవస్థీకృత రంగంలో 1991-96 మధ్య 4.30 లక్షల ఉద్యోగాలు, 96-98లో మరో 3 లక్షల మంది ఉద్యోగాలు పెరిగాయి. కాని 1998 నుండి ఇప్పటి వరకు 10 లక్షల మంది ఉద్యోగాలు కోల్పోయి వీధిన పడ్డారు. ఈ ప్రభుత్వం ప్రభుత్వ రంగ సంస్థలన్నింటిని ప్రైవేట్ రంగానికి అమ్మివేస్తున్నది. కాంట్రాక్టు నియామకాలతో సరిపెట్టుకొంటున్నది. మరోవైపు మతతత్వం వికృత రూపం దాలుస్తున్నది. చరిత్ర పాఠాల్ని వక్రీకరించే ప్రయత్నం తీవ్ర స్థాయిలో జరుగుతున్నది. నేషనల్ కౌన్సిల్ ఫర్ ఎడ్యుకేషనల్ రీసెర్చి అండ్ ట్రైనింగ్ (ఎన్.సి.ఇ.ఆర్.టి.) ప్రచురించిన ఎనిమిదవ తరగతి పుస్తకంలో "బాబరు భారత దేశంపై దండెత్తి ఇబ్రహీం లోడీని ఓడించి మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించాడు" అని ఉండేది. కాని దాన్ని "బాబరు భారత దేశంపై దండెత్తి మొగలు సామ్రాజ్యాన్ని స్థాపించాడు" అని మార్చారు. అంతకు ముందే అక్కడ ఒక ముస్లిం రాజు ఉన్నాడన్న విషయాన్ని లేకుండా చేశారు. ఆ తర్వాత దశలో బాబరు హిందు దేశంపై దండెత్తాడని ప్రచారం ప్రారంభిస్తారు.

-(తరువాయి 16వ పేజీలో)

## ఏరంగంలో సంక్షోభం తలెత్తినా విద్యారంగంపైనే ప్రభావం

జర్నలిస్టు, సాయినాథ్

ఈ సమాజంలో అన్నింటి కంటే అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న అంశం ఒక్క అసమానతే. ఈ అసమానతలు దేశాల మధ్య పెరుగుతున్నాయి. దేశంలో పేదల మధ్య, ధనికుల మధ్య, కూడ విపరీతంగా పెరుగుతున్నాయి. అమెరికాలో అత్యంత ధనికునికి, పేదవానికి ఆదాయంలో తేడా 1:100 గా ఉంటే భారత దేశంలో 1:30,000గా ఉంది. ఆదే విధంగా ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాల వల్ల లింగవివక్షత కూడ పెరుగుతున్నది. ప్రతి సంవత్సరం వ్యవసాయంలో కరువు రావడంతో పాఠశాలల్లో డ్రాప్ అవుట్స్ పెరుగుతూనే ఉన్నాయి. ఈ డ్రాప్‌అవుట్ బాలికల్లో ఎక్కువగా, ఆదివాసి దళిత బాలికల్లో మరింత ఎక్కువగా ఉంది. తీవ్ర దుర్భిక్షంలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. గత 5 సంవత్సరాలలో అనంతపురం జిల్లాలో 2500 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్న ఈ కరువులో కాలేజీ పిల్లలు చదువు మానుకొని పొట్టచేతపట్టుకొని వలసపోతున్నారు. అనంతపురం జిల్లా రోడ్డు వెంబడి ఒక ధాబా హోటల్లో యం.ఎ. ఫస్టు క్లాసు విద్యార్థి సర్వరుగా పనిచేయడం చూశాము. పేదలకు అందుబాటులో ఉండే ప్రాథమిక విద్యాలయాలను డిస్పెన్సరీలను, బస్‌డిపోలను మూసివేసి వీలు కాక పోతే ప్రైవేటు పరంచేసి కార్పొరేట్ పాఠశాలలను, సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులను, విమానాశ్రయాలను నిర్మిస్తున్నారు. ఎవరి కోసం? ధనికుల కోసం. ఈ విధమైన అసమానతలున్న సమాజంలో అందరికీ విద్య, సంపూర్ణ అక్షరాస్యత, అభివృద్ధిని గూర్చి మాట్లాడడం ఎంత వరకు సబబు? ఈ అసమానతల వల్ల పేదరికం, అవినీతి, వ్యభిచారం వేగంగా పెరుగుతున్నాయి. ఆర్థిక సంస్కరణలు, పేదరికం వల్ల విద్య మీద ఎటువంటి భారం పడుతుందో ఎన్ రాన్ కంపెనీ అనుభవం నుండి నేర్చుకోవచ్చు ఎన్‌రాన్ కంపెనీల విద్యుత్ బకాయిలు చెల్లించలేక మహారాష్ట్ర ప్రభుత్వం అన్ని సంక్షేమ రంగాల బడ్జెట్‌లలో కోత విధించింది. డబ్బుల కొరకు అనేక ఫ్యాక్టరీలు మూసివేసి, స్థలాలు అమ్మారు. పనులు కోల్పోయిన పేదలు తమ పిల్లలను ప్రభుత్వ బడులకు పంపడం మాన్పించారు. అంటే ప్రతి రంగంలో వచ్చే సంకోభం విద్యారంగం మీద పడుతుంది.

-(తరువాయి 16వ పేజీలో)








**ఎస్. వీరయ్య,**
ప్రధానకార్యదర్శి,
సి.ఐ.టి.యు రాష్ట్ర కమిటీ

## కె. రామచంద్రమూర్తి

*సంపాదకులు, ఆంధ్రజ్యోతి.*

సంస్కరణలు ప్రారంభమయినపుడు ప్రభుత్వం కొన్ని రంగాల నుండి తప్పు కొని మిగిలిన రంగాలపై ముఖ్యంగా విద్య, వైద్యం పై ఎక్కువ ఖర్చు చేసి సమర్థవంతంగా నడుపుతుందను కున్నాం. అప్పులు తేవడం తప్పు కాదు. అప్పులు షరతులపై తెస్తున్నారు. ఎవరి నుండి తెస్తున్నారు? ఆ డబ్బు ఏ ప్రాధాన్యతల ప్రకారం ఖర్చు పెడుతున్నారు?-అన్నది ముఖ్యం. ఈ ఖర్చు వల్ల మనకు సమకూరే సామాజిక లాభాలేమిటనేది ముఖ్యం. ప్రభుత్వం మహిళల గురించి, నిరుద్యోగుల గురించి ఏ వైనా కొత్త పథకాలు రూపొందించిందా, సబ్సిడీలు పెంచిందా, రాయితీలు పెంచిందా అనేది చూడాలి. నా ఉద్దేశ్యం ప్రకారం అప్పుతెచ్చిన డబ్బు సామాజి కాభివృద్ధికి ఖర్చు పెట్టడం లేదు. మేధావులైన ఉపాధ్యాయులు ఈ అంశాలు గమనించాలి; విశ్లేషించాలి; గుణపాఠాలు తీయాలి. వాటిని విద్యార్థులకు, ప్రజలకు వివరించి వారిని చైతన్యవంతులను చేయాలి.

### సాయినాథ్

దీనిని గమనించి ఉపాధ్యాయులు ఈ నూతన ఆర్థిక సంస్కరణలకు వ్యతిరేకంగా పోరాడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

పాకిస్తాన్‌లో ప్రభుత్వ పాఠశాలలో నిర్లక్ష్యం చేస్తే పిల్లలు మదర్సాలలో చేరారు. వాటికి ఆమెరికాయే డబ్బిచ్చింది. అక్కడే తాలిబాన్లు పుట్టారు. ప్రభుత్వ నిర్లక్ష్యం ప్రభావం విద్యారంగంలో మతోన్మాదం పెరగడానికి తోడ్పడుతుంది. సామాజిక న్యాయం దెబ్బతింటుంది. ప్రభుత్వం పునాదిలో విద్యను, వైద్యాన్ని నిర్లక్ష్యం చేస్తే ఏమి జరిగిందో ఆంధ్రలో మలేరియా వచ్చినప్పుడు, చైనాలో సార్సు వ్యాధి వచ్చినప్పుడు తెలిసింది. చైనాలో సంవత్సరం మొత్తం మీద సార్సు వ్యాధితో 800 మంది చనిపోతే మనదేశంలో ప్రతి రోజు క్షయ వ్యాధితో 800 మంది చనిపోతున్నారు. ప్రభుత్వం కార్పొరేట్ ఆస్పత్రులను గూర్చి మాట్లాడు తుంది. బొంబాయిలో లీలావతి అను పత్రిలో ఒక మంచం బాడుగ 5 గురి సంవత్సర ఆదాయం కంటే ఎక్కువ. ప్రభుత్వం లైబ్రేరీలను మూసి వేస్తున్నది. బస్ స్టాండులను మూసి విమానా శ్రయాలను నిర్మిస్తున్నారు. కొంత మంది ఈత కొలను కోసం ఖర్చు పెట్టే డబ్బుతో వేలాది మందికి మంచినీరు ఈయవచ్చు, ఈ విషయాన్ని పిల్లలకు చెప్పాలి. స్వాతంత్ర్య పోరాటాల లక్ష్యాలు చెప్పాలి. విద్యార్థులకు నైతిక విలువలు బోధించాలి.

## డా॥ కె.నాగేశ్వర్

*గౌరవ సంపాదకులు, ఎనాలిసిస్*

ఈ రోజు 'అందరికీ విద్య' నిత్య నినాదంగా మారింది. పిల్లలు ఎందుకు బడికి రావడంలేదో ప్రభుత్వానికి చక్కగా తెలుసు. యిటీవల కర్నూలు లో ఒక సభలో ముఖ్యమంత్రి స్వయంగా ఒక అబ్బాయిని అడిగారు "మీనాయిన ఏం చేస్తున్నాడు" అని. "తాగిపడివున్నాడు" అని జవాబు వచ్చింది. తాగుడు పెంచడానికి ప్రభుత్వం మద్యం షాపులను పెంచుతున్నది. పేదలు తాగి డబ్బు తగలేస్తున్నారు. కుటుంబాలను నిర్లక్ష్యం చేస్తున్నారు.

మనది పేద దేశం కాదు- పేదప్రజలున్న దేశం. మనకు అన్ని రకాల సంపదలతో పాటు మానవ సంపద కూడ దండిగా వుంది. ఈ మానవ శక్తిని సక్రమంగా ఉపయోగిస్తే పురోగ మనం అద్భుతంగా జరుగుతుంది. చైనా మానవ సంపదను సద్వినియోగం చేసుకుంటున్నది. అందుకే మన కంటే వేగంగా అభివృద్ధి చెందుతున్నది.

మన దేశంలో అందరికీ విద్య కావాలంటే జి.డి.పి.లో 0.44% అదనంగా కేటాయిస్తే చాలు ఈ విషయం తపన్ మజుందార్ కమిటీ చెప్పింది. 10సం॥లలో అందరికీ విద్య రావాలంటే 138 వేలకోట్లు కావాలన్నారు. అంటే సంవత్సరానికి 14 వేల కోట్లు కావాలి. కాని మన ప్రభుత్వం సంవత్స రానికి 9 వేల కోట్లు కూడ కేటాయించడం లేదు.

మన ప్రభుత్వం అన్ని రంగాలను అభివృద్ధి చేయకుండా అప్పులు తెచ్చుకొని చంకలెగరేస్తున్నది. మన రాష్ట్రంలో క్రీడా పోటీలు జరిగినప్పుడు మన రాష్ట్రం తరపున ఇతర రాష్ట్రాల క్రీడాకారులు ఆడిగెలిచారు. అంతా ఇన్‌స్టాంట్. పిల్లలను కని,పెంచి, డాక్టర్లను చేసేకంటే డాక్టర్లనే దత్తత చేసుకుంటే సులభమనుకుంటున్నారు.

ఈ చదువురాని పిల్లలలో ఎంతోమంది ప్రతిభావంతులుంటారు. అవకాశమిస్తే ఈ మట్టి నుండి మాణిక్యాలు పుడతాయి. మా ఊరిలో సింగరేణి కంపెనీలో ఉద్యోగాల కొరకు పరుగు పందెంపెడితే పల్లెటూరి వాడు గెలిచాడు. ఎలా గెలిచావని అడిగితే ఉద్యోగం అవసరం కాబట్టి పరుగెత్తానన్నాడు. మన కంప్యూటరు ఇంజనీర్లు అమెరికాలో 23 శాతం ఉన్నారు. కొంత మంది ఎంత విచిత్రమైన వాదన చేస్తున్నారు. 'అక్షరాస్యత చాలు - ప్రాథమిక విద్య ఎందుకు' అని. పెట్టుబడి దారుల ఉత్పత్తులను కొనే విజ్ఞానమే జనం నేర్వాలి కాని వారి దోపిడిని ప్రశ్నించే చదువు రాకూడదు. అందుకే 14 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు అందరికీ రెగ్యులర్ విద్యను అందించడానికి బదులుగా నాన్ ఫార్మల్ విద్య చాలునంటున్నారు. ఇది మోసం, దగా.

మరొక వాదన 'లాభాలు సంపాదించే చదువు చెప్పాలేగాని, విజ్ఞానం వచ్చే చదువుతో పనిలేదు'- అని. అదేనిజమైతే, రాయలసీమలో బాంబుల తయారీ కోర్సులు, తెలంగాణాలో బూతుల ఆక్రమణ కోర్సులు పెడితే మంచిది.

'డబ్బులేదు కాబట్టి ప్రమాణాల గురించి అడగొద్దు' అనేది మరొక వాదన. డాక్టర్ లేదని కాంపౌండర్‌తో ఆపరేషన్ చేయించుకుంటే ఏమి జరుగుతుందో డబ్బులేదని ఉపాధ్యాయుణ్ణి నియమించకుండా విద్యా వాలంటీర్లను నియమిస్తే అదేజరుగుతుంది. మనం ఇన్‌ఫర్‌మేషన్ రంగంలో అభివృద్ధి చెందామని ప్రభుత్వం చెబుతున్నది. యిది కూడ నిజంకాదు. మన కంటే కర్నాటక ఈ రంగంలో ముందున్నది.

బిల్‌గేట్స్ మన రాష్ట్రాని కొచ్చినపుడు "మేము చాలా గ్రామాల్లో కంప్యూటర్లు పెట్టా"మని ముఖ్యమంత్రి చెబితే "ఎన్ని గ్రామాలకు కంప్యూటర్లు వచ్చాయనేది ముఖ్యం కాదు. ఎన్ని గ్రామాలకు మంచి నీళ్ళిచ్చారు అనేది ముఖ్యం" అని బిల్‌గేట్స్ అన్నారు.

ప్రజల కొనుగోలు శక్తి పెరిగితే దేశీయ మార్కెట్ అభివృద్ధి చెందుతుంది. దానితో దేశీయ పరిశ్రమలు పెరుగుతాయి. మన జనాభాలో సగం మంది రోజు కొక కోడిగ్రుడ్డు తింటే మన రాష్ట్రంలో, దేశంలో కోళ్ల పరిశ్రమ 4 రెట్లు పెరుగుతుంది.

మన నాయకులు కొందరు స్వదేశీముసుగు వేసుకొని విదేశీభజన చేస్తుంటారు. వీరి విషయంలో జాగ్రత్తగా వుండాలి.

### సీతారాం ఏచూరి

రాజకీయ ప్రయోజనాల కోసమే యిదంతా చేస్తున్నారు. ఒక విషయాన్ని ఎన్నిరకాలుగానైనా చెప్పవచ్చు. దశావతారాలను విష్ణువు అవతారాలు గానే కాకుండా మానవ పరిణామక్రమాన్ని జోడించి దానికనుగుణంగా కూడ చెప్పవచ్చు. ఇప్పుడు ఆర్యులు బయటనుండి రాలేదని, ఇక్కడి వాళ్లేనని నిరూపించేందుకు తంటాలు పడుతున్నారు. ఇలాంటి మతోన్మాద చర్యలు ప్రజలపై చాల రకాల ప్రభావం చూపుతాయి. కనుక ప్రతి విషయాన్ని విద్యార్థులకు అన్ని కోణాల్లో వివరించి చెప్పి, వారిలో అవసరమైన చైతన్యాన్ని కలిగించకపోతే ప్రజల ఐక్యతను దేశ సమైక్యతను కాపాడడం సాధ్యం కాదు.




## ప్రొఫెసర్ శాంతా సిన్హా

మెగసెసే అవార్డు గ్రహీత.

మహిళా సాధికారతను పోరాడి సాధించుకోవాలి. మహిళా సాధికారత ఎంతకష్టమైనదో వివరించడానికి నాస్వీయ అనుభవంలోని రెండు మూడు సంఘటనలు చెబుతాను. మామిడిపూడి వెంకటరంగయ్య ఫౌండేషన్‌లో పని చేస్తున్న మేము ఆరు సంవత్సరాలకు పూర్వం వరకు ఆడపిల్లలను యిండ్ల నుండి తీసికొనివచ్చి మా పాఠశాలలో చేర్చుకొనే వారము కాదు. ఆరు సంవత్సరాల క్రితం ఇందిర అనే ఇరవై సంవత్సరాల అమ్మాయి ఇంటి నుండి పారిపోయి మా వద్దకు వచ్చి తనకు రక్షణ యిమ్మని కోరింది. తనకు గతంలో ఎనిమిది పెండ్లి సంబంధాలు వచ్చాయని, తొమ్మిదో సంబంధం రాగా, పెండ్లి చేసుకోవడం యిష్టం లేక వచ్చానని చెప్పింది. మేము "యింటికి పొ"మ్మని చెప్పగా "నావంటి వారికి రక్షణ ఈయకపోతే మీ సంస్థను మూసివేసు కోండి" అని చెప్పింది. దానితో మా కండ్లు తెరుచుకున్నాయి. అప్పటి నుండి బాలికలకు కూడ అవకాశం యిస్తున్నాము. ఈ రోజు 10 వేల మంది మా సంస్థలో చదువుతున్నారు. ఇందిర పోరాటంవల్లే యిది జరిగింది.

2. పది మంది ఆడపిల్లలకు ప్రభుత్వం బట్టలిస్తే ఆకుపచ్చ స్కర్టులు, పసుపు పచ్చబ్లౌజ్‌లు కుట్టించుకున్నారు. ఒక ప్రధానోపాధ్యాయుడు వారి బడిలో బ్లూ స్కర్టు, పసుపుపచ్చ బ్లౌజ్ లేదని వారిని బడికిరానీయలేదు. వారిని రోజూ దెబ్బలు కొట్టేవారు. ఆగస్టు 15 ఉత్సవాలకు కూడ వారిని రానీయలేదు. దీనికి మేము పంచాయితీ చేయాల్సి వచ్చింది.

3. ఆడపిల్లలు పెద్దమనిషి అయితే కొన్నిసార్లు ఒక నెల రోజులు బడికి రారు. ఒక మూర్ఖుడైన ప్రధానోపాధ్యాయుడు ఒక అమ్మాయి పేరును తొలగించి మెడికల్ సర్టిఫికేట్ కావాలని అడిగి ఆడపిల్లలకు సహజమైన విషయాలను రూల్సులో బంధించి ఆ అమ్మాయిని బడి నుండి పారిపోయేలా చేశాడు. ఇలా చాలాచోట్ల జరుగుతున్నాయి.

4. శ్రీకాకుళం గిరిజనులలో మా కృషి వల్ల గిరిజన పిల్లలు బడికి రావడమేగాక అనాగరికులైన గిరిజన తల్లిదండ్రులు కూడా తమ పిల్లలకు ఆధునిక వస్త్రాలు కొని ఇచ్చారు. ఇది చదువు సాధించిన మార్పు. (తరువాయి 3వ కాలంలో)

## శ్రీమతి మల్లు స్వరాజ్యం

ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా),
జాతీయ ఉపాధ్యక్షురాలు

స్వాతంత్ర్యం వస్తే, మంచి సమాజం నిర్మించవచ్చునని, స్త్రీలకు విముక్తి కలుగుతుందని ఆశించి స్వాతంత్ర్య పోరాటంలో, తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో వేలాది మంది ప్రాణాలు అర్పించారు. కాని ఈ రోజు స్త్రీల పై జరిగే అత్యాచారాలు చూస్తే వారి త్యాగాలు వ్యర్థమయ్యాయనిపిస్తున్నది. సాధికారత ఆడవారికే కాదు మగవారికి కూడా లేదు. బహిరంగంగా అత్యాచారం జరిగితే ఖండించేధైర్యం ఎంత మంది పురుషులకుంది? ఎన్నికలలో చెప్పి మరీ భూస్వాములు రిగ్గింగు చేస్తుంటే ఎన్నికల డైరీలలో కూడ రాయలేని పంతుళ్లుకొందరున్నారు. గతంలో ఉపాధ్యాయులు గ్రామాలలో ఉండి భూస్వాములను ఎదిరించి, కష్టాలు భరించి మాలాంటి వారిని ఉద్యమాల్లోకి ప్రోత్సహించారు. కాని ఈ నాడు ఉపాధ్యాయులు ఆవిధంగా చేయడం లేదు. ఉపాధ్యాయులు చైతన్యంతో కృషి చేస్తేనే గ్రామాలలో మహిళాసాధికారతను సాధించ గలుగుతాం.

ఈ రోజు స్వాతంత్ర్య స్ఫూర్తి లేని, అమెరికాకు బానిసత్వం చేసే ప్రభుత్వంలో మనముండాల్సి వస్తున్నది. ఉద్యోగినులు కూడ కట్నం యివ్వకుండా,తీసుకోకుండా, పెండ్లిండ్లు చేసుకోలేక పోతున్నారు. ఇండ్లలో కూడ స్త్రీలకు పూర్తి స్వేచ్ఛ లేదు. సాధికారత కోసం పోరాటం జరుగుతున్నది. మహిళలకు ఒకటి, రెండు మంత్రి పదవులు యిస్తున్నారు కాని, మహిళలకు నిజమైన సాధికారత యింకారాలేదు. ఒక ప్రక్క త్రిశూలాలను పంచుతూ, మరొక ప్రక్క మతకల్లోలాలు సృష్టిస్తూ, ఇంకొక్క ప్రక్క మహిళా రిజర్వేషన్ల బిల్లు పాస్ కాలేదంటే ఎక్కడుంది సాధికారత? సమాజం ముందుకు పోవాలంటే మీతోడ్పాటు చాలా అవసరం. మహిళలు నిజమైనసాధికారతను సాధించడానికి ఉపాధ్యాయులు అయిన మీరందరూ కృషి చెయ్యాలి.

## యం. విజయవాణి

మహిళా విభాగం కన్వనర్, ఎ.పి.ఎన్.జి.ఓ. సంఘం

ఈ రోజు ఉద్యోగులలో, ఉపాధ్యాయులలో 33 శాతం రిజర్వేషన్లు అమలు జరిగిన తర్వాత ఎక్కువ సంఖ్యలో మహిళలు ఉద్యోగాలలో ప్రవేశిస్తున్నారు. మొత్తం ఉద్యోగులంతా పోరాడితే గాని ఏ సమస్యలూ పరిష్కారంకావడం లేదు. సంఖ్యలో 3వ వంతు వున్నా మహిళలు ఉద్యమాలలో చురుకుగా పనిచెయ్యక ఆ బాధ్యత పురుషులదే అన్నట్లు ప్రవర్తిస్తే ఉద్యమాలకు తీరని అన్యాయం జరుగుతుంది. మహిళా ఉద్యోగులకు రెండు రకాల బాధ్యతలున్నాయి. ఒకటి అందరి కొరకు పోరాడడం. రెండవది తమ ప్రత్యేక సమస్యల పై పోరాడడం మహిళలు ఉద్యోగాలు చెయ్యా లంటే కొన్ని ప్రత్యేక సదుపాయాలు కావాలి. వారు యింటి పని, ఆఫీసు పనిచేయాల్సి ఉంటుంది. అందుచే వారి నియామకాలు వీలైనంత వరకు నివాసాలకు దగ్గర ఉండాలి. ఆఫీసుల్లో, పాఠశాలలో మూత్రశాలలు, మరుగు దొడ్లతో పాటు ప్రత్యేకంగా విశ్రాంతి గదులుండాలి. టీజింగ్ లేకుండా రక్షణ కావాలి. బదిలీలలో ప్రత్యే రక్షణ కల్పించాలి. వారికి ప్రసూతి సమయంలో కనీసం 6 నెలల సెలవైనా ఉండాలి. అదనపు చదువుల కొరకు ప్రత్యేక సెలవు సదుపాయం ఉండాలి. వాటితో పాటు యూనియన్లలో పనిచేయడానికి కూడ అనువైన వాతావరణ ముండాలి. సమావేశాలు సకాలంలో, పగలే నిర్వహించాలి. వీలయినంత వరకు ఆదివారాల్లో, పండుగ రోజుల్లో సమావేశాలు లేకుండా చూడాలి. మనవారు భార్యలను, తోబుట్టువులను, తమపిల్లలను ఉద్యమాలలో పనిచేయడానికి ప్రోత్సహించాలి. ప్రభుత్వ విధానాల వల్ల మొదట నష్టపోయేది మహిళలేనని గుర్తించాలి.

### శాంతాసిన్హా

**మరొక విషయం:** రాబోయే పార్లమెంటు సమావేశాలలో ప్రవేశపెట్టనున్న విద్యా బిల్లు (ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యా బిల్లు) లో పాఠశాలల నిర్వచనాన్నే మార్చి వేశారు. కొత్తగా 'Approved School means it is an Education Guaranteed centre or alternative School run under a Scheme formed or approved by Central Government or an appropriate Govt. under section 26." ఈ సాకుతో కేంద్రంలోని బి.జె.పి ప్రభుత్వం ప్రజల డబ్బుతో వేలాది శిశుమందిర్ పాఠశాలలను ప్రారంభించబోతున్నది. ఈ ప్రమా దాన్ని నిలువరించడానికి మనం అందరం గట్టిగా ప్రయత్నించాలి.




# అందరికీ విద్య

**డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి**
-కాంగ్రెస్ శాసనసభా పక్ష నాయకులు

ఉపాధ్యాయులు సమాజాన్ని మార్చే దానికి బాగా ఆలోచన చేస్తారు. "అందరికీ విద్య" తప్పనిసరిగా అందరికీ అవసరం. మనిషికి పశువుకి తేడా చదువువల్లే వస్తుంది. రాష్ట్రంలో ప్రచార ఆర్భాటాలు ఎక్కువగా ఉన్నాయి. చదువుల పండుగంటారు, చదువుల సంక్రాంతి అంటారు, చదువుకుందాం రా అంటారు. ఇది ఆర్భాటాలకే పరిమితం. ఇప్పటికీ దక్షిణ భారత దేశంలో మనం ఈ విషయంలో వెనుకబడి ఉన్నాం. విద్యా కమిటీలు, స్కూలు కమిటీలు, మరో కమిటీ వేసి విద్యను నిర్వీర్యం చేసేకంటే అవసరమైన మేరకు ఉపాధ్యాయుల పోస్టులను నింపి, మేలైన పద్ధతులలో పాఠశాలలను నిర్వహించాలి. యుటియఫ్ మంచి సంఘం. ఇందులోని వారు అంకిత భావంతో పనిచేస్తున్నారు. శాసన మండలి రద్దయిన తరువాత ఉపాధ్యాయుల పోరాటానికి ఎంతో కొంత నష్టం వచ్చింది. ఉపాధ్యాయులకు సంఘం ఎందుకు? వారి స్వంత ప్రయోజనాలకే కాదు. వారి బాధ్యతలను గుర్తుచేయడానికి, మార్గదర్శకత్వం వహించడానికి కూడా. ఉపాధ్యాయుల బాధ్యత పిల్లలకు పాఠాలు చెప్పడమే కాదు. చిన్న పిల్లలలో భావాలు రూపు దిద్దుకునే వయస్సులో వారిలో సరియైన బీజాలు వేయాలంటే ఉపాధ్యాయులకు మంచి వేతనాలు ఉండాలి. వారు పూర్తిగా బోధనకే అంకితమయి ఉండే పరిస్థితులు కల్పించాలి. ఈ రోజు వారికున్న పెద్ద సమస్య Under Payment. వారి జీతంతో జీవనం గడువని పరిస్థితి ఉండరాదు. ఉపాధ్యాయులంటే నాకెక్కువ అభిమానం. నేను చిన్నప్పుడు ఎక్కువ కాలం వారి వద్దే గడిపాను.

ప్రైవేటీకరణ వల్ల అనేక రకాల యిబ్బందులు కలుగుతున్నాయి. ఈ సరళీకరణ ఆర్థిక విధానాల వల్ల పేదలకు మేలు జరిగితే అభ్యంతరం లేదు. కాని వీటి వల్ల విద్యకూడ ధనవంతులకే లభ్యమయ్యే, పేదవాడికి విద్య లేకుండా పోయే పరిస్థితిని మనం ఎదిరించాలి.

-(తరువాయి 20వ పేజి)

**బి.వి. రాఘవులు**
-కార్యదర్శి సి.పి.ఐ.(యం) రాష్ట్రకమిటీ

ఈ రోజు పిల్లలు తోటల్లో, హోటళ్లలో, షాపుల్లో పని చేస్తున్నారు. వారి ఆదాయమే కుటుంబ పోషణకు మార్గమయింది. ఈ పరిస్థితి పోవాలంటే కూలీలకు కూడ కనీస వేతనాలివ్వాలి. పేదల ఆదాయం పెంచాలి. యిది చెయ్యకుండా ఆర్భాటాలు చేసినంత మాత్రన లాభం లేదు. ప్రాథమిక విద్యను ప్రజలకు ఒప్పగిస్తున్నారు. ఉన్నత విద్యను ప్రైవేటు వారికి ఒప్ప చెబుతున్నారు. ప్రభుత్వం మాత్రం చేతులు దులుపుకుంటున్నది. కాలేజీలను,యూనివర్సిటీలను 'స్వయం పోషక' కోర్సులతో నింపారు. వారు చెప్పేదేమిటంటే ఉన్నత విద్యను ప్రైవేటు వారు నిర్వహిస్తే తన శక్తినంతా ప్రాథమిక విద్యపై ఉపయోగిస్తామని ప్రభుత్వం చెబుతున్నది. నిజానికి ప్రభుత్వం ప్రాథమిక విద్యారంగంలో ఏమి చేస్తున్నది? విద్యా కమిటీలను పెట్టి ఆ పాఠశాలలను వాటికి ఒప్ప చెబుతున్నారు. మీకు కావలసినవన్నీ మీరే చూసుకోమ్మంటున్నారు. అన్నీ మేము చేసుకొంటే యిక మీరు చేసేదేమిటని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను.

గత 55 సంవత్సరాలలో ధనవంతులు, మధ్య తరగతి వారు తమ పిల్లలను చదివించుకున్నారు. ఇప్పుడు పేదలు ఈ పాఠశాలలలో చదివే పరిస్థితి వచ్చింది. కనుక యిప్పుడు తన బాధ్యత నుండి ఉపసంహరించుకొంటూ సామాజిక న్యాయం లేకుండా చేస్తున్నది. ఇప్పుడే ప్రభుత్వ అవసరం ఎక్కువగా ఉంది. ప్రాథమిక పాఠశాలలలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులే ఉండాలి. కాని ప్రభుత్వం ఈనాడు అనేక పేర్లతో శిక్షణ లేనివారిని కూడ నియమిస్తున్నది. ప్రాథమిక విద్యకు నిధుల కొరత లేదంటున్నారు. అదే నిజమైతే ఖాళీలు ఎందుకు భర్తీ చేయడం లేదు? ఉపాధ్యాయులకు పూర్తి జీతాలు ఎందుకు ఇవ్వడం లేదు? వాస్తవమేమిటంటే బడ్జెట్ లోటు తగ్గించే పేరుతో విద్యా పద్దులలో కోత పెట్టి విద్యావాలంటీర్ల వంటివారిని నియమిస్తున్నారు.

ముఖ్యమంత్రిగారు చెబుతుంటారు: "శాసన సభ్యులకు జీతాలు చాలక సరిగా పనిచేయడం లేదు-అని". అదే నిజమైతే ఉపాధ్యాయులకు కూడ చాలినంత జీతాలు ఇస్తే కదా బాగా పని చేయడానికి. -(తరువాయి 20వ పేజి)

**సురవరం సుధాకర రెడ్డి**
-కార్యదర్శి సి.పి.ఐ. రాష్ట్ర సమితి

నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యను 50 సంవత్సరాల తర్వాత కూడ సాధించ లేకపోయాం. Functional literacy కి Education కు తేడా ఉంది. సంతకం చేయడం వచ్చిన అక్షరాస్యులు 64%. వీరందరిని విద్యావంతులని ప్రకటిస్తున్నారు. అటువంటి విద్యకాకుండా అందరికీ సరియైన విద్యను అందించాలి. విద్యా బడ్జెట్ పెంచకుండా తగ్గిస్తున్నారు. ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదు. పాఠశాలలు పెరిగాయి. ఉపాధ్యాయులు పెరిగారు. అయినా "అందరికీ విద్య" పేదవర్గాలకు ఆకాశ పుష్పమే. దళితులు, గిరిజనులు బాగా బాధితులు. బాలురకంటే బాలికలు ఎక్కువ నష్టపోతున్నారు. ఇప్పటి ధోరణి చూస్తే 2050 నాటికి కూడ అందరికీ విద్య అనే లక్ష్యం నెరవేరేటట్లు లేదు. డ్రాపవుట్ సమస్య వచ్చింది. ఉపాధ్యాయుకు బోధనేతర పనులు పెరిగిపోయాయి. ఉపాధ్యాయులు సరిగా పనిచేయడం లేదని, గ్రామాలలో వారు వ్యాపారం, వ్యవసాయం చేస్తున్నారని అందుచేత వారికి యిప్పటి జీతాలు చాలవా? యింకా యివ్వాలా? - అని కొందరు వాదిస్తున్నారు. వ్యాపారం, వ్యవసాయం చేసుకునే వారు ఎక్కడో ఒకరు ఉండవచ్చు. అందరినీ ఒకే గాట కట్టడం సరియైనది కాదు.

విద్యార్థులు క్వాలిటీ విద్య కోరుతున్న ఈ రోజులలో మన విద్యార్థులు పోటీ పరీక్షలలో నెగ్గుతున్నారంటే అది ఉపాధ్యాయుల కృషే గాని, విద్యార్థులు స్వంతంగా నేర్చుకున్నది కాదు. ఈ రోజున కూడ EMCET లో గ్రామీణ విద్యార్థులే మొదటి ర్యాంకులో వస్తున్నారు. అందుచేత మన గ్రామీణ ఉపాధ్యాయుల కృషి అభినందనీయం. వారికి బోధనేతర పనులు లేకపోతే ఇంకా బాగా పనిచేస్తారు. ప్రపంచీకరణలో విద్య బలి అవుతున్నది. హైస్కూలు విద్య తరువాత ప్రభుత్వం బాధ్యత నాదికాదంటున్నది. విద్య వ్యాపార మయమయింది. 270 ఇంజనీరింగ్, 80 బి.ఇడి., 20 మెడికల్ కాలేజీలు, వందల సంఖ్యలో అన్ ఎయిడెడ్, సెల్ఫ్‌ఫైనాన్స్ కాలేజీలు వచ్చాయి. విద్యాలయాలు పెరిగినట్లు కనిపిస్తున్నది. కాని విద్య 100 రెట్లు ఖరీదైపోయింది.

-(తరువాయి 20వ పేజి)

# ప్రొఫెసర్ జంధ్యాల బాలగంగాధర్ తిలక్

National Institute of Educational Planning & Administaration (NIEPA)
New Delhi

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 9వ మహాసభలలో పాల్గొనడం సంతోషంగా ఉంది. ఈ సభలలో మీరు చర్చిస్తున్న అంశం "అందరికీ విద్య" కొత్తది కాదు. 1950లో రాజ్యాంగ రచన సందర్భంగా ఆర్టికల్ 45లో "The State shall endeavor to provide....... for free and compulsory Education for all Children until they complete the age of 14 years" అని స్పష్టంగా పేర్కొనడమేగాక ఈ లక్ష్యాన్ని 1960లోపు సాధించాలని కూడా పేర్కొన్నారు. తరువాత వచ్చిన పంచవర్ష ప్రణాళికలలోను, జాతీయ విధానాలలోను దీనిని గూర్చిన స్పష్టీకరణ జరిగింది.



సార్వత్రిక విద్య అంటే ఐదు సంవత్సరముల విద్య కాకుండా ప్రాథమిక విద్య ఐదు సంవత్సరాలని, ప్రాథమికోన్నత విద్య మూడు సంవత్సరాలని మొత్తం ప్రాథమిక విద్యను 8 సం॥రాలుగా చెప్పబడింది. జాతీయ విద్యా విధానంలో 6-14 సం॥రాల వయస్సుగల బాలబాలికలను పాఠశాలకు రప్పించి 8 సం॥ల చదివేలా చూడాలని, వారికి కనీస విద్య వచ్చేలా చెయ్యాలని పేర్కొన బడింది.

20 సం॥రముల నుండి ఈ విషయమై తీర్మానాలు చేస్తూనే ఉన్నారు. ప్రపంచంలో వెనుబడిన ఆఫ్రికా దేశాలలాగా మన దేశ పరిస్థితులను గూర్చి మాట్లాడుతున్నారు. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు తగిన చర్యలను తీసుకోవాలని ప్రభుత్వాన్ని ఆదేశించలేక పోయాయి. 50 యేళ్ళ తర్వాత రాజ్యాంగ సవరణ జరిగింది. 86వ రాజ్యాంగ సవరణ ప్రకారం విద్యను ప్రాథమిక హక్కుగా చేశారు. దానిని బట్టి నామ మాత్రంగా విద్యనందించి విద్యా లక్ష్యం నెరవేరిందని చెప్పాలని చూస్తున్నారు. 1990లో 150 దేశాలు జామ్‌టియెన్ (JOMTIEN) పట్టణంలో సమావేశమై 10 సం॥రాలలో అందరికీ విద్య లక్ష్యాన్ని సాధించాలని తీర్మానించారు. మరలా 2000 సం॥రాలలో డాకార్ (DAKAR) లో సమావేశం జరిపి ఈ లక్ష్య సాధన గడువును 2015కు పెంచారు. అంతర్జాతీయ వాతావరణంలో మార్పు వచ్చింది. IMF, WORLD BANK మరికొన్ని సంస్థలు బయలుదేరి ఈ లక్ష్య సాధనకు రంగంలో దిగాయి.

1990 వరకు భారత దేశంలో విద్యాభివృద్ధికి విదేశీ సహాయాన్ని తీసుకోలేదు. కానీ ఈనాడు 20 నుండి 30 సంస్థలు ఈ ప్రాజెక్టులలో పాల్గొంటున్నాయి. 1950లో రాజ్యాంగాన్ని అనుసరించి 4వ పంచవర్ష ప్రణాళికలో ఈ లక్ష్యం ఫార్మల్ విద్యగానే ఉంటుందన్నారు. ప్రస్తుతం దానిని నాన్‌ఫార్మల్ విద్యగా మార్చారు. ఇది ముఖ్యమైన మార్పు. 1950లోను, 1986 విద్యా విధానంలోను ప్రాథమిక విద్యా బాధ్యత ప్రభుత్వానిది. కానీ ప్రస్తుతం ఈ బాధ్యతను ప్రైవేటు సెక్టారుకు అప్పగించి, నాన్ గవర్నమెంట్ ఏజెన్సీల ద్వారాను, విలేజ్ ఎడ్యుకేషన్ కమిటీల ద్వారాను, తల్లిదండ్రుల కమిటీల సహాయంతోను చేస్తామని చెబుతున్నారు. ప్రభుత్వ బాధ్యత నామ మాత్రం చేయబడింది. ప్రాథమిక విద్య 8 సం॥రాల నుండి 5 సం॥రాలకు మార్చబడింది. ఈ సందర్భంగా మూడు ముఖ్యమైన విషయాలున్నాయి.

ఒకటి ప్రాథమిక విద్య, రెండు వయోజన అక్షరాస్యత, మూడు యువకులకు వృత్తి విద్యా నైపుణ్యం కలిగించడం. దీనిలో ముఖ్యమైనది ప్రాథమిక విద్య. దీని ద్వారా విద్యార్థులకు అక్షరాస్యత కాకుండా అదనపు విజ్ఞానం కూడా నేర్పాలి. అది సమాజానికి లాభకర మవుతుంది. నాగరిక దేశాలుగాని, అంతర్జాతీయ సమాజంగాని చెప్పింది ఏమిటంటే ప్రాథమిక విద్య సమాజానికి కీలకమైంది. 1948 లోనే ఐక్య రాజ్య సమితి దీని ప్రాధాన్యత గుర్తించి నిర్బంధ, ఉచిత విద్యను ప్రవేశ పెట్టాలని చెప్పింది. ఇది సమాజ అభివృద్ధికి పెద్దపెట్టుబడి. దీని వల్ల ఎన్నో లాభాలున్నాయి. అందుచే దీని కొరకు కనీస వసతులు కల్పించాలి. ప్రభుత్వం ఈ బాధ్యత నుండి తప్పించుకోరాదు. కేవలం ఇది ఆర్థికాభివృద్ధికి పనిముట్టే కాకుండా సమాజాభివృద్ధికి తప్పని సరి అని నోబుల్ అవార్డు గ్రహీత అమర్త్యసేన్ చెప్పారు.

"విద్య అంటేనే అభివృద్ధి. విద్య కేవలం ఉద్యోగానికి కాదు. అది ప్రజల మౌలిక హక్కు" అని ఆయన అన్నారు. స్వాతంత్ర్యం వచ్చిన 50 యేళ్ళ తర్వాత 2001 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 30 కోట్ల మంది నిరక్షరాస్యులు ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత 61%. ఆర్థికంగా వెనుకబడిన బీహారు మనకంటే మెరుగుగా ఉంది. ఈ రాష్ట్రంలో డ్రాపౌట్‌రేటు 40%. ఐదవ తరగతిలో 50%. ఎనిమిదవ తరగతిలో 43%. ప్రపంచం మొత్తం మీద యునెస్కో లెక్కల ప్రకారం అట్టడుగు 48 దేశాలతో సమానంగా కూడా మనం విద్యాభివృద్ధిని సాధించలేదు. ఉచిత విద్య అంటే ఏమిటి? ఇప్పటిదాకా కేవలం ట్యూషన్ ఫీజు లేకుండా చెప్పడాన్నే ఉచిత విద్య అంటున్నారు. కానీ పాఠశాలల్లో ట్యూషన్ ఫీజు కాకుండా 27 రకాలు ఫీజులున్నాయి. విద్యార్థుల పాఠ్య పుస్తకాల మీద, యూనిఫారం మీద చాల డబ్బు ఖర్చు అవుతుంది. విద్య మీద పేదలు కూడా సంవత్సరానికి దాదాపు రు. 2000 ఖర్చుపెడుతున్నారు. అందువల్ల ఉచిత విద్య అనేది బోగస్ అయింది. 40సం॥గా ఒక తప్పుడు భావన ఉంది. "పేదవారు విద్యకు విలువ యివ్వరు. అందుచే వీరికి నాన్‌ఫార్మల్/ చౌక విద్య చాలు" అని. నాన్‌ఫార్మల్‌లో క్వాలిటీ ఉండదు. క్రొత్తగా 'విద్యా గ్యారంటీ' స్కూళ్లు పెట్టారు. అందులో టీచర్లకు రు.500/- ఇస్తారు. యివి మొదట మధ్య ప్రదేశ్‌లో ప్రవేశ పెట్టారు. ఇప్పుడు దేశమంతా వ్యాపించాయి. గతంలోని ఫార్మల్, నాన్‌ఫార్మల్‌లకు తోడుగా నేడు కరెస్పాండెన్సు కోర్స్‌లను కూడ చేర్చారు. గత విద్యాబిల్లును చర్చించకుండానే పాస్ చేశారు. ఈసారి కూడ అదే జరుగవచ్చు. 'ఉపాధ్యాయులకు విద్యార్హతలతో పనిలేదు'- అనే ధోరణి వల్ల క్రొత్తరకం టీచర్లు వస్తారు. పారా టీచర్లు, శిక్షా కర్మి, వాలంటరీ టీచర్లు, విద్యావాలంటీర్లు, పార్టుటైం టీచర్లు, తాత్కాలిక ఉపాధ్యాయులు, బోధించుటకు పనికిరాని టీచర్లు కూడ వస్తారు. ఉపాధ్యాయుల విద్యార్థి నిష్పత్తి కూడ పెరుగుతుంది.

| ఇండియా | | | |
|---|---|---|---|
| | ప్రాథమిక విద్య | యు.పి. | ఉన్నత పాఠశాలలు |
| 1950-51 | 24 | 20 | 21 |
| 2001-02 | 43 | 34 | 34 |
| ఆంధ్రలో | 41 | 39 | 34 |

ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని పెంచి ఖర్చు తగ్గించాలని చూస్తున్నారు. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని పెంచితే చదువుకొనేవారు తగ్గిపోతారు.

| దేశం | ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి | ప్రాథమిక విద్యను పూర్తి చేసిన వారి శాతం |
|---|---|---|
| ఛాద్ | 1:71 | 19 |
| మధ్య ఆఫ్రికా | 1:74 | 19 |
| మాలి | 1:63 | 23 |
| హంగరి | 1:11 | 102 |
| పోలండు | 1:12 | 96 |

ప్రస్తుతం వికేంద్రీకరణమంత్రమయింది.

దీని వలన కొన్ని లాభాలుండవచ్చు. కాని ప్రధానంగా ప్రభుత్వం తన బాధ్యతల నుండి తప్పించుకోవడానికి, రకరకాలుగా ప్రజల నుండి డబ్బులు పిండడానికి, ప్రాంతీయ అసమానతలు పెంచడానికి ఇది తోడ్పడుతుంది.

దీని ప్రకారం ప్రతి దశలో విద్యా సెస్సును విధించి వసూలు చేస్తారు. రాష్ట్రాలు, జిల్లాలు, మండలాలు, గ్రామాలు వసూలు చేస్తాయి. అంతేకాకుండా విదేశీ సహాయం మీద ఆధారపడడం పెరిగింది. దాతల మీద ఆధారపడడం ఎక్కువవుతుంది. జాతీయ ప్రాధాన్యతలు మారిపోతాయి. 1993-94లో విదేశీ సహాయం 37 కోట్లయితే 2001-02లో 1210 కోట్లయింది. కేంద్రం పెట్టే ఖర్చులు 1.7% మాత్రమే.

దీనితో విదేశాల వారి విధానాలు మన మీద రుద్దబడతాయి. పేదరిక నిర్మూలనలో ఉన్నత విద్యకు ప్రాధాన్యత లేదని కేవలం ప్రాథమిక విద్యమీదనే కేంద్రీకరించి, సెకండరీ, ఉన్నత విద్యలను నిర్లక్ష్యం చేస్తారు.

విద్యకొరకు విదేశాలనుండి వచ్చే మొత్తం చాలకొద్ది. కారణం ఆ దేశాలలో కూడా విద్యకు కేటాయింపులు తగ్గిపోతున్నాయి. ప్రపంచబ్యాంకు అందరికీ విద్యకొరకు కేటాయింపులను 1999-2000 సంవత్సరంలో 2:3 బిలియను డాలర్ల నుండి 2 బిలియన్లకు తగ్గించింది.

అప్పు యిచ్చేవారు ప్రధానంగా విద్యారంగం నుండి ప్రభుత్వ బాధ్యతను తగ్గించి, ప్రైవేటు రంగ బాధ్యతను పెంచాలని చెబుతారు. అయితే ప్రైవేటు రంగంలో ఉచిత విద్య ఉండదు. సామాజికంగా ఆర్థికంగా వెనుకబడిన వారికి తోడ్పడడం ఉండదు. అందుచేత విద్యాభివృద్ధి జరుగాలంటే దీర్ఘకాల విధానం ఉండాలి. ప్రభుత్వం ఉదారంగా ఖర్చుచెయ్యాలి. ప్రైవేటు సెక్టరు మీద ఆధారపడరాదు. విదేశీ సహాయంపై నామ మాత్రంగానే ఆధారపడాలి. విద్యపై కేంద్ర ప్రభుత్వం ఆదాయంలో 6% ఖర్చు చేయాలి. కాని నేడు 4% మాత్రమే ఖర్చుచేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కేవలం 3.2% మాత్రమే ఖర్చు చేస్తున్నారు. 'అందరికీ విద్య' పథకం జయప్రదం కావాలంటే కనీసం ప్రాథమిక విద్య(8 సం॥)ను ఉచితంగా కల్పించాలి. కుటుంబం పై భారాన్ని తగ్గించాలి. ఉచితంగా దుస్తులు, పాఠ్యపుస్తకాలు సరఫరాచేయాలి. ప్రతి గ్రామంలో అన్ని వసతులతో కూడిన పాఠశాలలను నెలకొల్పాలి. కమ్యూనిటీ బాధ్యత అంటే వారిపై ఆర్థికంగా ఆధారపడడంకాదు. వారి పర్యవేక్షణ మాత్రమే ఉండాలి. థాపర్ కమిటీ సిఫారసుల ప్రకారం 10 సం॥లలో విద్యకు 137 వేలకోట్లు కేటాయించాలి. ప్రతి సం॥ 10 వేల కోట్లు కేటాయించాలి. స్థూల జాతీయ ఉత్పత్తి (గ్రాస్ డొమెస్టిక్ ప్రొడక్షన్ జి.డి.పి.) లో అదనంగా 0.7% కేటాయించాలి.

### → డా॥ మన్మోహన్ సింగ్

తరగతి గదిలో కేవలం ఉపాధ్యాయులు బోధించడం విద్యార్థులు వినడమే గాక విద్యార్థులు బోధనా ప్రక్రియలో ఎక్కువగా పాల్గొనేలా చూడాలి. ఉపాధ్యాయులు కేవలం పాఠ్యపుస్తకాలకే పరిమితం కాకుండా స్థానిక పరిస్థితుల కనుగుణంగా బోధనాంశాలను మార్చుకోవాలి. ప్రాథమిక పాఠశాలలలో బోధనా భాష పెద్ద సమస్యగా ఉంది. ఉపాధ్యాయులు, పిల్లలు యింటి వద్ద మాట్లాడే భాషలో స్వేచ్ఛగా మాట్లాడడాన్ని ప్రోత్సహించాలి. తలిదండ్రులతో నిత్య సంబంధాలు పెంచుకొని తల్లిదండ్రులను ప్రోత్సహించాలి. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో పేదలు సామాజికంగా కూడ వెనుక బడి ఉంటారు. వారికి విద్యా ప్రాధాన్యత గురించి పూర్తిగా అవగాహన ఉండదు. మీరు వారిలో చైతన్యం కలిగించాలి. మీరందరు హృదయ పూర్వకంగా కృషి చేసి 2005 నాటికి 'అందరికీ విద్య' లక్ష్యాన్ని సాధించడానికి తోడ్పడుతారని ఆశిస్తున్నాను. ◆

### → డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి

మన రాష్ట్రంలో ఇంజనీరింగు కాలేజీలు 212కు పెరిగాయి. వీటిలోని విద్యార్థులు అందరు అమెరికా పోలేరు. ఒకరో, ఇద్దరో పోతున్నారు. మిగతా వారు నెలకు కనీసం 5 వేలు కూడ సంపాదించుకోలేక తమ కుటుంబాన్ని పోషించగలుగుతారా? ప్రైవేట్ కాలేజీలు సామాజిక బాధ్యతను నిర్వహించడం లేదు. రిజర్వేషన్లను అమలు జరుపుట లేదు.

నైతిక విలువలు పెంపొందించేలా బోధించాలి. చరిత్రతో పనిలేదని ప్రభుత్వం అంటున్నది. చరిత్రతో అవసరము లేదా? ఉంది. మన దేశ చరిత్రను, వివిధ జాతుల చరిత్రను మనం తెలిసికొని తీరాలి. పరమత సహనం గురించి చిన్న తనం నుండే పిల్లలకు చెప్పాలి. కులాలు, మతాలు వ్యక్తిగత విషయాలు. వీటి ఆధారంగా ఉద్రిక్తతలు రెచ్చగొట్టగూడదు. ◆

### → బి.వి. రాఘవులు

అలాగే తన ప్రభుత్వానికి మంచి మెజారిటీ వస్తే, భద్రతా భావంతో బాగా పనిచేస్తామంటున్నారు. ఉద్యోగులు మాత్రం అభద్రతా భావంలోనే బాగా పనిచేస్తారట. ఇద్దరికీ చేరొక నీతి ఎలా కుదురుతుంది?

పాఠశాలలలో కంప్యూటర్ విద్య నేర్పుతానంటున్నారు. మంచిదే. కాని ఉచితంగా దొరికే LIMEY సాఫ్ట్‌వేర్‌కాకుండా "మైక్రోసాఫ్ట్" ఎందుకు వాడుతున్నారు? బాబు గారి తపనంతా బిల్‌గేట్స్‌కు వ్యాపారం చేసి పెట్టడం తప్ప మన పిల్లలకు కంప్యూటర్ విద్య నేర్పడం కాదు. యిప్పుడు డ్వాక్రా మహిళలందరికీ సెల్‌ఫోన్లు యిస్తారట. దేనికి? ఎలక్షన్లలో వాడుకోడానికి తప్ప వీటి అవసరమేమిటి?

యాంత్రీకరణ ఎక్కువ చేస్తున్నారు. మనుషులకు పనిలేకుండా చేసి అన్ని పనులు యంత్రాలతో చేయిస్తున్నారు. అందువల్లనే పేదలకు పనిరోజులు తగ్గాయి. నీటి ప్రాజెక్టులు కట్టకుండా, ఇంకుడు గుంటలతో సరిపెట్ట మంటున్నారు. టూరిజం అభివృద్ధి చేయాలట. ఎవరి కొరకు? డబ్బున్న వారి కొరకే తప్ప పేదవారి కొరకుకాదు. పెట్టుబడి దారులు మన వ్యవసాయాన్ని నాశనం చేస్తున్నారు. మనం ధాన్యం పండించవద్దట. తక్కువ నీటితో పూలు, పండ్లు, రొయ్యలు పెంచి, ఎగుమతి చేస్తే వాళ్లు మనకు ఆహారధాన్యాలు ఇస్తామంటున్నారు. మన పంటలు, మన వ్యవసాయం, మన అలవాట్లు, అన్ని మార్చేస్తున్నారు. ఈ ప్రమాదం గుర్తించి ఉపాధ్యాయులు వచ్చే ఎన్నికలలో ఈ ప్రభుత్వానికి తగు బుద్ధిచెప్పాలి. ◆

### → సురవరం సుధాకర రెడ్డి

బి.ఇడి. సీటుకు లక్షరూపాయలు చెల్లించ వలసి వస్తున్నది. పేదవారు కాలేజీల మెట్లు ఎక్కలేకపోతున్నారు.

హైదరాబాదులో గతంలో 900 పాఠశాలలు ఉండేవి. 2003లో 300 వరకు తగ్గాయి. ప్రైవేటు పాఠశాలలు పెరిగాయి. నేను బి.ఎ.కు చెల్లించిన ఫీజుకంటే అనేక రెట్లు ఎక్కువ ఫీజును ఈ రోజు 1వ తరగతి చదివే నా కుమారునికి చెల్లించవలసి వస్తున్నది. ఎల్.కే.జి.లో అడ్మిషన్‌కు 5 వేల నుండి 10వేల రూపాయల వరకు చెల్లిస్తున్నారు. ఒక భవనంలో 2,3 పాఠశాలలు నడుపుతూ విద్యా వాలంటీర్ల పేరుతో ఉపాధ్యాయులను నియమించి, దిన కూలీల కంటే తక్కువ జీతాలు యిస్తున్న ప్రభుత్వ విధానాన్ని అందరం ఖండించాలి. అందరికీ విద్య మన హక్కు, బాధ్యత కూడా. దానిని సాధించేందుకు అందరం నడుం కట్టాలి. ఈ కృషిలో మీ వెంట మేము ఉంటాము.




# విద్యా బోధన - భాష, సంస్కృతి

**డా॥ సి.నారాయణ రెడ్డి,**
రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు,

ఉపాధ్యాయునికున్న గొప్ప అదృష్టమేమిటంటే ఒకటి రెండు సంవత్సరాలు పాఠం చెబితేచాలు. ఆయా విద్యార్థుల పై జీవితమంతా ఆ ముద్ర వుంటుంది. విశ్వవిజేత అలెగ్జాండర్‌ను తీర్చిదిద్దిన గౌరవం అరిస్టాటిల్‌కు దక్కింది. 1954 నుండి అధ్యాపకుడిగా పని చేసిన నేను 1981లో అంజయ్య గారు ముఖ్య మంత్రిగా వుండగా అధికారభాషాసంఘం అధ్యక్షుడిగా బాధ్యతలు స్వీకరించవలసి వచ్చినపుడు " ఇక పాఠాలు చెప్పే భాగ్యం ఉండదే " అని బాధపడ్డాను. అలాంటి విశిష్టమైనది ఉపాధ్యాయ వృత్తి.

గాంధీజీ తన డైరీలో వ్రాసుకున్న సూక్తిని 'గాంధీయం' అనే పేరుతో అనువదించాను. "మాతృ భాషా తృణీకారం - మాతృదేవీ తిరస్కారం" అన్నారాయన. ప్రపంచంలోని అగ్రదేశాలన్నీ తమతమ మాతృభాషలలోనే అన్ని రకాల వ్యవహారాలను నడుపుతాయి. డబ్ల్యు. బి. ఈట్స్ అనే ఐరిష్ రచయిత ఠాగోర్ 'గీతాంజలి' కి ముందుమాట రాశాడు. అందులో ఆయన "Every Civilised Nation Speaks in its Own mother tongue" (ప్రతి నాగరిక జాతి తన మాతృ భాషలోనే మాట్లాడుతుంది) అన్నాడు. శాతవాహనుల కాలం నుంచి జాజ్వల్యమానంగా వెలుగుతున్న మన తెలుగు జాతి 'అనాగరిక జాతి' అనిపించుకోవడం భావ్యమా? - ఆలోచించండి.

సంస్కృతిలో అన్ని కళలు, జీవితానికి సంబంధించిన అన్ని వ్యవహారాలూ ఉన్నాయి. ప్రఖ్యాత తత్వవేత్త, భారత మాజీ రాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు "Our culture is what we are and civilisation is what we have" (మనమున్నది సంస్కృతి - మనకున్నది నాగరికత) - అన్నారు. తల్లిదండ్రులు ఇచ్చేది శారీరక జన్మ - గురువు ఇచ్చేది జ్ఞాన జన్మ. ఉపన్యాసకులు అందరూ ఉపాధ్యాయులు, అధ్యాపకులు కాలేరు. ప్రతి ప్రభుత్వం ఉపాధ్యాయులను గౌరవించాలి. గౌరవించక పోతే ఉద్యమించాలి. తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం కూడా ఉద్యమించాలి. ఉద్యమశీలురైన మీరు పురోగమించాలి. భవిష్యత్ తరాలను నిర్మించాలి.

***

అంత కడిపెడు పాలపై - ఒక్కింత మీగడ తేరినట్లుగ
మనకు మిగులును గతము లోపలి - మంచి, అదియే సంప్రదాయము
- డా॥ సి.నారాయణ రెడ్డి

**డా॥ పరుచూరి గోపాలకృష్ణ**
అధికార భాషా సంఘం అధ్యక్షులు

మిమ్మల్ని చూస్తుంటే ఒళ్లు పులకరిస్తున్నది. నేను 11 సంవత్సరాలు మీలాగే ఉపాధ్యాయుడిగా పని చేశాను. ఆ తీపి జ్ఞాపకాలను మర్చిపోలేను. మీ ఒంగోలు మహాసభలలో కూడా చెప్పాను - ప్రపంచంలో అత్యుత్తమ వ్యక్తులు ఉపాధ్యాయుడు, తాపీ మేస్త్రీ. వాళ్ళు తమ చేతుల్లో రూపుదిద్దుకున్న, ఎదిగిన భవనాలను, వ్యక్తులను చూసి ఆనందిస్తారు; గర్విస్తారు. - బాధపడరు - అని. ఉపాధ్యాయులు ఏదైనా చేయగల శక్తిమంతులు. వేలకొలది మంది విద్యార్థులను డాక్టర్లుగా, యాక్టర్లుగా, శాస్త్రవేత్తలుగా, ఉత్తమ పౌరులుగా తయారు చేసిన ఆనందం మరి ఏవిధంగానూ లభించదు.

తెలుగు వాళ్ళు మన రాష్ట్రంలోనే కాదు. అనేక ఇరుగు పొరుగు రాష్ట్రాల్లో కూడా లక్షల సంఖ్యలో వున్నారు. మన దేశం మొత్తం మీద 15 కోట్ల మంది తెలుగు వాళ్ళం ఉన్నాము. మన భాషా సంస్కృతులను మనమే కాపాడుకోవాలి. పసిపిల్లలకు తల్లిపాలు ఎంత ముఖ్యమో మానవ వికాసానికి మాతృభాష అంత ముఖ్యం. ముచ్చటగా మూడు నిముషాలు కూడా ఇతర భాషా పదాలు లేకుండా మన మాతృ భాషలో మాట్లాడలేని దుస్థితి నుంచి మనం బయట పడాలి. రాబోయే తరాలవాళ్లు "మా పూర్వీకులు తెలుగులో మాట్లాడేవారట" - అని చెప్పే పరిస్థితి రాకూడదు.

భాష పైననే సంస్కృతి ఆధారపడి ఉంది. తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు, విస్తరణకు మా ప్రయత్నాలను మేం చేస్తున్నాం. కాని ఉపాధ్యాయులే ఈ విషయంలో 'గురు' తరమైన పాత్రను పోషించాలి.

***

సహనమే సంస్కృతి
- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు

***

ఏదేశసంస్కృతి అయినా కాదొక స్థిర బిందువు -
అది నైక నదీ నదాలు కలిసిన అంత స్సింధువు.
- దేవరకొండ బాలగంగాధర తిలక్

## విరాళాలు ఇచ్చిన వారు



**డి. సత్యవతి.**, Rtd., Tr. తూ॥గోదావరి    **ఏ.పి. రామారావు.**, Rtd.Tr.ప్రకాశం జిల్లా    **మర్రాపు గురుమూర్తి దంపతుల** జ్ఞాపకార్థం
కుమారుడు: మహేశ్ (విజయనగరం)






## డా॥ యం.కె. పాంధే

**సి.ఐ.టి.యు. అధ్యక్షులు**

గ్లోబలైజేషన్ ప్రభావం న్యాయవ్యవస్థ మీద కూడ పడింది. గతంలో అన్యాయం జరిగితే హైకోర్టు, సుప్రీంకోర్టుకు వెళ్ళితే కొంతైనా న్యాయం జరుగుతుందనే నమ్మకముండేది. నేడు ఆ ఉన్నత న్యాయస్థానాలలో కూడ అవినీతి, పక్షపాతం పెరిగిపోయింది. యిటీవల అవినీతి కేసుల్లో ఇరుక్కున్న న్యాయాధిపతుల కథలు పత్రికల్లో చదువుతున్నాం. తమిళనాడులో ప్రభుత్వం పాశవికంగా టెస్మా చట్టాన్ని అమలు జరుపుతూ, సమ్మెలో పాల్గొన్నారనే సాకుతో 2 లక్షల మందిని ఉద్యోగాల నుండి తొలగిస్తే తమిళనాడు హైకోర్టు ప్రభుత్వానికి అనుకూలంగా తీర్పు యిచ్చింది. సుప్రీంకోర్టుకు పోతే ఉద్యోగులకు సమ్మె హక్కే లేదని చెప్పింది.

సమ్మెహక్కు ఒకరిచ్చింది కాదు. ప్రపంచవ్యాపితంగా కార్మిక వర్గం పోరాడి సాధించుకున్న హక్కు. దానిని కోర్టులు హరించలేవు. ప్రభుత్వాలు రద్దు చేయలేవు.

గ్లోబలైజేషన్ ప్రభావం మనదేశంలో ఎక్కువగాఉంది. ప్రైవేటీకరణ పేరుతో పబ్లిక్ రంగ సంస్థలను, స్థలాలను చౌకగా అమ్ముతున్నారు. బొంబాయిలో విమానాశ్రయం దగ్గర, ఒక స్థలాన్ని ప్రభుత్వం 86 కోట్లకు అమ్మితే ఆ కొన్న వ్యక్తి 3 నెలల్లో 112 కోట్లకు అమ్మాడు. రోజురోజుకు ధనిక దేశాల వ్యాపారం పెరుగుతున్నది. 175 దేశాలలో మన దేశం అభివృద్ధిలో గత సంవత్సరం123వ స్థానంలో ఉంటే ఈ సంతవ్సరం 127వ స్థానానికి దిగజారింది. పాలకులు పేదరికానికి నిర్వచనాలు మార్చి దానిని తగ్గించామని చెబుతున్నారు. 1960 లో రు.100 వార్షిక ఆదాయం లేని పేదలున్నారు. నేడు దానిని రు.700లకు పెంచారు. గాంధీగారు అందరికీ ఉపాధి కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదన్నారు. కానినేడు ప్రభుత్వం ఉన్న ఉద్యోగాలను ఊడగొడుతున్నది, అడవులు నరికి వేస్తున్నారు. నదులను కలుషితం చేస్తున్నారు.

యన్.డి.ఏ. పాలనలో దేశ భవిష్యత్తు ప్రమాదంలో పడింది. పాఠ్యపుస్తకాలలో వక్రీకరణలు ఎక్కువైనాయి. మరొక ముఖ్య విషయం భావజాలంలో . మార్పు. బానిస మనస్తత్వం పెరిగింది. అమెరికాలోని సిలికాన్‌వ్యాలీ ఇండియా వారు అధికంగా ఉన్నారు. కాని వారు మన దేశానికి సేవ చేయరు. విదేశాలకు అమ్ముడు పోవడం ఎక్కువయింది. గతంలో పోలీసు బడ్జెట్ కంటే విద్యాబడ్జెటు ఎక్కువగా ఉండేది. నేడు అది తిరగబడింది. నేనొకసారికైరోకు వెళితే అక్కడ 450 అడుగుల ఎత్తున 2 టన్నుల రాళ్ళను ఎత్తి పిరమిడ్లు నిర్మించారు. దీనికి కావలసిన పరికరాలు ఇండియా నుండి వచ్చినవని చెప్పారు. అది మన ఘనకీర్తి. రోమ్ సామ్రాజ్యంలో ఇండియా వస్త్రాల మీద దిగుమతి పన్ను వెయ్యాలని మంత్రులు సలహాలిచ్చారు. ఆరోజుల్లో మన వస్త్రాలకు అంత గిరాకి ఉండేది. నేడు సైకిలు దగ్గర నుండి ప్రతి వస్తువు విదేశీది కొనడానికి యిష్టపడుతున్నాం. వాటిని గొప్పగా చెప్పుకుంటున్నాం. గ్లోబలైజేషన్ వల్ల అమెరికా వస్తువులు స్వేచ్ఛగా మన దేశంలోనికి దిగుమతి అవుతాయి. కాని మన కూలీలు స్వేచ్ఛగా అమెరికా వెళ్ళడానికి అవకాశం లేదు. మనం కోరేది సమానత్వంతో కూడిన ప్రపంచీకరణ నేగాని, అసమానతలు పెంచే ప్రపంచీకరణ కాదు. అమెరికా, ఇంగ్లాండు, కెనడా నేటికీ గాట్ ఒప్పందం మీద సంతకం చేయలేదు మనం మాత్రం ముందుగానే సంతకం చేసి యిబ్బందులు పడుతున్నాం. •

## యస్.టి.యఫ్.ఐ. నాయకుల సందేశాలు

ఈ మహాసభలకు పశ్చిమ బెంగాల్ నుండి యస్.టి.యఫ్.ఐ ప్రధానకార్యదర్శి తుషార్ పంచానన్ గారు, కేరళ రాష్ట్రం నుండి కార్యదర్శి పి. రాజగోపాలన్ గారు, తమిళనాడు నుండి 3 సంఘాలకు ప్రాతినిధ్యం వహిస్తూ శ్రీ రాజేంద్రన్, మాయావన్, పర్వత రాజ్ ఆంథోని స్వామి గారలు హాజరైనారు.




కేరళ స్కూల్ టీచర్స్ అసోసియేషన్ (కె.యస్.టి.ఏ) నాయకులు రాజగోపాలన్ కేరళ ఉపాధ్యాయుల పక్షాన శుభాకాంక్షలు తెలుపుతూ, తమిళ నాడు బాధిత ఉపాధ్యాయులకు యిప్పటికి 4 లక్షల సహాయం అందించామని, యింకా అందిస్తామని, ఫిబ్రవరి 24 సమ్మె లో 100 శాతం పాల్గొంటామని చెప్పారు. తమిళ నాడు ప్రతినిధి వర్గం పక్షాన రాజేంద్రన్ మాట్లాడుతూ 3 సంఘాల పక్షాన శుభాకాంక్షలు తెలిపారు. జయలలిత ప్రభుత్వం ఫాసిస్టు పరిపాలన చేస్తున్నదని, 2 లక్షల మందిని డిస్మిస్ చేసిందని, కోర్టు తీర్పు అనంతరం దాదాపు 1000 మంది శాశ్వతంగా ఉద్యోగాలు కోల్పోయారని, వారిలో దాదాపు 200 మంది ఉపాధ్యాయులున్నందున వారందరికి తాము నెలకు రు. 6000 అలవెన్సు ప్రతి నెల చెల్లిస్తున్నామని దీని కొరకు తమిళనాడు ఉపాధ్యాయులు లక్షలాది రూపాయలు విరాళాలి స్తున్నారని చెప్పారు. యస్.టి.యఫ్.ఐ. యిప్పటికి దాదాపు 6 లక్షల రూపాయలు అందచేసినందులకు కృతజ్ఞతలు తెలిపారు. మరింత ఉదారంగా సహాయ పడాలని ఆయన అందరికీ విజ్ఞప్తి చేశారు.

యస్.టి.యఫ్.ఐ. ప్రధానకార్యదర్శి తుషార్ పంచానన్ మాట్లాడుతూ 7 లక్షల మంది యస్.టి.యఫ్.ఐ. సభ్యుల తరపున శుభాకాంక్షలు తెలిపారు. యస్.టి.యఫ్.ఐ. ఆవిర్భవించి 4 సంవత్సరాలే అయినా ఎన్నోవిజయాలు సాధించిందని కేంద్ర ప్రభుత్వ ప్రజావ్యతిరేక, ఆర్థిక, విద్యా విధానాలకు వ్యతిరేకంగా సెమినార్లు,. మెమోరాండాలు, ప్రదర్శనలు, ధర్నాల ద్వారా నిరసన తెలుపుతున్నామని, ఉపాధ్యాయులు తమ బాధ్యతలను సక్రమంగా నెరవేర్చే వాతావరణం కల్పించాలన్నారు తగిన వేతనాలు, ఉద్యోగ భద్రత కల్పించాలన్నందుకు అనేక వేధింపులకు గురి అవుతున్న తమిళనాడు ఉద్యోగులకు 7 లక్షల సహాయం చేస్తామని చెప్తూ "సమ్మె హక్కు" ను సాధించడానికి ఫిబ్రవరి 24న జరిగే సార్వత్రిక సమ్మెలో పాల్గొనాలని విజ్ఞప్తి చేశారు. •

# ప్రధానకార్యదర్శి నివేదిక

సంగ్రహం

అధ్యక్షా!

ఆంధ్ర ప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ 9వ రాష్ట్ర విద్యా వైజ్ఞానిక మహాసభలకు హాజరైన అతిథులు, ఆహ్వానితులు, ప్రతినిధులు, కార్యకర్తలు, ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులందరికీ హృదయపూర్వక స్వాగతం పలుకుతున్నాము.

ఉపాధ్యాయ ఉద్యమపితామహులు అమరజీవి చెన్నుపాటి ఆశయాల వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని, విశాలాంధ్రలో సమైక్య ఉపాధ్యాయ ఉద్యమ ఆవశ్యకత ఉన్న చారిత్రక నేపథ్యంలో 1974 ఆగస్టు 10న అమర జీవి అప్పారి వెంకటస్వామి సారథ్యంలో ఆవిర్భవించింది మన యు.టి.ఎఫ్. ఆనాడు కేవలం 7వేల మంది సభ్యులతో ప్రారంభమైన మన సంఘం వివిధ యాజమాన్యాలలోని ఉపాధ్యాయు సమస్యలను నిరంతరం అధ్యయనం చే పరిష్కారాన్ని సూచిస్తూ ప్రాతినిధ్యాలు జరపడం తోపాటు అవసరమైన సందర్భాలలో సమరశీల ఉద్య మాలను నిర్మించి, సత్ఫలితాలను సాధించడం ద్వారా ఉపాధ్యాయుల ఆదరాభి మానాలను చూరగొని నేడు లక్షా 10 వేల మంది సభ్యులతో రాష్ట్రంలోని 3వ వంతుకు పైగా ఉపాధ్యాయులకు ప్రాతి నిధ్యం వహిస్తూ, ప్రభుత్వ గుర్తింపును, సివిల్ సర్వీసెస్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో శాశ్వత సభ్యత్వాన్ని పొందింది.


నాగటి నారాయణ

యు.టి.ఎఫ్ కేవలం ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంకోసం పనిచేసే సర్వీసు సంఘంగా మాత్రమే గాక, విద్యారంగ అభివృద్ధికి, సామాజిక అభ్యున్నతికి కృషి సల్పుతూ సామాజిక స్పృహకల్గిన సంఘంగా ప్రత్యేక గుర్తింపును పొందింది. 1974 అక్టోబరు 20,21 తేదీలలో రాజమండ్రిలో ప్రథమ రాష్ట్ర విద్యామహాసభలు నిర్వహించి సంఘం పాలసీ స్టేట్‌మెంటును, నిబంధనావళిని ఆమోదించి ప్రకటించింది. అప్పటి నుండి ప్రతిసంవత్సరం వివిధ స్థాయిల్లో సాధారణ కౌన్సిల్, కార్యవర్గం తదితర సమావేశాలు నిర్వహిస్తూ ఆందోళన, ప్రచారం, పోరాట కార్యక్రమాలను సమీక్షించుకొని, నూతన నిర్మాణం జరిపి, తక్షణ కర్తవ్యాలను రూపొందించుకొని అమలు పరచడం, ప్రతి మూడేండ్లకొకసారి విద్యావైజ్ఞానిక మహాసభలను నిర్వహించి, వర్తమాన సామాజిక పరిస్థితులను సమీక్షించి మన పాలసీని తాజాపరుచుకోవడం, విద్యారంగ పరిణామాలపై మన వైఖరిని వెల్లడించడం మన సంప్రదాయంగా వస్తున్నది. ఆ క్రమంలోనే 1977 ఆగస్టు 16,17,18 తేదీలలో ఖమ్మంలో ద్వితీయ రాష్ట్ర మహాసభలు; 1981 ఆగస్టు 16,17,18 తేదీలలో భీమవరంలో 3వ రాష్ట్రమహాసభలు; 1986 జనవరి 8,9,10 తేదీలలో విజయవాడలో 4వ మహాసభలు; 1989 జూన్ 22-25 తేదీలలో నెల్లూరులో 5వ మహాసభలు; 1993 ఆగస్టు 8,9,10 తేదీలలో గుంటూరులో 6వ మహాసభలు; 1997 మార్చి 8,9,10 తేదీలలో ఒంగోలులో 7వ మహాసభలు; 2000 జనవరి 18-21 తేదీలలో కాకినాడలో రజతోత్సవాలు 8వ విద్యావైజ్ఞానిక మహాసభలు అత్యంత ఘనంగా నిర్వహించుకున్నాము. ప్రతి మహాసభ దేనికదే ఒక ప్రత్యేకతను, విశిష్టతను కలిగి హాజరులోను, చర్చలలోను గత మహాసభలను మరిపించేవిధంగా సాగింది.

రజతోత్సవ మహాసభలు మన ఉద్యమ చరిత్రలో ఒక మైలురాయి. రాష్ట్రంలోని 23 జిల్లాలనుండి నమోదైన ప్రతినిధులు 11,585 మంది, ఆహ్వానితులు 4వేల మంది, మొత్తం 16వేల మంది పాల్గొని యు.టి.ఎఫ్. మహాసభల చరిత్రలో రికార్డు నెలకొల్పారు. ఈ సందర్భంగా నిర్వహించబడిన బహుముఖ కార్యక్రమాలు, సదస్సులు, గోష్ఠులలో పలువురు మేధావుల ప్రసంగాలు, ఉపాధ్యాయుల మహాప్రదర్శన, మన సంఘం ప్రతిష్ఠను, సమీకరణ శక్తిని లోకానికి మరోసారి చాటిచెప్పాయి. తూర్పు గోదావరి జిల్లా శాఖ మహాసభల కోసం 38 లక్షలు ఖర్చుచేసి ఘనమైన ఆతిథ్యం ఇచ్చింది. అంతేగాక మహాసభలు పూర్తయిన నెల రోజుల్లోనే ఆహ్వాన సంఘం ఆదాయ వ్యయాలు ప్రకటించి ఆర్థిక క్రమశిక్షణ విషయంలో మన సంఘం విశిష్టతను నిలబెట్టడం జరిగింది

ఈ మహాసభల సందర్భంగా జరిగిన నూతన కమిటీ ఎన్నికలలో రాష్ట్ర నాయకత్వ బాధ్యత నూతన తరానికి అందించబడింది. సంఘం ఆవిర్భవించిన నాడు ప్రధానకార్యదర్శిగా బాధ్యతలు చేపట్టి, అహర్నిశలు సంఘం అభివృద్ధి కోసం అంకితమై పనిచేసి సంఘాన్ని నిర్మాణ పరంగాను, ఆర్థిక పరంగాను అభి వృద్ధి పరిచిన అమర జీవి కామ్రేడ్ ఎ.వి.ఎస్. తన బాధ్యతల నుండి రిలీవై ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు గా బాధ్యతలు చేపట్టారు.

అయితే పీడితోపాధ్యాయుల సేవలో క్రొవ్వొత్తిలా కరిగిన కామ్రేడ్ ఎ.వి.యస్. జీవన పోరాటంలో అలసిపోయి అనారోగ్యంతో 2001 మార్చి 21న భౌతికంగా మన నుండి దూరమైనారు. కామ్రేడ్ ఎ.వి.యస్. మరణం మనకుతీరనిలోటు. అయినా వారి ఆశయాలకు అంకితమై పని చేయడంద్వారా ఆలోటును పూడ్చుకొనే ప్రయత్నం చేస్తున్నాము.

రజతోత్సవ మహాసభలలో "ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ ఉద్యమం నిరంతరం నిర్వహించా"లని ఇవ్వబడిన పిలుపుకు అనుగుణంగా మనం ఈ మధ్యకాలంలో పలు ఉద్యమాలు నిర్వహించాము. అయితే ప్రపంచీకరణ, ప్రయివేటీకరణ, సరళీకరణ విధానాలలో భాగంగా, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచ బ్యాంకు షరతులకు తలొగ్గి విద్యారంగాన్ని సర్వనాశనం చేయడానికి పూనుకుంటున్నాయి. ఈ నేపథ్యంలో మన సంఘం రాష్ట్ర 9వ విద్యా వైజ్ఞానిక మహాసభలు రాజధాని నగరం హైదరాబాదులో నిర్వహించుతున్నాము.

ఈ సందర్భంగా గత మహాసభ నుండి నేటివరకు మన సంఘం నిర్వహించిన కార్యకలాపాలన్నింటినీ సమీక్షించుకోవాలి. అయితే సమకాలీన ప్రపంచ రాజకీయాలు, ప్రభుత్వాల వైఖరులు, సామాజిక మార్పులు కూడా మన ఉద్యమాన్ని ప్రభావితం చేస్తాయి కనుక మనం ముందుగా ఈ పరిణామాలను, విద్యారంగంపై వాటి ప్రభావాన్ని క్లుప్తంగా విశ్లేషించుకుందాము................

## చరిత్రను వక్రీకరిస్తున్న కేంద్ర ప్రభుత్వం

కేంద్రంలోని బిజెపి అయోధ్య సమస్యను రావణకాష్ఠంలా మండిస్తూ మతతత్వ ఎజెండాతో రక్తపుటేరులు పారించి తన పాలనను సుస్థిరం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నది. గుజరాత్ ప్రయోగాన్ని దేశమంతటా వర్తింప చేయాలని కలలు కని జమ్ము, కాశ్మీర్, హిమాచల్ ప్రదేశ్‌లలో తల బొప్పి కట్టడంతో దిమ్మెరపోయిన బిజెపి కి మొన్న జరిగిన నాలుగు రాష్ట్రాల ఎన్నికలలో మతతత్వంతో పాటు అభివృద్ధిని ప్రచారాస్త్రంగా చేసుకోక తప్పలేదు. పసిపిల్లల మెదళ్ళను కాషాయమయం చేయడానికి పాఠ్యగ్రంథాలలో మతోన్మాదాన్ని చొప్పిస్తున్నది. చరిత్రను వక్రీకరించడం, మైనార్టీలపై ద్వేషాభావాన్ని పెంచే అంశాలను చేర్చడం చేస్తూన్నది. సుప్రీం కోర్టు సైతం ఇటువంటి విధ్వంసకర ఆలోచనలకు 'సై' అనడం విచారకరం. బాబ్రీమసీదును కూల్చిన సంఘపరివార్

సచ్చీలురని, వారికి శిలాన్యాస్‌కు అనుమతిని ఇవ్వమని కోరడం బిజెపి అసలు నైజాన్ని బయట పెడుతున్నది. మతోన్మాదం అది మెజారిటీదైనా, మైనార్టీదైనా రెండూ సమాజాన్ని నాశనం చేయడం తప్ప అభివృద్ధికి ఏ మాత్రం ఉపయోగపడవు. మతాన్ని కేంద్ర బిందువుగా చేసుకొని పరిపాలన సాగించిన ఏ దేశమూ అభివృద్ధి పథంలో లేదన్నది చారిత్రక సత్యం. దేశ సమైక్యతకు సవాలుగా నిల్చిన మతతత్వ విధానాలను వ్యతిరేకిస్తూ తరతరాల సాంస్కృతిక వారసత్వాన్ని, దాని ఔన్నత్యాన్ని, లౌకికతత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుకోవల్సిన కర్తవ్యం మన ముందున్నది.

కేంద్రప్రభుత్వం ఒకవైపు మతం కార్డుతో పరిపాలనను సుస్థిరం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ మరో వైపు ప్రపంచ బ్యాంకు ఆదేశిత ఆర్థిక విధానాలను జోరుగా అమలు చేస్తూ దేశంలోని అన్ని రంగాలను ఇక్కట్లలోకి నెడుతున్నది. ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, సోషలిజం వంటి రాజ్యాంగ లక్ష్యాలను గాలికొదిలి మతం మత్తులో, ప్రైవేటీకరణ మోజులో కొట్టుకు పోతున్నది. ప్రపంచబ్యాంకు, అమెరికాల ఆదేశాలకు అనుగుణంగా దేశ సార్వభౌమత్వాన్ని సైతం తాకట్టు పెట్టడానికి వెనుకాడడం లేదు. అలీన ఉద్యమ నాయకురాలుగా ఒక వెలుగు వెలిగిన మనం అమెరికా వత్తిడి మేరకు ఇరాక్ పై దాడిని ఖండించలేని బలహీన స్థితికి చేరుకున్నాం. కేంద్ర ప్రభుత్వం పార్లమెంటుకు తెలియజేయకుండానే అనేక ప్రభుత్వ రంగ సంస్థలను కారుచౌకగా వారి తైనాతీలకు తెగనమ్ముకుంటున్నది. ప్రభుత్వ రంగాన్ని అమ్మడానికి ప్రత్యేకంగా ఒక మంత్రిత్వ శాఖ కల్గినది ప్రపంచమొత్తం మీద బహుశ మన దేశమే అయ్యుండొచ్చు. ఇప్పటికే అనేక సంస్థలను అమ్మిన ప్రభుత్వం తాజాగా బిపిసిఎల్, హెచ్‌పిసిఎల్ సంస్థల వాటాలను అమ్మబూను కోవడం, పార్లమెంటు అనుమతి లేకుండా అమ్మడం కుదరదని సుప్రీం కోర్టు తీర్పు నివ్వడం, ఆ తీర్పుని అమలు చేయకుండా ప్రభుత్వం నిరాకరించడం మనం చూస్తున్నాం. దీన్ని బట్టి చట్ట సభల మీద, ప్రజాస్వామ్యం మీద కేంద్ర ప్రభుత్వానికి ఏపాటి గౌరవం ఉన్నదో వెల్లడవుతున్నది.

ఆర్థిక విధానాల కారణంగా గ్రామీణ ప్రజలు మున్నెన్నడూ లేని దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. ఆహార ధాన్యాల ఉత్పత్తి గణనీయంగా తగ్గింది. రైతుల కొనుగోలు శక్తి పడిపోయింది. దశాబ్దకాలంగా వ్యవసాయ రంగంపై పెట్టుబడులను తగ్గిస్తూ రావడంతో గ్రామీణ ఉపాధిపై అది తీవ్ర ప్రభావం చూపింది. దేశ వ్యాప్తంగా రోజురోజుకు నిరుద్యోగం పెరిగిపోతున్నది. ఉన్న ఉద్యోగాలు వూడి క్రొత్త నిరుద్యోగులు ఎక్కువౌతున్నారు. వ్యవసాయ రంగం సంక్షోభంలో పడడంతో గ్రామీణ నిరుద్యోగం భారీస్థాయిలో పెరిగింది. స్వదేశీ, విదేశీ బహుళజాతి సంస్థల ప్రయోజనం కోసం ఉద్యోగుల, కార్మికుల సౌకర్యాలను ఒక్కొక్కటీ పథకం ప్రకారం హరించివేస్తున్నారు. వ్యయ సంస్కరణల కమిటీ సిఫార్సుల పేరుతో వేతనాలు తగ్గించడానికి, కేల్కర్ కమిటీ సిఫార్సుల పేరుతో పన్నుల వడ్డన చేయడానికి, రెండవ లేబర్ కమిషన్ సిఫార్సుల పేరుతో పని దినాలను పెంచడానికి, సెలవులను తగ్గించడానికి ప్రయత్నిస్తున్నది. పి.ఎఫ్.పై వడ్డీని తగ్గించారు. డి.ఎ., పెన్షన్‌లు, హరించడానికి కొత్త ఎత్తులు ఎత్తుతున్నది. కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన 'నూతన పెన్షన్ విధానం' అంటే బ్రతికుండగానే మన అంత్యక్రియల ఏర్పాట్లు మన ఖర్చులతో మనమే చేసుకోవడం తప్ప వేరుకాదు అని గ్రహించాలి. వేతన సవరణను ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. వి.ఆర్.ఎస్., సి.ఆర్.ఎస్.లతో ఉద్యోగులను ఇంటికి పంపడానికి, రిటైర్‌మెంట్ వయస్సు తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తున్నది. ఉద్యోగాలను కుదించివేస్తూ, ఖాళీలను భర్తీ చేయకుండా, పనిచేస్తున్న ఉద్యోగులపై అధిక భారాన్ని మోపుతున్నారు. ప్రపంచబ్యాంకు షరతులకు తలొగ్గి ఉద్యోగుల, కార్మికుల ప్రయోజనాలను హరిస్తున్న నేపథ్యంలో ఎదురయ్యే ప్రతిఘటనను అత్యంత పాశవికంగా అణచడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజాస్వామిక హక్కులను కాలరాస్తున్నారు. పాలక వర్గాలకు పనిముట్లుగా కోర్టులు సైతం వ్యవహరిస్తూ ప్రభుత్వ దోపిడీ విధానాలను సమర్థిస్తున్నాయి. బంద్‌లు, హర్తాళ్లు చేయరాదని కేరళ హైకోర్టు ఇచ్చిన తీర్పు, ప్రదర్శనలు చేయరాదని కలకత్తా హైకోర్టు ఇచ్చిన తీర్పు, పాఠ్యగ్రంథాలలో మార్పులను గూర్చి, విద్యారంగ ప్రైవేటీకరణకు ద్వారాలు తెరుస్తూ సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు, సమ్మెహక్కులేదని అదే కోర్టు ఉద్ఘాటించడం ఆ కోవలోనివేనని మనం గమనించాలి.

ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఆర్థిక విధానాల కారణంగా కష్టాల పాలవుతున్న అశేష పేద ప్రజలకు అండగా నిలబడాల్సిన న్యాయవ్యవస్థ కీలక సమయాల్లో అప్రజాస్వామిక తీర్పులు ఇస్తూ తన వర్గ స్వభావాన్ని చాటుకుంటున్నది. భారత ప్రభుత్వ అటార్నీ జనరల్ సోలీసొరాబ్జి కూడా కార్మికులకు సమ్మె హక్కులేదనడం సరికాదని స్పందించి కార్మికులకు, ఉద్యోగులకు నైతిక స్థైర్యాన్ని ఇచ్చారు. జీవించే హక్కులో భాగమే సమ్మెహక్కు. ఉమ్మడి బేరసారాలాడే హక్కు గౌరవ ప్రదమైన జీవన విధానానికి ఒక సూచిక. సమ్మెహక్కు అనేది రాజ్యాంగానికి, న్యాయానికి, చట్టానికి అతీతమైనది. అది నాగరిక సమాజానికి సంబంధించిన అంశం. భారత రాజ్యాంగం ఆమోదించిన 1926 ట్రేడ్ యూనియన్ చట్టం, 1947 పారిశ్రామిక వివాదాల చట్టాల ద్వారాగాని, అంతర్జాతీయ కార్మిక చట్టాలలోని 87,98,151,154 తీర్మానాల ద్వారాగానీ నిస్సందేహంగా కార్మికులకు, ఉద్యోగులకు సమ్మెహక్కు ఉన్నది. ప్రపంచంలో ఏ రాజ్యాంగంలో కూడా సమ్మె హక్కు పై నిషేధం లేదు. ఈ నేపథ్యంలో న్యాయమూర్తులు తమ పరిధిని అతిక్రమించారని అందరూ అభిప్రాయ పడుతున్నారు. ఈ పరిస్థితుల్లో సమ్మెహక్కుపై పార్లమెంట్‌లో చట్టం చేయబడేలా ప్రజాపతినిధులపై వత్తిడి చేయాలి. అదే విధంగా ఉద్యోగ, కార్మిక హక్కుల్ని కాలరాసే శాసనాలు చేసే వారికి, వాటిని సమర్థించే వారికి తగిన గుణపాఠం నేర్పాల్సిన కర్తవ్యం మన మీద ఉన్నది. ఇదే సందర్భంలో సమ్మెహక్కును చట్టబద్ధం చేసిన ఏకైక రాష్ట్రం పశ్చిమబెంగాల్ అని గమనించాలి.

## సంస్కరణల విషవలయంలో విద్యారంగం

ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఆర్థిక విధానాలు సామాజిక రంగాలైన విద్య,వైద్యంపై తీవ్ర దుష్ప్రభావాలను చూపుతున్నాయి. ప్రపంచబ్యాంకు షరతుల మేరకు విద్యకు అరకొర నిధులు కేటాయిస్తూ తమ బాధ్యత నుండి తప్పుకోచూస్తున్నాయి. స్వాతంత్ర్యం వచ్చిన 57 సం॥లు తరువాతనైనా విద్యాహక్కును ప్రాథమిక హక్కుగా చేయడం హర్షణీయం. అశేష ప్రజల డిమాండ్ మేరకే ఇది జరిగినా, ఆర్డినెన్స్‌లోని పలు అంశాలు మాత్రం ఆక్షేపణీయంగా వున్నాయి. ఆర్టికల్ 45 ప్రకారం అందరికీ ఉచిత విద్య అందించాల్సిన ప్రభుత్వం, తాను తప్పుకొని ఆ బాధ్యతను తల్లిదండ్రుల మీద మోపుతున్నది. అంటే ఇక నుండి దేశ నిరక్షరాస్యతకు తాము కారణం కాదని, తల్లిదండ్రులే దోషులని చెప్పడమే ప్రభుత్వ ఉద్దేశ్యంగా కనపడుతున్నది. నూటికి 70 మంది పేదలున్న భారతదేశంలో పిల్లలతో పని చేయించు కున్నందుకు జరిమానా విధిస్తామని అనడం అంటే పేద తల్లిదండ్రుల మీదే భారం వేయడమే అవుతుంది. ఇది 'మూలిగే నక్కపై తాటికాయ' వేసిన చందంగా వుంటుంది. ఆర్డినెన్సులోని మరో కీలక అంశం సమాంతర వ్యవస్థల ఏర్పాటు - అంటే నాసిరకం చదువులను పేదపిల్లలకు, సంపన్నులకు నాణ్యతతో కూడిన చదువులు- అని ప్రభుత్వం చెప్పకనే చెబుతున్నది. ఇది రాజ్యాంగ లక్ష్యాలను నీరుగార్చడం తప్ప మరొకటి కాదు. 'అందరికీ విద్య' అంటే అందరికీ ఉచితంగా నాణ్యమైన, సమానస్థాయి విద్యనందించడం. దీని కొరకు


స్వాగత ద్వారాలు


మహాసభల వేదిక

స్వాగత గీతం ఆలాపిస్తున్న ఉపాధ్యాయినులు


ప్రారంభిస్తున్న పాఠశాల విద్యా సంచాలకులు డా॥ మన్మోహన్ సింగ్


మహాసభలలో పాల్గొన్న యితర రాష్ట్రాల ఉపాధ్యాయ సంఘాల నాయకులు


భోజనశాల దృశ్యం

9వ
రాష్ట్ర విద్యా వైజ్ఞానిక మహాసభలు

ఉద్యమ సదస్సులో సందేశాలిస్తున్న నేతలు


డా॥యం.కె.పాంధే | శ్రీ తుషార్ పంచానన్ | శ్రీ రాజగోపాల్ | శ్రీ రాజేంద్రన్ | శ్రీ జి.పూర్ణచంద్రరావు



ఉద్యమ సదస్సు




శ్రీ బి.వి.సుబ్బారావు | శ్రీ ఎ.కృష్ణారెడ్డి | శ్రీ బి.సుధాకర్ | శ్రీ జి.శ్రీధర్ రెడ్డి | శ్రీ వి.బాలసుబ్రమణ్యం

9వ
రాష్ట్ర విద్యా వైజ్ఞానిక మహాసభలు




ప్రతినిధుల సభ వేదికపై రాష్ట్ర నాయకులు

**నివేదికలు ప్రవేశపెడుతున్న రాష్ట్ర నాయకులు**



యన్. నారాయణ



డి.రామిరెడ్డి



యం.సంయుక్త



జి.చిట్టిబాబు

**నివేదికలపై చర్చలో పాల్గొన్న జిల్లా శాఖల ప్రతినిధులు**



గిరిధర్ - శ్రీకాకుళం



రాము-విజయనగరం



రామసుబ్బారెడ్డి - విశాఖ



జార్జ్ విక్టర్-తూ॥గో॥



బాలయ్య - ప॥గో॥



రమేష్‌చంద్ - కృష్ణ



దుర్గారావు
గుంటూరు



ఆదినారాయణ-ప్రకాశం



రమణయ్య-నెల్లూరు



శ్రీనివాసులరెడ్డి-చిత్తూరు



లక్ష్మీరాజా-కడప



సురేష్-కర్నూలు



## నూతనంగా ఎన్నికైన రాష్ట్ర కార్యదర్శి వర్గం




## తీర్మానాలను ప్రవేశపెడుతున్న రాష్ట్ర నాయకులు



టి. కొండాచారి | సిహెచ్.సుభాష్ చంద్రబోస్ | కె.వెంకట్రావు | పి.బాబురెడ్డి | బి.మోహనరావు

## నివేదికలపై చర్చలో పాల్గొన్న జిల్లా శాఖల ప్రతినిధులు



నాగేంద్రబాబు-అనంతపురం | నరసింహారావు-ఖమ్మం | సదానంద్ -ఖమ్మం | అశోక్ -కరీంనగర్ | వెంకట్-ఆదిలాబాద్ | జగదీష్-నల్గొండ



కిష్టయ్య-యంనగర్ | సోమేశ్వర్లు-నిజామాబాద్ | నారాయణరెడ్డి-మెదక్ | పురుషోత్తమరావ్-రంగారెడ్డి | ఇంద్రజిత్-హైదరాబాద్ | చిట్టెమ్మ ఖమ్మం

## పత్రిక జనరల్ క్యాంపెయిన్ బహుమతుల ప్రదానం



ప్రథమ - నెల్లూరు

ద్వితీయ - ఖమ్మం

తృతీయ - ప్రకాశం

## వ్యక్తిగత బహుమతులు



ప్రథమ - యస్.కె.మస్తాన్, నెల్లూరు

ద్వితీయ - కె.సత్తిరాజు, తూ॥గో

తృతీయ - మాలకొండారెడ్డి, ప్రకాశం

## సాంస్కృతిక ప్రదర్శనలు



## మహాసభల వేదిక నిర్వహణ బృందం





# జనవరి 8న జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు - ధర్నాలు








కాకినాడ, తూ.గో.



ఏలూరు, ప.గో.









శ్రీ పి.పుల్లయ్య(రాజమండ్రి)గారి కుమార్తె
రత్నప్రభ వివాహం



శ్రీ కె.సాంబయ్య (నల్లగొండ) రిటైర్మెంట్



శ్రీ యస్. సాంబశివరావు
రిటైర్మెంట్ (గుంటూరు)



మనం తీవ్రస్థాయిలో ఆందోళన చేపట్టాల్సి వున్నది.

రాష్ట్ర ప్రభుత్వం విద్యారంగాన్ని ప్రైవేటు వ్యక్తులకు ధారదత్తం చేయడానికి అహరహం శ్రమిస్తున్నది. దానిలో భాగమే ఉపాధ్యాయులపై, ప్రభుత్వ పాఠశాలలపై దుష్ప్రచారం. ప్రభుత్వం పొంతన లేని అసంబద్ధ ఉత్తర్వులతో, నిర్ణయాలతో విద్యారంగంలో గందరగోళం సృష్టిస్తున్నది. చరిత్ర, సామాజిక శాస్త్రాల, బోధన అవసరం లేదని ప్రచారం చేస్తున్నది. ఫైనాన్షియల్ కోర్సులే శరణ్యం అని నినదిస్తున్నది. కోర్టు ఉత్తర్వులను సాకుగా చూపి విద్యను ప్రైవేటుపరం చేయడానికి ప్రయత్నిస్తుండడంతో విద్య పేద, మధ్య తరగతి వర్గాలకు 'అందని ద్రాక్ష'లా మారింది. ఉన్నత విద్య, వృత్తి విద్యా కోర్సుల్లో ఫ్రీ సీట్లను రద్దు చేసి కామన్ ఫీజు విధానాన్ని ప్రవేశపెట్టడం ద్వారా పేదవర్గాలే కాకుండా ఆర్థికంగా వెనుకబడిన మెరిట్ వర్గాలు కూడా విద్యకు దూరం అయ్యే పరిస్థితులు కల్పించారు. విద్యార్థులపై మోయలేని ఫీజుల భారాన్ని మోపి కార్పొరేట్ కళాశాలలకు మాత్రం అనేక రాయితీలు కల్పిస్తున్నారు. ఇంటర్ మార్కుల కుంభకోణం, ఐ.ఐ.యం. ఎంట్రన్సు పేపర్ల లీకు విద్య ప్రైవేటీకరణ దుష్ఫలితాలే.

బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించడానికి మళ్ళీ బడికి, చదువుకుందాం రా, అక్షర సంక్రాంతి, చదువుల పండగ, అందరికీ విద్య- వంటి ఆర్భాటపు పథకాలను సృష్టిస్తున్నారు. 'దీపం పేరు చెబితేనే చీకట్లు తొలగిపోతా'యనే భ్రమను కల్గిస్తున్నారు. బాలకార్మిక వ్యవస్థకు మూలకారణమైన పేదరికాన్ని తొలగించడానికి ఎటువంటి నిర్దిష్ట చర్యలు చేపట్టడం లేదు. మరోప్రక్క సర్వశిక్షా అభియాన్, గుణాత్మక విద్య అంటూ ప్రచారం చేస్తూ 774 ఉత్తర్వుల ద్వారా ఉపాధ్యాయులను పాఠశాలల్లో లేకుండా చేస్తూ ప్రాథమిక విద్యను నాశనం చేయడానికి పాలకులు వెనకాడడం లేదు. ఇది ప్రభుత్వ ద్వంద్వ నీతికి నిదర్శనం. ఇప్పటికే రాష్ట్రంలో అరవై వేల ఉపాధ్యాయ పోస్టులు ఖాళీగా వుండగా వాటిని నింపకుండా, హైస్కూళ్ళకు డెప్యుటేషన్ల పేరుతో ముప్పైవేల పోస్టులను మిగులుగా చూపిస్తున్నారు. వీటితో పాటు 40 వేల మంది విద్యావాలంటీర్లను నియమించినట్లు ప్రకటిస్తున్నారు. ఉన్నవాళ్ళను లేనట్లుగాను, లేని వాళ్ళను ఉన్నట్టుగాను చూపిస్తూ జంతర్‌మంతర్ గారడీ చేస్తుండడంతో నేడు రాష్ట్ర విద్యారంగం అయోమయంలో కొట్టుమిట్టాడుతున్నది.

నిధుల్ని నానాటికీ తగ్గిస్తుండడంతో పాఠశాలల భౌతిక పరిస్థితులు క్షీణిస్తున్నాయి. తద్వారా ప్రైవేటు వైపు విద్యార్థుల వలసలు ఎక్కువౌతున్నాయి. వివిధ రకాల ఉపాధ్యాయుల సృష్టితో, కాంట్రాక్ట్ విధానం రంగ ప్రవేశంతో ఉపాధ్యాయుల సాంఘిక, ఆర్థిక హోదా నానాటికీ అడుగంటుతున్నది. ఇన్ని సమస్యల నడుమ సర్వీస్ రూల్సు సమస్య రాష్ట్ర విద్యారంగానికి మరో 'కలికితురాయి'గా భావించవచ్చు. ఉపాధ్యాయుల సర్వీస్ రూల్సు జి.ఓ.లు 505,538 లను హైకోర్టు కొట్టి వేసింది. దీనికొరకు న్యాయపోరాటం చేయాలని సంఘాలు సమాయత్తమవుతుండగా మొత్తం పాఠశాలలను స్థానిక సంస్థలకు అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. కాని ఉత్తర్వుల విడుదలకు ఇంకా మీన మేషాలు లెక్కపెడుతున్నది. ఈ నేపథ్యంలో సర్వీస్ రూల్స్ విద్యాశాఖ పరిధిలోనే కొనసాగేలా, జిల్లా విద్యాశాఖాధికారులే నియామక, బదిలీ అధికారులుగా వుండేలా, కౌన్సిలింగ్ విధానం పరిరక్షించబడేలా చూడాల్సిన బాధ్యత మన మీద వుంది. అందుకు మనం అప్రమత్తంగా వుంటూ విద్యారంగ ప్రతిపత్తిని నిలబెట్టడానికి అవసరమైతే ఆందోళనలకు సైతం పూనుకోవలసి వుంటుంది.

పై సామాజిక, ఆర్థిక పరిణామాల నేపథ్యంలో గత మూడు సంవత్సరాలుగా మనం నిర్వహించిన బహుముఖ కార్యక్రమాలను మీముందుంచుతున్నాను.

# ఆందోళనలు- పోరాటాలు

**స్వతంత్ర కార్యాచరణ :** గత మహాసభ అనంతరం మనం స్వతంత్రంగా, ఐక్య కార్యాచరణ ద్వారా పలు ఉద్యమాలు నిర్వహించి ఒక మేరకు సంతృప్తికర ఫలితాలను సాధించాము. అప్రంటిస్ టీచర్ల స్టైపెండ్ పెంచాలని, నోషనల్ ఇంక్రిమెంట్స్ ఇవ్వాలని, ఎయిడెడ్ టీచర్ల సర్వీసుపై ఆర్డినెన్స్ రద్దుచేయాలని, హైస్కూళ్ళలోని యస్.జి.టి, పి.ఇ.టి. పోస్టులను అప్‌గ్రేడ్ చేయాలని, 99 పి.ఆర్.సి. అనామలీస్ సవరించాలని డిమాండ్ చేస్తూ దశలవారీ పోరాట కార్యక్రమాన్ని చేపట్టాము.

2000 ఫిబ్రవరి 21న అన్ని జిల్లా కేంద్రాలలో ధర్నాలు జరిగాయి. రెండవదశగా మార్చి 6న హైదరాబాదులో రాష్ట్రస్థాయి ధర్నా 1000 మందితో నిర్వహించాము. పోరాటం ఫలితంగా ప్రభుత్వం స్పందించింది. ఎయిడెడ్ సిబ్బంది జీతాల గ్రాంటు రు 35 కోట్లు విడుదలచేసింది.

తిరిగి జులైలో మరోదఫా పోరాట కార్యక్రమం తీసుకున్నాము. యాక్టు 9/2000 ను రద్దు చేయాలని, 62 జి.ఒ. అమలు జరపాలని తదితర డిమాండ్లతో రాష్ట్ర కేంద్రం నుండి 70 వేల కరపత్రాలు పంపిణీ చేశాము. జులై 24న అన్ని జిల్లా కేంద్రాలలో పెద్దఎత్తున ధర్నాలు జరిగాయి. అప్పటికి పెండింగ్‌లో గల 2 విడతల డి.ఎ. ను ధర్నా రోజే ప్రభుత్వం ప్రకటించటం మన కార్యకర్తలను ఉత్సాహపరిచింది. యాక్ట్ 9/2000ను వెనుకటి తేదీ నుండి కాకుండా, చట్టం చేయబడిన నాటి నుండే వర్తించేవిధంగా ఉత్తర్వులు సాధించడం మన విజయం.

## రాష్ట్ర ధర్నా

ఎయిడెడ్ టీచర్ల జీతాల బకాయిల విడుదల, అంతర్ జిల్లా బదిలీలు, సాధారణ బదిలీలకు అనుమతి, జె.ఎల్. ప్రమోషన్లు హైస్కూల్ ఎస్.జి.టి.ల అప్‌గ్రెడేషన్ తదితర ప్రధాన సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ రాష్ట్ర వ్యాప్తంగా కరపత్రాలు పంచి 2000 జూన్ హైదరాబాదులో 500 మందితో రాష్ట్రస్థాయి ధర్నానిర్వహించాము.

## సాధారణ బదిలీల కోసం ఆందోళన

సాధారణ బదిలీల కోసం ఉద్యమించాలంటూ 2001 ఆగస్టులో కరపత్రాన్ని వేసి ప్రచారం చేశాము. అదే సమస్య పై సెప్టెంబరు 4న జిల్లా కేంద్రాల్లోను, సెప్టెంబరు 10న రాష్ట్ర కేంద్రంలోను పోరాటాలకు సిద్ధం అయ్యాము. సాధారణ బదిలీలకు అనుమతించకుండా ప్రభుత్వమే నేరుగా బదిలీలు చేయడం అక్రమమంటూ, మానకపోతే ఆందోళన చేస్తామని మనం పత్రికాముఖంగా చేసిన ప్రకటనలు పెద్ద చర్చనీయాంశమైనాయి.

కొత్త టీచర్ల నియామకానికి ముందే బదిలీలు, ప్రమోషన్ల కౌన్సిలింగ్ నిర్వహించటానికి మన పోరాటం ఉపయోగపడింది.

## అప్‌గ్రేడెడ్ పోస్టులలోనికి ప్రమోషన్ల కోసం

హైస్కూల్ ఎస్.జి.టి. పోస్టులను ఇంగ్లీష్, ఫిజికల్ సైన్స్ స్కూల్ అసిస్టెంట్స్‌గా అప్‌గ్రేడ్ చేసిన ప్రభుత్వం ప్రమోషన్ల ద్వారా వాటిని భర్తీ చేయకుండా జాప్యంచేస్తున్న సందర్భంలో 2002 ఫిబ్రవరి 4న ధర్నాకు పిలుపునిచ్చి కరపత్రాల ద్వారా ప్రచారం చేసి ఉపాధ్యాయులను పోరాటానికి సిద్ధం చేశాము. ఇక 2002 సంవత్సరం అంతా పోరాటాల వెల్లువగా గడిచింది.

## అక్రమ బదిలీలపై నిరసన

సెక్రటేరియట్ స్థాయిలో జరిగిన అక్రమ బదిలీలకు నిరసనగా 2002 మే 22న జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు జరిపాము.

## గిరిజన సంక్షేమ టీచర్ల సమస్యలపై

గిరిజన సంక్షేమ టీచర్ల సమస్యల పరిష్కారం కోసం జూన్ 17న అన్ని ఐ.టి.డి.ఎ.ల ఎదుట, జూన్ 22న గిరిజన సంక్షేమ కమీషనర్ కార్యాలయం ఎదుట ధర్నాలు నిర్వహించాము.

## కొలువు-నెలవు

"కొలువున్న చోటే నెలవుండాలంటూ" ప్రభుత్వం ఇచ్చిన అసంబద్ధ ఉత్తర్వులను వ్యతిరేకించాము. మన వైఖరిని వెల్లడిస్తూ ప్రచురించిన కరపత్రాలు ఉపాధ్యాయులను విశేషంగా ఆకట్టుకున్నాయి. మన కృషి ఫలితంగానే ఐక్య పోరాటాల్లో ఈ సమస్యకు ప్రాధాన్యత లభించింది.

## స్థానిక సమస్యలపై పోరాటం

రాష్ట్రస్థాయి సమస్యలతో పాటు, జిల్లా, మండల / పట్టణ పరిధిలోగల పెండింగ్ సమస్యల పరిష్కారానికి రాష్ట్ర వ్యాప్తంగా దశలవారీ పోరాటం నిర్వహించాలని ఇచ్చిన పిలుపు జయప్రదంగా అమలు జరిగింది.

2002 సెప్టెంబరు 23,24,25 తేదీలలో మండల/పట్టణ కేంద్రాలలో ప్రదర్శనలు, ధర్నాలు జరిగాయి. సగటున 50 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. రెండవ దశగా జిల్లా కేంద్రాల్లో అక్టోబరు 7న ధర్నాలు నిర్వహించాము. మూడవ దశగా డిసెంబరు 9న హైదరాబాదులో మూడువేల మంది కార్యకర్తలతో ధర్నా జరిపాము. మన పోరాట ఫలితంగా మండల/పట్టణ, జిల్లాస్థాయి లోగల కొన్ని ప్రధాన సమస్యలు పరిష్కారమైనాయి. ఈ పోరాట కార్యక్రమం మన కార్యకర్తల్లో మంచి ఉత్సాహాన్ని, ఉద్యమస్ఫూర్తిని నెలకొల్పింది.

## అన్‌ట్రైన్డ్ టీచర్ల సమస్యలపై

అన్‌ట్రైన్డ్ టీచర్లకు ట్రైనింగ్, 2002 డి.ఎస్.సి సెలెక్టెడ్ అన్‌ట్రైన్డు అభ్యర్థులకు పోస్టింగ్‌లు ఇవ్వాలనే డిమాండ్‌తో ఫిబ్రవరి 3న జిల్లా కేంద్రాల్లో ధర్నాలు జరిపాము. ఫలితంగా సెలెక్టెడ్ అన్‌ట్రైన్డు టీచర్లను స్పెషల్ విద్యావాలంటీర్లుగా నియమిస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటన చేసింది. మార్చి 29న హైదరాబాదులో 250 మందితో ధర్నా జరిపాము.

## జి.ఓ. నెం. 94 రద్దుకోసం

ఉద్యోగ అవకాశాలను హరించే జి.ఒ.నెం. 94 రద్దు కోసం 2002 మార్చి చివరి వారం నుండి రాష్ట్ర వ్యాప్తంగా పెల్లుబికిన ప్రతిఘటన పోరాటంలో మనమూ భాగస్వాములమైనాము. 20వేల పోస్టర్లు వేశాము. ప్రభుత్వం జి.ఓ.ను రద్దు చేసుకుంది.

## బదిలీల కౌన్సిలింగ్ కోసం

2002-03 విద్యా సంవత్సరం ముగింపులో బదిలీలు, ప్రమోషన్ల కౌన్సిలింగ్‌కు అనుమతించకుండా రాష్ట్ర ప్రభుత్వం దొడ్డిదారి బదిలీలకు పూనుకుంటున్న సమాచారం తెలిసి మనం, నిరసన తెలుపుతూ పోరాట కార్యక్రమాన్ని చేపట్టాము. ఏప్రిల్ 24 లోగా కౌన్సిలింగ్ షెడ్యూల్ ప్రకటించకుంటే ఏప్రిల్ 29న జిల్లా కేంద్రాల్లో ధర్నాలు నిర్వహిస్తామని హెచ్చరించడంతో ప్రభుత్వం "సెక్రటేరియట్ బదిలీలు చేయటంలేదు" అని ప్రకటించటంతో పాటు సాధారణ బదిలీలు, ప్రమోషన్ల కౌన్సిలింగ్ షెడ్యూల్‌ను ప్రకటించింది. ఇది మన ఉద్యమ విజయం.

## అంతర్ జిల్లా బదిలీల కోసం

కౌన్సిలింగ్ షెడ్యూల్ ప్రకటించిన ప్రభుత్వం అంతర్ జిల్లా బదిలీలకు అనుమతించలేదు. అలాగే ప్రమోషన్లు, బదిలీలలో గల సమస్యలను పరిష్కరించలేదు. అంతర్ జిల్లా బదిలీలకు అనుమతించాలంటూ మే '5'న (వేసవి సెలవుల్లోనే) 250 మందితో హైదరాబాద్‌లో ధర్నా నిర్వహించాము.

## బదిలీలు, ప్రమోషన్ల సమస్యల పరిష్కారం కోసం

బదిలీలు, ప్రమోషన్ల కౌన్సిలింగ్‌కు షెడ్యూల్ ప్రకటించిన ప్రభుత్వం ఆన్‌లైన్ కౌన్సిలింగ్ పేరిట మండల స్థాయి కౌన్సిలింగ్‌ను రద్దు చేయడం, బి.కామ్, బి.ఇడి, బి.ఎ. (ఎస్.పి.పి) అభ్యర్థులకు ప్రమోషన్లు, 30% ఇంగ్లీషు, ఫిజికల్ సైన్స్ ప్రమోషన్లపై ఏ నిర్ణయం తీసుకోకపోవడం, భార్య (స్పౌస్) భర్తకు 10 అదనపు పాయింట్లు రద్దు చేయడం, క్యాటగిరి 1,2లలోని ఖాళీలు చూపవద్దనడం తదితర సమస్యలన్నింటినీ పరిష్కరించాలంటూ మన సంఘం మాత్రమే ముందుగా స్పందించి దశలవారీ పోరాట కార్యక్రమాలకు పిలుపునిచ్చింది.

## గుణాత్మక విద్య శిక్షణా తరగతుల బహిష్కరణ

మే 14న రాష్ట్రవ్యాప్తంగా మండల కేంద్రాల్లో జరుగుతున్న 'గుణాత్మక విద్య శిక్షణాతరగతులను బహిష్కరించాలని మన మిచ్చిన పిలుపుకు మంచి స్పందన లభించింది. మన సభ్యులతో పాటు ఇతరులు కూడా బహిష్కరణలో పాల్గొన్నారు.

## పికెటింగ్

కౌన్సిలింగ్ షెడ్యూల్ సమీపిస్తున్నా, ఉపాధ్యాయుల నిరసనలు, మన సంఘం ప్రాతినిధ్యాలను ప్రభుత్వం పట్టించు కోకపోవడంతో జూన్ 10న పాఠశాల విద్యాకమీషనర్ కార్యాలయాన్ని, జూన్ 13న డి.ఇ.ఓ. కార్యాలయాలను దిగ్బంధం చేయాలని పిలుపునిచ్చాము. ఆమేరకు జూన్ 10న సి& డి.ఎస్.ఇ. కార్యాలయం ఎదుట 350 మంది ఉపాధ్యాయులతో పికెటింగ్ జరిపి అరెస్టయినాము. జిల్లాల్లో జూన్ 13న డి.ఇ.ఓ. కార్యాలయాల పికెటింగ్‌లో వేలాది మంది ఉపాధ్యాయులు పాల్గొని అరెస్టయినారు. ప్రెస్, మీడియా కవరేజ్‌తో మంచి ప్రచారం లభించింది. ఎట్టకేలకు ప్రభుత్వం స్పందించి మండల స్థాయి కౌన్సిలింగ్‌కు అంగీకరించింది. ప్రమోషన్ నిబంధనలు సడలిస్తూ జి.ఓ. 71 విడుదల చేసింది. భార్య(స్పౌస్)భర్తకు 10 అదనపుపాయింట్లు కేటాయించింది. బదిలీలు, ప్రమోషన్ల సందర్భంగా ఏర్పడిన 1,2 కేటగిరి ఖాళీలలో బదిలీలకు అనుమతినిచ్చింది. ఇది మన పోరాటానికి లభించిన ఘన విజయం. టీచర్లలో మన జనరల్ ఇమేజ్ మరింత పెరగడానికి ఇది ఉపయోగపడింది.

## సార్వత్రిక సమ్మెకు మద్దతుగా

దేశవ్యాప్తంగా ప్రయివేటీకరణకు వ్యతిరేకంగా మే 21న కార్మికులు, ఉద్యోగులు నిర్వహించిన సార్వత్రిక సమ్మెకు మద్దతుగా మన సంఘం తరపున 50వేల కరపత్రాలు, 5వేల పోస్టర్లు ముద్రించి విస్తృత ప్రచారం నిర్వహించాము. మే 19న, 21న జిల్లా కేంద్రాలలో సంఘీభావ ప్రదర్శనలు నిర్వహించాము.

## తక్షణ సమస్యల పరిష్కారానికి ఆందోళన

అప్రెంటిస్ టీచర్లకు రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలని, అప్రంటీస్ కాలాన్ని 8/16 సంవత్సరాల ప్రమోషన్‌కు లెక్కించాలని, అప్రెంటిస్ స్టైపెండ్‌ను రు.3000, 4000, 5000 గా పెంచాలని, పి.ఆర్.సి అనామలీస్ కమిటీ రిపోర్టును ప్రకటించి అమలు జరపాలని తదితర తక్షణ సమస్యల పరిష్కారం కోసం జులై 24న జిల్లా కలెక్టరేట్‌ల వద్ద ధర్నాలు, జిల్లా కేంద్రాల్లో ర్యాలీలు నిర్వహించాము.

## అక్రమ డెప్యుటేషన్ ఉత్తర్వులపై ఆందోళన

ఉన్నత పాఠశాలల్లో సబ్జక్టు టీచర్ల కొరత తీర్చడానికి ప్రాథమిక పాఠశాలల్లోని క్వాలిఫైడ్ టీచర్లని డెప్యూటేషన్‌పై నియమించాలని, ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని 1:40 ఎన్‌రోల్‌మెంట్ బదులు 1:50 సగటు హాజరుగా నిర్ణయిస్తూ, ప్రాథమిక పాఠశాలల్లోని ఖాళీ పోస్టుల్లో విద్యావాలంటీర్లను నియమించాలని ఆదేశిస్తూ పాఠశాల విద్యాకమీషనర్ విడుదల చేసిన ప్రొసీడింగ్స్ నెం. 774 తేది 14.8.2003 అత్యంత వివాదాస్పదమైంది.

ఈ ఉత్తర్వులు అమలుజరిగితే ప్రాథమిక విద్య సర్వనాశనమై పోయే ప్రమాదం వుంటుందని మనం గమనించాము. ముందుగా మనం మాత్రమే స్పందించి పోరాట కార్యక్రమానికి పిలుపునిచ్చాము. తరువాత జె.సి.టి.ఎ కూడా కలసిరావడంతో మన పిలుపును జె.సి.టి.ఎ. పోరాటంగా మార్పుచేసుకున్నాము.

## మున్సిపల్ టీచర్ల సమస్యలపై

మున్సిపల్ టీచర్ల రాష్ట్ర సదస్సు లో నిర్ణయించిన మేరకు ఆగస్టు 4న కోస్తా, రాయలసీమలోని (తెలంగాణ ప్రాంతంలో మున్సిపల్ పాఠశాలలు లేవు) అన్ని మున్సిపాలిటీల ఎదుట ధర్నా నిర్వహించాము. రాష్ట్రస్థాయి సమస్యలతో పాటు స్థానిక సమస్యలపై అధికారులకు మెమోరాండాలు సమర్పించాము.

# ఐక్య ఉద్యమాలు

ఉపాధ్యాయ సమస్యల పరిష్కారంకోసం స్వతంత్ర కార్యాచరణ ద్వారా కృషి చేస్తూనే ఐక్య ఉద్యమాలలో కూడా క్రియాశీలకంగా పాల్గొన్నాము. రాష్ట్రవ్యాప్తంగా 17 ఉపాధ్యాయ సంఘాలతో ఏర్పడిన ఉపాధ్యాయ సంఘాల పోరాట సమితి (యు.ఎస్.పి.ఎస్) నిర్వహించిన ఉద్యమం ఫలితంగా 1998 నవంబర్‌లో వెలువడిన కామన్ సర్వీస్ రూల్స్ జి.ఓ.లు 505, 538లను ట్రిబ్యునల్ సమర్ధించటంతో మే 2000 నుండి అమలులోకి వచ్చాయి.

యు.ఎస్.పి.ఎస్ ఆధ్వర్యంలో 2000 ఏప్రిల్‌లో 20 సమస్యల పరిష్కారం కోసం స్పాట్ బహిష్కరణకు పిలుపు ఇవ్వగా, విద్యాశాఖమంత్రి 2సార్లు చర్చలు జరిపి కొన్ని సమస్యలు పరిష్కరించడంతో బహిష్కరణ పిలుపు ఉపసంహరించబడింది. వెయ్యి పి.ఇ.టి పోస్టులు గ్రేడ్ -II పి.డి. లుగా అప్‌గ్రేడ్ చేయడం, నాన్ డి.ఎస్.సి వారి రెగ్యులరైజేషన్, 86-90 మధ్య నియమించబడిన స్పెషల్ టీచర్ల సర్వీస్ పెన్షనుకు, 8/16 సం॥ ల ప్రమోషన్‌కు లెక్కింపు తదితర సమస్యలు పరిష్కరించబడిన వాటిలో ముఖ్యమైనవి.

## జె.సి.టి.ఎ. ఆవిర్భావం

యు.ఎస్.పి.ఎస్.కు ఒక నిర్మాణ స్వరూపంగాని, నిబంధనావళిగాని లేనందున ఐక్యఉద్యమం సాధించిన ప్రయోజనాలను తన స్వంత విజయాలుగా ప్రచారం చేసుకొంటున్న పి.ఆర్.టి.యు. వైఖరిని నిరోధించడంకోసం ఐక్య ఉద్యమానికి ఒక నిర్మాణ స్వరూపం, నిబంధనావళిని రూపొందించటం జరిగింది. ఆక్రమంలోనే ఉపాధ్యాయ సంఘాల సంయుక్త మండలి (జె.సి.టి.ఎ) ఆవిర్భవించింది. 2000 అక్టోబర్ 31న జరిగిన ఎన్నికలలో మన ప్రధాన కార్యదర్శి సెక్రటరీ జనరల్‌గా ఎన్నికైనారు. ప్రధాన నాయకత్వం తమకు దక్కలేదన్న దుగ్ధతో పి.ఆర్.టి.యు. కుంటిసాకులు చెప్పి జె.సి.టి.ఎ నుండి బయటికి వెళ్ళింది.

## దశలవారీ పోరాటం

జె.సి.టి.ఎ. ఆధ్వర్యంలో పాఠశాల విద్యాశాఖకు 25 సమస్యలు, గిరిజన సంక్షేమశాఖకు 15 సమస్యలతో 2001 జనవరిలో నోటీసులు ఇచ్చి, 2001 ఫిబ్రవరి 8న జిల్లా ర్యాలీలు, బహిరంగ సభలు విజయవంతంగా నిర్వహించాము. అనంతరం మార్చి 12న రాష్ట్రస్థాయి ధర్నాకు సమాయత్తమౌతుండగా, మార్చి 8,9 తేదీలలో విద్యాశాఖ అధికారులు జె.సి.టి.ఎ. తో చర్చలు జరిపి వ్రాతపూర్వక మినిట్స్ ఇవ్వడంతో ఆ ధర్నా వాయిదావేశాము.

ఆ పోరాటఫలితంగా యాక్ట్ 9/2000 పై తుది నిర్ణయం జరిగేవరకు రికవరీలు, రీఫిక్సేషన్లు లేకుండా ఎయిడెడ్ టీచర్ల జీతాలు చెల్లించేవిధంగా ఉత్తర్వులు వచ్చాయి. ఇంటర్, టి.టి.సి. అర్హతలుగల ఎస్.జి.టి. లకు అదనపు అర్హతలతోనిమిత్తం లేకుండా 16 సం॥ ప్రమోషన్ స్కేలు మంజూరు, 10-83న అప్‌గ్రేడ్ చేయబడిన పండితులకు గ్రేడ్-1 స్కేలు యథావిధిగా కొనసాగించడం, నాలుగు సంవత్సరాల అప్రెంటిస్ విధానాన్ని రెండు సంవత్సరములకు తగ్గింపుపై సానుకూలత- తదితర అంశాలు ఒప్పందంలో చెప్పుకోదగినవి.

విద్యాశాఖ అధికారులు మార్చి 2001 లో జె.సి.టి.ఎ తో చర్చించి హామీ ఇచ్చిన సమస్యలపై ఉత్తర్వులు ఇవ్వాలంటూ 2001 సెప్టెంబర్ 4న హైదరాబాద్‌లో రాష్ట్ర స్థాయి ధర్నా జరిగింది. మన సంఘం నుండి 700 మంది పాల్గొన్నారు. ధర్నాకు సమీకరణ కోసం సన్నాహకంగా ఆగస్టు 17,18,19 తేదీలలో జిల్లా కేంద్రాలలో జరిగిన సదస్సులలో ఉపాధ్యాయులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

2002 ఏప్రిల్ 6న జె.సి.టి.ఎ. పిలుపు మేరకు ఉపాధ్యాయులు నల్ల బ్యాడ్జీలు ధరించి విధులకు హాజరైనారు. ఎస్.ఎస్.సి. స్పాట్ వాల్యుయేషన్ కేంద్రాల్లో సమావేశాలు జరిపాము. ఏప్రిల్ 15న హైదరాబాద్‌లో రాష్ట్రస్థాయి ధర్నా నిర్వహించాము. జులై 24న టీచర్ల 'చలో అసెంబ్లీ' నిర్వహించాము. ఉపాధ్యాయులు స్థానికంగా నివాసం ఉండాలనే నిర్బంధ ఉత్తర్వులపై ఉపాధ్యాయుల్లో గల నిరసన ఆ ర్యాలీ ద్వారా బహిర్గతమైంది. మన సంఘం నుండి మూడువేలమంది ర్యాలీలో పాల్గొన్నారు. ఆ ర్యాలీ స్ఫూర్తితో జె.సి.టి.ఎ. ఇచ్చిన పిలుపుమేరకు ఆగస్టు 28న అన్ని జిల్లాల కలెక్టరేట్‌ల వద్ద పికెటింగ్‌లు జరిగాయి. వందలాది మంది ఉపాధ్యాయులు అరెస్టయినారు. మన సంఘం సభ్యులు అధిక సంఖ్యలో పాల్గొని, సమరశీలంగా పోరాడేందుకు కృషిచేశారు.

2003 ఏప్రిల్ 9న నల్ల బ్యాడ్జీలతో నిరసన, స్పాట్ వ్యాల్యుయేషన్ సెంటర్లలో సమావేశాలు జరిపి సమస్యలతో కూడిన కరపత్రాలను పంపిణీ చేశాము.

రెండేళ్ళ పదవీకాలం ముగియడంతో 2002 అక్టోబర్‌లో నిబంధనావళి ప్రకారం జె.సి.టి.ఎ. ప్రధాన నాయకత్వం మార్పు జరిగింది. ఎ.పి.యు.ఎస్, ఎస్.టి.యు. బాధ్యులు ఛైర్మన్, సెక్రటరీ జనరల్‌గా ఎన్నికయ్యారు. ప్రభుత్వ విధానాల ఫలితంగా వచ్చిన సమస్యలపై తక్షణమే స్పందించడంలో నాయకత్వం చొరవ చూపలేదు. జె.సి.టి.ఎ. అస్తిత్వమే ప్రశ్నార్ధకమయ్యే పరిస్థితి ఏర్పడింది. దీనికి తోడుగా గుర్తింపుపొందిన సంఘాల ఆఫీస్ బేరర్లకు బదిలీల్లో రాయితీ విషయంలో ఎ.పి.టి.ఎఫ్. వైఖరితో విభేధించిన ఎస్.టి.యు., ఆప్టాలు జె.సి.టి.ఎ ను వీడి పి.ఆర్.టి.యు తో కలసి 'స్కార్ట్' పేరుతో ప్రభుత్వానుకూల ఐక్యవేదికను ఏర్పాటు చేసుకున్నాయి. ఎ.పి.యు.ఎస్. ప్రధాన బాధ్యులు సంఘం బాధ్యతల నుండి తప్పుకున్నారు. దానితో అనివార్యంగా జె.సి.టి.ఎ. కి నూతన నాయకత్వం అవసరమైంది. జులై 14న కార్యదర్శివర్గం, 25న కార్యవర్గం జరిపి కో.ఛైర్మన్, డిప్యూటీ సెక్రటరీ జనరల్ బాధ్యతల్లో ఉన్న ఎన్. నారాయణ, ఎ. నరసింహారెడ్డిలకు తాత్కాలికంగా ఛైర్మన్, సెక్రటరీ జనరల్‌గా బాధ్యత అప్పగించబడింది. ఆగస్టు 20న జరిగిన జె.సి.టి.ఎ. ఫెడరల్ కౌన్సిల్ సమావేశంలో నిబంధనావళికి ప్రత్యేక మినహాయింపుతో కార్యవర్గం నిర్ణయాన్నే ఏకగ్రీవంగా ఆమోదించటం జరిగింది.

## అక్రమ డెప్యుటేషన్ ఉత్తర్వులపై పోరాటం

ప్రాథమిక విద్యను నిర్వీర్యం చేసే అక్రమ డెప్యుటేషన్ ఉత్తర్వులు నెం 774 తేదీ 14/8/03 కు వ్యతిరేకంగా యు.టి.ఎఫ్. ఆగస్టు 25న జిల్లా కేంద్రాలలో ర్యాలీలు, ధర్నాలు నిర్వహించాలని నిర్ణయించగా, ఆగస్టు 20న జరిగిన జె.సి.టి.ఎ. ఫెడరల్ కౌన్సిల్ కూడా ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయడంతో యు.టి.ఎఫ్. ధర్నా జె.సి.టి.ఎ. ధర్నాగా మార్పుచేయబడింది. అన్ని జిల్లాల్లో జరిగిన జె.సి.టి.ఎ. ధర్నాల్లో ఉపాధ్యాయులు పెద్ద సంఖ్యలో పాల్గొని ప్రభుత్వానికి నిరసనతెలిపారు. ప్రభుత్వం హడావిడిగా ఆగస్టు 23న కొన్ని సవరణలు చేసింది. 25న వీడియో కాన్ఫరెన్స్ పెట్టి కంటితుడుపు చర్యకు పూనుకున్నది. అయితే ఆ ప్రమాదకర ఉత్తర్వులు రద్దయ్యేవరకు పోరాడాలని జె.సి.టి.ఎ. నిర్ణయించింది. ఆమేరకు సెప్టెంబర్ 6న టెలిగ్రాం క్యాంపెయిన్ జరిపారు. సెప్టెంబర్ 15 నుండి 18 వరకు రాష్ట్ర నాయకులు జిల్లాల్లో పర్యటించి సదస్సులు, సమావేశాలు నిర్వహించారు. అనంతరం సెప్టెంబర్ 23న "చలో అసెంబ్లీ" ర్యాలీ భారీ ఎత్తున నిర్వహించబడింది.

### రాష్ట్ర ధర్నా

పాఠశాలలను స్థానిక సంస్థలకు అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయించిన దరిమిలా, ఉపాధ్యాయుల సర్వీసు విషయంలో ఉత్పన్నమౌతున్న సమస్యలన్నింటినీ పరిశీలించి సమగ్రమైన సర్వీసు నిబంధనలు రూపొందించాలని, పి.ఆర్.సి.ని నియమించాలని, తదితర సమస్యల పరిష్కారాన్ని కోరుతూ డిసెంబర్ 6న హైదరాబాద్‌లో జె.సి.టి.ఎ. ధర్నాను నిర్వహించింది.

## జె.ఎ.సి. కార్యక్రమాలు

2000 సెప్టెంబర్, అక్టోబర్‌లలో ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాల సంయుక్త మండలి (జాయింట్ యాక్షన్ కమిటీ) జె.ఎ.సి. పునర్నిర్మాణం జరిగి, నూతన కమిటీ ఎన్నికైంది. 10 లక్షల మందికి ప్రాతినిధ్యం వహించే 68 సంఘాలు జె.ఎ.సి.లో భాగస్వాములైనాయి. ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రయివేటీకరణ, ఉద్యోగ వ్యతిరేక విధానాలపై తీవ్రతర పోరాటం నిర్వహించాలని జె.సి.టి.ఎ. నిర్ణయించింది. నల్ల బ్యాడ్జీలతో విధులకు హాజరు, మధ్యాహ్నం భోజన విరామసమయంలో ప్రదర్శనలు, ర్యాలీలు మినహా సమరశీల పోరాట కార్యక్రమాలు నిర్వహించేదానికి నాయకత్వం సుముఖంగా వుండటంలేదు. అయినా జె.ఎ.సి లో బాధ్యులుగా వున్న మనం, సి.ఐ.టి.యు. చేస్తున్న వత్తిడి ఫలితంగా 2001 ఏప్రిల్ 19న జిల్లా కేంద్రాలలో సామూహిక ధర్నాలకు జె.సి.టి.ఎ. పిలుపునిచ్చింది. ఊహించనిరీతిలో ధర్నా విజయవంతమైంది. ఏప్రిల్ 21,22 తేదీలలో క్యాబినెట్ సబ్‌కమిటీతోను ఏప్రిల్ 23న ముఖ్యమంత్రితోను చర్చలు జరిపి, కొన్ని సమస్యలపై అగ్రిమెంటు కుదుర్చుకోవడం జరిగింది.

అయితే ప్రధాన డిమాండ్లు ప్రయివేటీకరణ, కాంట్రాక్టునియామకాలు, ఉద్యోగాల సంఖ్యతగ్గింపు వంటి విధానపరమైన సమస్యలను మాత్రం అగ్రిమెంటు సందర్భంగా విస్మరించటం గమనార్హం.

పెన్షనర్లకు 1-7-2001 నుంచి చెల్లించాల్సిన డియర్‌నెస్ రిలీఫ్‌ను చెల్లించకుండా వుంటే, క్యాబినెట్ సబ్‌కమిటీతో జె.ఎ.సి. జరిపిన చర్చలలో ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా డి.ఆర్. చెల్లించలేమని ప్రభుత్వం తెలుపగా మాట్లాడకుండా అగ్రిమెంటుపై సంతకం చేసిరావటంతో జె.ఎ.సి. నాయకత్వం విమర్శలపాలైంది.

2002 మార్చి 15న జిల్లా కేంద్రాలలో ర్యాలీలు, బహిరంగసభలు, ఆగస్టు 20న డిమాండ్స్‌డే, 2003 మార్చి 25న హైదరాబాద్‌లో ధర్నా, ఏప్రిల్ 16న జిల్లా కేంద్రాల్లో ప్రదర్శనలను జె.ఎ.సి. ఆశ్వర్యంలో నిర్వహించారు. నూతన పి.ఆర్.సి.ని నియమించాలని, 1998 పి.ఆర్.సి. అనామలీస్ రివ్యూ కమిటీ సిఫారసులను అమలు పరచాలని, పెన్షనర్లకు డి.ఆర్. చెల్లించాలని తదితర డిమాండ్లతో 2003 డిసెంబర్ 5న నల్ల బ్యాడ్జీలధారణ, లంచ్ అవర్ డిమాన్‌స్ట్రేషన్లు, డిసెంబర్ 18న జిల్లా కేంద్రాల్లో ధర్నాలు నిర్వహించబడినాయి.

ప్రభుత్వ ఉద్యోగి వ్యతిరేక విధానాలను వ్యతిరేకించడానికి ఉద్యోగులు సిద్ధంగా ఉన్నారు. కాని నాయకత్వం పట్టుదలగా పోరాట కార్యక్రమాలను రూపొందించడంలో విఫలమౌతున్నది.

## అఖిల భారత ఉద్యమం - STFI

జాతీయ స్థాయిలో విద్యారంగ సమస్యలపై జరగాల్సిన కృషిని గుర్తించిన మనం 1997 మార్చి 15,16 తేదీలలో, చెన్నైలో ఏర్పడిన కో ఆర్డినేషన్ కమిటీ ఆఫ్ స్కూల్ టీచర్స్ ఆర్గనైజేషన్స్ (సి.సి.ఎస్.టి.ఓ) లో భాగస్వామిగా చేరాము. సి.సి.ఎస్.టి.ఓ. ద్వితీయ సమ్మేళనం 2000 ఆగస్టు 11,12,13 తేదీల్లో కలకత్తా లో జరిగింది. యు,టి,ఎఫ్ పక్షాన 57 మందిమి పాల్గొన్నాము. దేశవ్యాప్తంగా 12 రాష్ట్రాలలోని 10 లక్షల ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం వహించే 15 సంఘాల ప్రతినిధులు పాల్గొన్నారు. ఆ సమ్మేళనం సి.సి.ఎస్.టి.ఓ.కు నిర్మాణ రూపం ఇచ్చి 'స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా' (ఎస్.టి.ఎఫ్.ఐ.)ని స్థాపించింది. అప్పటి మన సంఘం గౌరవాధ్యక్షులు కాII డి. రామిరెడ్డి ఎస్.టి.ఎఫ్.ఐ. తొలి జనరల్ సెక్రటరీగా, కె. జోజయ్య ఉపాధ్యక్షులుగా, కాII ఎన్. నారాయణ, కాII సిహెచ్. సుభాష్ చంద్రబోస్, కాII ఎం. సంయుక్త కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనారు. 2000 డిసెంబర్ 30,31 తేదీలలో విజయవాడలో ఎస్.టి.ఎఫ్.ఐ. కార్యవర్గ సమావేశం జరిగింది. ఆ సమావేశ నిర్ణయం మేరకు విద్యారంగంలో ముఖ్యమైన సమస్యల మెమోరాండమ్‌పై దేశవ్యాప్తంగా సంతకాలు సేకరించి 2001 మార్చి 15న భారత రాష్ట్రపతికి సమర్పించాము. మన రాష్ట్రంలో పదివేల సంతకాలు సేకరించి పంపాము. ఎస్.టి.ఎఫ్.ఐ. పిలుపు మేరకు 2000 అక్టోబర్ 30న పెట్రోల్ ధరల పెంపుకు నిరసనగా జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు, నవంబర్ 29న "అందరికీ విద్య"ను అందించాలని, విద్యను రాష్ట్ర జాబితాలో చేర్చాలని, విద్యను ప్రాథమిక హక్కుల్లో చేర్చాలని తదితర 12 డిమాండ్స్‌తో 2000 నవంబర్ 29న దేశవ్యాప్తంగా "డిమాండ్స్ డే"ను పాటించాము.

2001 జులై 25న జరిగిన అఖిల భారత ఉద్యోగుల సమ్మెకు మద్దతుగా ఎస్.టి.ఎఫ్.ఐ. పిలుపుమేరకు 50వేల కరపత్రాలు ముద్రించి జిల్లాల్లో పంపిణీ చేశాము. జులై 18న జరిగిన ప్రైవేటీకరణ వ్యతిరేక సదస్సులో పాల్గొన్నాం. సమ్మెరోజు బ్యాడ్జీలు ధరించాము. కేరళలో నెల రోజులకు పైగా సాగిన ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయుల సమ్మెకు సంఘీభావంగా ఎస్.టి.ఎఫ్.ఐ. పిలుపుమేరకు 2002 మార్చి 8,9 తేదీలలో జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు నిర్వహించాము. విద్యారంగంలో మతతత్వాన్ని వ్యతిరేకిస్తూ తిరుపతి, విజయవాడ, హైదరాబాద్‌లలో ప్రాంతీయ సదస్సులు నిర్వహించాము. 2002 ఫిబ్రవరిలో కేంద్ర మానవ వనరుల శాఖామంత్రికి కార్డుక్యాంపైన్ నిర్వహించాం. గుజరాత్‌లో జరిగిన మతోన్మాద మారణకాండకు నిరసనగా జులై 15న డివిజన్ కేంద్రాలలో ప్రదర్శలను నిర్వహించాము. సెప్టెంబర్ 26న జిల్లా, డివిజన్ కేంద్రాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజావ్యతిరేక విధానాలపై సదస్సులు జరపాలని పిలుపునివ్వగా మన రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలలో నిర్వహించగలిగాము. ఎస్.టి.ఎఫ్.ఐ. ద్వితీయ మహాసభల ప్రచారంలో భాగంగా 2003 జనవరి 31న రాష్ట్రవ్యాప్తంగా ఎస్.టి.ఎఫ్.ఐ. పతాకావిష్కరణలు జరిపాము.

## తమిళనాడు ఉద్యోగుల సమ్మె - సుప్రీంకోర్టు తీర్పు యు.టి.ఎఫ్. వైఖరి

తమిళనాడులో జయలలిత ప్రభుత్వం ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మికులు అనుభవిస్తున్న సౌకర్యాలను ఒక్కొక్కటిగా రద్దు చేసింది. డి.ఎ. ను నిలిపివేసింది. పెన్షన్‌లో కోతవిధించింది. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని 1:20 నుంచి 1: 40 కి పెంచింది. ఈ ఉద్యోగ వ్యతిరేక చర్యలను నిరసిస్తూ ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు ఐక్య కార్యాచరణ కమిటీగా ఏర్పడి అక్టోబర్ 23 నుండి సమ్మెకు పిలుపునిచ్చాయి. 70 శాతం ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. ప్రభుత్వం టెస్మా చట్టాన్ని ప్రకటించింది. 31-10-02 లోగా విధులకు హాజరుకాకుంటే తొలగిస్తామని బెదిరించింది. ఉద్యోగ సంఘాలు సమ్మె విరమించి ప్రభుత్వంతో అగ్రిమెంటు కుదుర్చుకున్నాయి. కాని ప్రభుత్వం తాను చేసుకున్న అగ్రిమెంటుకు భిన్నంగా 2003 మార్చి 19న కొన్ని జి.ఓ.లను జారి చేసింది. వాటి ప్రకారం:

- పూర్తి పెన్షన్‌కు గరిష్ట సర్వీసు 30 సం॥ నుండి 33 సం॥లకు పెంపుదల,
- చివరి నెల వేతనం బదులు 10 నెలల సగటు లెక్కింపు.
- ఇ.ఎల్. పరిమితి 300 రోజులు నుంచి 240 కి తగ్గింపు; పే, డి.ఎ. మాత్రమే చెల్లించాలని ఆదేశం.
- కమ్యూటేషన్ 40% నుండి 33 1/3% కు తగ్గింపు; కమ్యూటేషన్ విలువ లో 8% కోత.
- 1-1-96 నుండి చెల్లించాల్సిన పి.ఆర్.సి. అరియర్సు చెల్లించలేము. తదితర అంశాలున్నాయి.

ఇవి ఉద్యోగులలో అలజడిని సృష్టించాయి. రాష్ట్రంలోని దాదాపు 400 సంఘాలు కలిసి ఐక్య కార్యాచరణ కమిటీగా ఏర్పడి మార్చి 31 నుండి జూన్ వరకు దశలవారీ ఆందోళన నిర్వహించాయి. అనివార్యమైతే జులై 2 నుండి నిరవధిక సమ్మె చేస్తామని ప్రకటించాయి. ప్రభుత్వం జూన్ 30 రాత్రి నుండే ముఖ్య నాయకులు 2100 మందిని అరెస్టు చేయడంతో 1 రోజుముందే సమ్మె ప్రారంభమైంది. 2 వ తేదీకి 90% ఉద్యోగులు సమ్మెలోకి వచ్చారు. జులై 2,3 తేదీల్లో ఉద్యోగాల్లో లేనివారిని డిస్మిస్ చేసినట్లుగా భావించాలని జులై 4న ఆర్డినెన్సును తెచ్చింది. కొందరు ఉద్యోగులు అనాలోచితంగా హైకోర్టులో కేసు వేశారు. సమ్మె మానేసి ఉద్యోగాల్లో చేరమని, డిస్మిస్ చేయబడిన వారి విషయం ట్రిబ్యునల్‌లో పరిష్కరించుకోమని కోర్టు సలహాయిచ్చింది. అని వార్యంగా సుప్రీం కోర్టుకు వెళ్ళాల్సివచ్చింది. జులై 24న సుప్రీంకోర్టు మధ్యంతర తీర్పును ప్రకటిస్తూ సమ్మెను ఉక్కుపాదంతో అణచిన జయను అభినందించింది. కేసులున్నవారు మినహా మిగిలిన ఉద్యోగులలో క్షమాపణ వ్రాసిఇచ్చినవారిని ఉద్యోగాలలో చేర్చుకొమ్మని ఆదేశించింది. ఆగస్టు 6న యావత్‌దేశంలోని కార్మిక వర్గాన్ని నిశ్చేష్టపరుస్తూ సుప్రీంకోర్టు తన తుది తీర్పును ప్రకటించింది. ప్రభుత్వ ఉద్యోగులకు సమ్మె హక్కు రాజ్యాంగంలో ఎక్కడా పొందుపరచబడలేదని, రాజకీయ పార్టీలు, కార్మిక సంఘాల జోక్యంతో ఉద్యోగులు సమ్మెకు దిగడంవల్ల ప్రజాజీవనం ఇబ్బందుల పాలౌతున్నదని తదితర అభిప్రాయాలను ప్రకటించింది. సమ్మెను సమర్ధవంతంగా ఎదుర్కొన్న జయలలిత వైఖరిని ప్రశంసించింది. ఇంకా పలు అనుచితమైన వ్యాఖ్యలు కూడా చేసింది. ఈ తీర్పు ఉద్యోగులు , శ్రామికుల హక్కులను కాలరాచింది.

సుప్రీంకోర్టు తీర్పు పట్ల దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది. సరళీకరణ ప్రభావం కోర్టులపై కూడా పడిందని స్పష్టమైంది. ఈ తీర్పు వెలువడిన మరునాడే సి.పి.ఐ (ఎం), అఖిలభారత ప్రజాతంత్ర మహిళా సంఘం, సి.ఐ.టి.యు. ఢిల్లీలో కోర్టు ముందే ప్రదర్శన నిర్వహించి నిరసన తెలిపాయి. "సమ్మె హక్కును అవసరమైతే సమ్మె చేసైనా సాధిస్తా"మని సి.ఐ.టి.యు. ప్రకటించింది. ఉద్యోగ, కార్మిక సంఘాలన్నీ సమ్మె హక్కు సాధన కొరకు సమాయత్తమౌతున్నాయి. యు.టి.ఎఫ్ కూడా సి.ఐ.టి.యు, ఇతర ఉద్యోగ సంఘాలతో కలిసి, విడిగాను సమ్మె హక్కు పై సుప్రీంతీర్పును వ్యతిరేకిస్తూ సెమినార్లు నిర్వహించింది. మండల, ప్రాంతీయ, జిల్లా మహాసభల సందర్భంగా జరిగిన సెమినార్లలో ఈ అంశంపై చర్చ నిర్వహించి ఉపాధ్యాయులను చైతన్య పరచింది. సుప్రీం కోర్టు తీర్పును సమీక్షించాలని, సమ్మె హక్కును రాజ్యాంగ బద్ధం చేయాలని డిమాండ్ చేసింది.

### తమిళనాడు ఉద్యోగులకు సహాయం

తమిళనాడు ఉద్యోగుల సమ్మె సందర్భంగా అరెస్టుకాబడి, ఉద్యోగాలు కోల్పోయిన వేలాదిమంది ఉద్యోగుల కుటుంబాలను ఆదుకోవటం కోసం ఎస్.టి.ఎఫ్.ఐ. పిలుపు మేరకు మన రాష్ట్రంలో మన వంతు కర్తవ్యంగా ప్రతిసభ్యుడు రు 5/- లు విరాళం ఇవ్వాలని పిలుపునిచ్చాము. లక్షరూపాయిలు సహాయం అందించాం.

### సామాజిక కర్తవ్యం

2000 మేలో కరువు పీడిత ప్రాంతాలను ఆదుకోవడానికి లక్షరూపాయల విరాళాలు సేకరించి మహబూబ్ నగర్, రంగారెడ్డి, అనంతపురం జిల్లాల్లోని 5 గ్రామాలలో అంబలి కేంద్రాలను నిర్వహించాము. అదేవిధంగా 2000 సం॥లో బెంగాల్ వరద బాధితుల సహాయార్థం రూ.10 వేలు, మరియు గుజరాత్ భూకంప బాధితుల సహాయార్థం రూ. 10 వేలు విరాళాలు సేకరించి పంపాము.

## సభలు - సమావేశాలు

**యుటియఫ్ వ్యవస్థాపక దినోత్సవం:-** మన సంఘం ఆవిర్భావ దినోత్సవాన్ని పురస్కరించుకొని ప్రతియేటా అగస్టు 10న సంఘకార్యాలయాలు, జిల్లా డివిజన్ కేంద్రాలలో ఉద్యమ పతాకాలను ఆవిష్కరించి, సదస్సులు, సమావేశాలు జరపాలని పిలుపునిచ్చాము. అన్ని జిల్లా కేంద్రాల్లో పతాకావిష్కరణలు చేస్తున్నారు. సదస్సులు నిర్వహిస్తున్నారు. కొన్ని జిల్లాల్లో మండల స్థాయిలో సైతం జండా పండుగ నిర్వహించటం ముదావహం. ఈ సంప్రదాయాన్ని కొనసాగించాలని కోరుతున్నాము.

### గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల సదస్సు

గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల సర్వీసు రూల్స్ సాధనకోసం దశాబ్దకాలంగా చేస్తున్న కృషిలో భాగంగా 2000 జులై 10న హైదరాబాద్‌లో గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల రాష్ట్ర సదస్సును ఏర్పాటు చేశాము. గిరిజన సంక్షేమ శాఖ మంత్రి మణికుమారి ముఖ్య అతిధిగా హాజరయ్యారు. అన్ని జిల్లాల ఐ.టి.డి.ఎ. ల నుండి 200 మంది పాల్గొన్నారు. సర్వీసురూల్స్, ఇతర ముఖ్యమైన సమస్యలపై మంత్రికి మెమోరాండం సమర్పించాము.

### సింగరేణి టీచర్ల సదస్సు

సింగరేణి కాలరీస్ యజమాన్యంలోని ఉపాధ్యాయులెదుర్కొంటున్న సమస్యలను చర్చించి పోరాట కార్యక్రమాన్ని రూపొందించటం కోసం 2000 సెప్టెంబర్ 3న కొత్తగూడెంలో ప్రత్యేక సదస్సును నిర్వహించాము. 600మంది ఉపాధ్యాయులు హాజరైనారు. ఉపాధ్యాయులంతా సంఘటితంగా తమ సమస్యలపై ఉద్యమానికి సమాయత్తమవుతుండగా, యాజమాన్యం ఎడ్యుకేషనల్ సొసైటీని ఏర్పాటుచేసి పాఠశాలల నిర్వహణను సొసైటీకి అప్పగించింది. సొసైటీ కార్యదర్శి దుందుడుకుగా వ్యవహరించి ఉపాధ్యాయులనుభవిస్తున్న

సౌకర్యాలలో కోత విధించడంతో ఉపాధ్యాయులు ఆందోళన చెంది నిరవధిక సమ్మెకు పూనుకోవాల్సి వచ్చింది. 21రోజుల సమ్మె చేసి పాక్షికంగా విజయం సాధించారు.

## తెలంగాణా జిల్లాల వర్క్‌షాప్

2000 జులై 2,3 తేదిలలో హైదరాబాద్‌లో తెలంగాణా జిల్లాల కార్యదర్శివర్గ సభ్యులు, ఆహ్వానితుల వర్క్‌షాప్ జరిగింది. 120 మంది హాజరైనారు. తెలంగాణా ప్రాంతంలో బలహీనంగా ఉన్న జిల్లాలలో ఉద్యమ పరిస్థితిని చర్చించి అభివృద్ధికి అవసరమైన కార్యాచరణ ప్రణాళికను రూపొందించుకున్నాము. కాని తరువాతికాలంలో ఫాలోఅప్ తగినంతగా వేయలేకపోయాము.

## ఎయిడెడ్ టీచర్ల సదస్సు

2003 జనవరి 19న రాజమండ్రిలో జరిగిన సదస్సుకు 18 జిల్లాల నుండి 696 మంది ప్రతినిధులు హాజరైనారు. ఎయిడెడ్ పాఠశాలలు, ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యలపై విపులంగా చర్చించారు. "ఎయిడెడ్ పాఠశాలలన్నింటినీ ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి"నే తీర్మానాన్ని ఆమోదించారు. అనంతరం రాజమండ్రి పట్టణంలో పెద్దర్యాలీ నిర్వహించారు. ఆ సదస్సు తీర్మానం మేరకు 1755 మంది సంతకాలతో కూడిన 607 మెమోరాండమ్ కాపీలను అసెంబ్లీ స్పీకర్ ద్వారా రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించాము.

## మున్సిపల్ టీచర్ల సదస్సు

2003 మార్చి 8న గుంటూరులో జరిగిన ఈ సదస్సులో 680 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. ఎస్.టి.ఎఫ్.ఐ. నాయకులు డి.రామిరెడ్డి, మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ ఆర్.జె.డి.రంగా చారి, ఎమ్.జె. మాణిక్యారావు తదితరులు అతిథులుగా హాజరైనారు. విధాన పత్రం ప్రకటించబడింది. 35 సమస్యలపై తీర్మానాలను ఆమోదించారు. మూడు దశల పోరాట కార్యక్రమాన్ని నిర్ణయించుకున్నాము. 1063 మంది సంతకాలతో మెమోరాండం కాపీలను ఏప్రిల్ 21న ప్రభుత్వానికి అందించాము.

## మహిళా కార్యకర్తల ఉద్యమ తరగతులు

మహిళా కార్యకర్తలలో ఉద్యమ చైతన్యాన్ని పెంచి నాయకత్వ స్థాయిని అభివృద్ధి పరచటం కోసం 2002 డిసెంబరు 14,15 తేదీలలో ఖమ్మంలో రాష్ట్ర మహిళా కార్యకర్తల శిక్షణా తరగతులు నిర్వహించాము. 13 జిల్లాల నుండి 152 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. మన సంఘ గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి ప్రారంభించగా, సి.ఐ.టి.యు. జాతీయ కార్యదర్శి డా॥ కె. హేమలత ప్రధానోపన్యాసం చేశారు. ఖమ్మం మున్సిపల్ చైర్‌పర్సన్ డా॥ నాగమల్లిక ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. సర్వీసు విషయాలపై రాష్ట్ర కార్యదర్శి కె.వెంకట్రావు, సంఘ నిర్మాణంపై రాష్ట్ర ప్రధాన కార్యదర్శి యన్. నారాయణ ప్రసంగించారు. సాయంత్రం పట్టణంలో ప్రదర్శన నిర్వహించారు. అనంతరం జరిగిన బహిరంగ సభలో సీఫెల్ ప్రొఫెసర్ సోనియా గుప్తా, అఖిల భారత ప్రజతంత్ర మహిళా సంఘం (ఐద్వా) రాష్ట్ర అధ్యక్షులు పుణ్యవతి తదితరులు మాట్లాడారు. మన సంఘ రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త, కార్యదర్శి సి. కమల కుమారి నాయకత్వంలో జరిగిన ఈ తరగతులు మహిళా కార్యకర్తలకు మంచి స్ఫూర్తిని కల్గించాయి.

## ఉద్యమ తరగతులు

కార్యకర్తలకు నిరంతరం శిక్షణనిస్తూ ఉద్యమం పట్ల, ఉపాధ్యాయ సమస్యలపట్ల అవగాహన కల్పించడం, నాయకత్వ స్థాయిని అభివృద్ధి పరచడం కోసం ఉద్యమ తరగతులు, నాయకత్వ శిక్షణా శిబిరాలు వివిధస్థాయిల్లో తరచుగా నిర్వహిస్తున్నాము. 2001 సం॥లో ప్రకాశం, నెల్లూరు జిల్లాల్లో మూడు రోజులు, కృష్ణ తూర్పు గోదావరి, కర్నూలు, గుంటూరు, విజయనగరం, విశాఖ జిల్లాల్లో రెండు రోజులు, 2002సం॥లో ఖమ్మం, రంగారెడ్డి, విజయనగరం జిల్లాల్లోను, 2003 సం॥లో విజయనగరం, శ్రీకాకుళం, ఖమ్మం, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో ఉద్యమ తరగతులు జరిగాయి. సగటున 150 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. ఏప్రిల్ నెలలో ఖమ్మం జిల్లాలో 12 కేంద్రాలలో ఒక రోజు ప్రాంతీయ ఉద్యమ తరగతులు నిర్వహించి 450 మంది కార్యకర్తలకు శిక్షణయిచ్చారు. ఈ క్లాసులలో ఉద్యమ చరిత్ర, విద్యారంగంలో పరిణామాలు, లీవ్ రూల్స్ తదితర అంశాలు బోధించబడ్డాయి.

## హెడ్మాష్టర్లు, ఎమ్.ఇ.ఓ.లకు శిక్షణ

జి.ఒ ఎమ్.ఎస్. నెం. 40 తేది 7-5-2002 ద్వారా ఉపాధ్యాయుల సర్వీసు సమస్యలు పరిష్కరించే అధికారాలు ఎమ్.ఇ.ఓ. లకు హైస్కూలు హెడ్మాస్టర్లకు బదలాయించబడినాయి. హెడ్మాస్టర్లు, ఎమ్.ఇ.ఓ. లకు ఆవిషయాలపై అవగాహన కల్పించడం కోసం జిల్లాల వారీగా శిక్షణా తరగతులు నిర్వహించాలని పిలుపునిచ్చాము. పాఠశాల విద్యాశాఖ ఆన్ డ్యూటీ సౌకర్యం కూడా కల్పించింది. ఆదిలాబాద్, ప్రకాశం, తూ॥గో॥, ప॥గో॥, నెల్లూరు, గుంటూరు, చిత్తూరు జిల్లాల్లో క్లాసులు జయప్రదంగా జరిగాయి. సగటున 250 మంది పాల్గొన్నారు. మన ప్రతిష్ఠ పెంపుదలకు ఈ తరగతులు ఉపయోగపడ్డాయి. అన్ని జిల్లాలు వీటిని నిర్వహించలేకపోవడం లోపమే.

## పతాక జాతాలు

గత మహాసభలు జరిగిన 8 ప్రదేశాలనుండి ఆయా జిల్లాల నాయకులు ఉద్యమ పతాకాలను తీసుకొని జాతాలు నిర్వహిస్తూ 9వ మహాసభకు హాజరుకావాలని పిలుపునిచ్చాము.

ఉత్సాహవంతులైన కార్యకర్తలు ద్విచక్ర వాహనాలు, జీపులు, కార్లతో జాతాలను నిర్వహిస్తున్నారు. అన్ని జాతాలు డిసెంబర్ 26న బయలుదేరి, మార్గ మధ్యంలో మహాసభల ప్రచారం నిర్వహిస్తూ 27 సాయంత్రానికి హైదరాబాద్ చేరుకొన్నాయి. ఆ రాత్రి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో బసచేసి 28 ఉదయం ర్యాలీగా మహాసభల ప్రాంగణానికి విచ్చేసి 9వ మహాసభ పతాక వందనం సందర్భంగా 8 పతాకాలను నాయకులకు అందజేశారు.

# మన ప్రాతినిధ్యాలు-ఫలితాలు

## అన్ ట్రైన్డ్ టీచర్లు, స్పెషల్ విద్యావాలంటీర్లకు ట్రైనింగ్

గత సంవత్సరం మనం నిర్వహించిన ఉద్యమం ఫలితంగా డి.ఎస్.సి 2002 సెలెక్టెడ్ అన్‌ట్రైన్డ్ అభ్యర్థులను స్పెషల్ విద్యావాలంటీర్లు గా నియమించి జూలైలో కౌన్సిలింగ్ జరిపి పాఠశాలలకు కేటాయించారు. వారికి, అదే విధంగా 2000, 2001 డి.ఎస్.సి. ల ద్వారా నియమింపబడిన అన్‌ట్రైన్డ్ టీచర్లకు కూడా ట్రైనింగ్ అవకాశం కల్పించాలని మనం చేసిన నిరంతర ప్రాతినిధ్యాల మేరకు రాష్ట్ర ప్రభుత్వం దూరవిద్య ద్వారా డి.ఇడి. శిక్షణ ఇవ్వడానికి ఏర్పాటు చేసింది. కాని 6వేల రూపాయలు ఫీజు చెల్లించాలనటం దారుణంగా వుంది. అప్రెంటిస్ గా నియమింపబడిన అన్‌ట్రైన్డ్ టీచర్లకు 2 సం॥ సర్వీసు పూర్తి కాగానే ట్రైనింగ్‌తో నిమిత్తం లేకుండా స్కేలు మంజూరు ఉత్తర్వులు ఇప్పించాము.

స్పెషల్ విద్యావాలంటీర్లను డి.యిడి. ట్రైనింగ్ అయిన వెంటనే రెగ్యులర్ టీచర్లుగా నియమించాలని ప్రాతినిధ్యం చేస్తున్నాము. అన్‌ట్రైన్డ్ స్కూల్ అసిస్టెంట్లు, పండిట్లు, పి.యి.టి.లకు రెగ్యులర్ ట్రైనింగ్ కళాశాలల్లో సీట్లు కేటాయించి ట్రైనింగ్‌కు డిప్యూట్ చేస్తామని ప్రభుత్వం జి.ఓ.756 తేది. 14.6.2003

విడుదల చేసింది. గిరిజన విద్యా వికాస కేంద్రాలలో యస్.యస్.సి. అర్హతలతో నియమించబడిన ఉపాధ్యాయులకు శిక్షణకై కృషి చేస్తున్నాము.

## సంపాదిత సెలవు

2003 వేసవి లో డి.పి.యి.పి. రాష్ట్ర వ్యాపితంగా ప్రాధమిక, ప్రాధమికోన్నత పాఠశాలల ఉపాధ్యాయులకు 5 రోజుల పాటు నిర్వహించిన గుణాత్మక విద్య (క్యు.ఐ.పి.) శిక్షణాతరగతులకు హాజరైన ఉపాధ్యాయులకు దామాషా సంపాదిత సెలవు మన ప్రాతినిధ్యం మేరకు మంజూరు చేయబడింది.

## కామన్ సర్వీస్ రూల్స్ - హైకోర్టు తీర్పు

ప్రభుత్వ, పంచాయతీ రాజ్ ఉపాధ్యాయులు ఉమ్మడి సర్వీసు రూల్సు కోసం రెండు దశాబ్దాలు పోరాడి 1998 లో 505, 538 జి.ఓ. లను సాధించుకున్నారు. మే 2000 నుండి ఈ జి.ఓ. లు అమలు జరుప బడుతున్నాయి. ఉభయులకూ ప్రయోజనం కలిగింది. అయితే కొన్ని సాంకేతిక కారణాలను చూపి హైకోర్టు ఈ జీ.ఓ.లు చెల్లవని 2003 సెప్టెంబర్ 18న తీర్పు చెప్పింది. దీనితో ఉపాధ్యాయుల సర్వీసు వ్యవహారాలలో సంక్షోభం ఏర్పడింది. సుప్రీం కోర్టుకు వెళ్ళి స్టే తీసుకోవడం ద్వారా సంక్షోభ నివారణకు ప్రయత్నించాలని మనం చొరవ చేసి అన్ని సంఘాలను ఉమ్మడి కార్యాచరణకు సిద్ధం చేశాము. ప్రభుత్వానికి ప్రాతినిధ్యం చేసి ఒప్పించాము. సంఘాల తరపున 'ఏ.పి. టీచర్స్ లీగల్ స్ట్రగుల్ కమిటీ'ని ఏర్పాటు చేసి కె. జోజయ్య, బి.మోహన్ రెడ్డి, ఎ. అనంతరాములు, ఏ. నర్సింహారెడ్డి ల పేరుతో బ్యాంకులో జాయింట్ అకౌంటును ప్రారంభించాము. న్యాయపోరాటానికి అయ్యేఖర్చును సంఘాలు తమ సభ్యుల నుండి సేకరించాలని నిర్ణయించాయి. ఆ మేరకు మనం కూడా ఉపాధ్యాయుల నుండి న్యాయపోరాటనిధి వసూలు చేశాము. నవంబర్ 7న సుప్రీం కోర్టులో కేసు ఫైల్ చేయడానికి సిద్ధమైనాము. ఈ లోగా రాష్ట్ర మంత్రి వర్గం విద్యను స్థానిక సంస్థలకు అప్పగించాలని నిర్ణయించడంతో 505, 538 జీ.ఓ. ల అస్తిత్వంతో పని లేకుండా పోయింది. న్యాయపోరాటాన్ని విరమించుకోవాలని సంఘాలు నిర్ణయించాయి. నవంబర్ 14న జరిగిన మన సంఘం రాష్ట్ర కార్యవర్గం ఈ పరిస్థితినంతా సమీక్షించి సుప్రీంకోర్టుకు వెళ్ళడం లేదు కనుక న్యాయపోరాటనిధి వాపస్ ఇవ్వాలని సంచలనాత్మకమైన నిర్ణయంతీసుకున్నది. ఈ నిర్ణయం పట్ల ఉపాధ్యాయులలో సర్వత్రా హర్షం వ్యక్తం కాగా తోటి సంఘాలు ఇరుకున పడ్డాయి. వాటి నాయకులు జిల్లాల్లో మన పై విమర్శలకు, దూషణలకు సైతం పాల్పడ్డారు.

## స్థానిక సంస్థలకు విద్య

రాజ్యాంగం 73,74 సవరణల ప్రకారం పాఠశాలల విద్యా నిర్వహణను స్థానిక సంస్థలకు అప్పగించాలని రాష్ట్ర మంత్రి వర్గం నిర్ణయించింది. అందుకు మనం వ్యతిరేకం కాదు. అయితే ప్రభుత్వ, గిరిజన సంక్షేమ, జిల్లా పరిషత్, మండల పరిషత్, మున్సిపల్ టీచర్లు అందరూ స్థానిక సంస్థల పరిధిలోకి వస్తున్నందున, సర్వీసు విషయాలలో ఎవరికీ నష్టం జరగకుండా చూడాల్సి వున్నది. అందుకు మనం చూపుతున్న పరిష్కారాలు:

1) మున్సిపల్ టీచర్ల సర్వీసులను ప్రొవిన్షియలైజ్ చేయాలి.
2) అందరికీ నియామకపు అధికారిగా డి.ఇ.ఓ. వుండాలి.
3) రిక్రూట్‌మెంట్. బదిలీలు, ప్రమోషన్స్‌లో కౌన్సిలింగ్ విధానం కొనసాగించాలి.
4) అందరికీ 010 హెడ్ క్రిందనే జీత భత్యాలు చెల్లించాలి.
5) జి.వి.వి.కె. లను ప్రాధమిక పాఠశాలలుగా అప్‌గ్రేడ్ చేయాలి.
6) ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి సమగ్రమైన సర్వీస్ రూల్స్‌ను రూపొందించాలి.

పై సూచనలన్నింటినీ పాటించే విధంగా ప్రభుత్వం పై వత్తిడి తేవడానికి ఉద్యమించాలి.

## అంతర్ జిల్లా బదిలీలు

గత 2 సం॥ లుగా మనం స్వతంత్రంగాను, ఇతర సంఘాలతోను కలిసి ప్రాతినిధ్యాలు చేశాము. ఉద్యమాలు నిర్వహించాము. ఎట్టకేలకు ప్రభుత్వం పరిమిత బదిలీలకు అనుమతి నిచ్చింది. పరస్పర బదిలీలు, వితంతు బదిలీలకు అనుమతినిచ్చింది. పరస్పర బదిలీలు, వితంతువులు, ఉద్యోగులైన, దంపతులకు మాత్రమే ఆన్‌లైన్ లో దరఖాస్తు చేసుకొనే అవకాశం ఇచ్చింది. 610 జీ.ఓ. మరియు ఆరు సూత్రాల పధకానికి లోబడి అవకాశం ఉన్న వారందరినీ బదిలీ చేయాలని మనం కోరుతున్నాము. ఉద్యోగులైన దంపతుల విషయంలో ఎయిడెడ్ వారిని విస్మరించడం, స్థానిక సంస్థలకు చివరి ప్రాధాన్యత కల్పించటం సరి కాదని, సవరించాలని ప్రాతినిధ్యం జరిపాము.

## ట్రైబల్ వెల్ఫేర్ ఉపాధ్యాయుల సర్వీసు రూల్సు

గిరిజన సంక్షేమ శాఖ ఉపాధ్యాయుల సర్వీసు రూల్స్ జీ.ఓ. వెలువడటానికి రంగం సిద్ధమైంది. గత 10 సంవత్సరాల మన కృషి ఫలించనున్నది. అయితే స్థానిక సంస్థలకు అప్పగించే పాఠశాలల్లో గిరిజన సంక్షేమ పాఠశాలలూ వున్నందున, ఆ జీ.ఓ. కూడా నిరుపయోగమయ్యే పరిస్థితి వున్నది. ఈ అన్ని పరిణామాలనూ నిశితంగా పరిశీలించాల్సి వున్నది.

## బోధనేతర బాధ్యతలు

ఉపాధ్యాయులను 'పాఠాలు చెప్పనివ్వండంటూ మనం ఎన్ని ఉద్యమాలు నిర్వహించినా రాష్ట్ర స్థాయిలో జి.ఓ. యిచ్చినా ఫలితం ఉండటం లేదు. జిల్లా స్థాయిలో బోధనేతర పనులకు ఉపాధ్యాయులను వినియోగిస్తున్నారు. ఇటీవల తాజాగా జన్మభూమి, యస్.యస్.ఐ.డి. తదితర కార్యక్రమాలను ఉపాధ్యాయులకు అప్పగిస్తుండడంతో మనం ప్రభుత్వానికి ప్రాతినిధ్యం చేశాము. తాజాగా రాష్ట్ర విద్యాశాఖ బోధనేతర పనులు ఉపాధ్యాయులకు అప్పగించవద్దంటూ మరో ఉత్తర్వు జారీ చేసింది.

## స్పెషల్ టీచర్లు - టైం స్కేలు

1989 డి.యస్.సి. లో మిగిలిపోయిన 912 మంది స్పెషల్ టీచర్లలో కోర్టు తీర్పు మేరకు 681 మందిని 2002 జనవరిలో ఉద్యోగాలలో నియమించారు. అయితే వారికి కూడా రెండేళ్ల అప్రెంటిస్ నిబంధన విధించింది. ఈ నిబంధన సరికాదని స్పెషల్ టీచర్సు అసోసియేషన్ చేసిన ప్రాతినిధ్యం మేరకు వారిని 2002 జనవరి నుండి రెగ్యులర్ యస్.జి.టి. లుగా పరిగణించాలంటూ ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది.

## కోర్టు తీర్పులు

* ప్రమోషన్ ఉత్తర్వులనుసడలిస్తూ జి.ఓ. 49 ని సవరిస్తూ ఇవ్వబడిన జీ.ఓ. 71 ని ట్రిబ్యునల్ కొట్టివేసింది.
* 1991 వేసవిలో పార్లమెంట్ ఎన్నికల విధుల కోసంహెడ్ క్వార్టర్లు వదలరాదని కలెక్టర్లు ఆదేశించినందున ఆ ఉపాధ్యాయులకు సంపాదిత

సెలవు ప్రిజర్వు చేయాలని కోర్టు తీర్పు చెప్పింది. రాష్ట్ర వ్యాప్తంగా ఆ నాటికి సర్వీసులో గల రెగ్యులర్ ఉపాధ్యాయులంతా కోర్టుకు పోతున్నారు. ఈ తీర్పులను జనరలైజ్ చేసి అందరికీ వర్తింపచేయాలని ప్రాతినిధ్యం చేశాము.

* అప్‌గ్రేడెడ్ పండిట్స్ సీనియారిటీని 10.8.83 (అప్‌గ్రేడేషన్ తేదీ) నుండి లెక్కించాలని తీర్పు వచ్చింది. దానిని అమలు పరుస్తూ సి.& డి.యస్.ఇ. ఉత్తర్వులు యిచ్చారు.
* పండితుల అప్‌గ్రేడేషన్ జీ.ఓ. 176 ను హైకోర్టు కొట్టివేసింది. జీ.ఓ. 30 ని సవరిస్తూ అందులో కటాఫ్ డేట్ వుండటం సరైంది కాదని , అందువల్ల గ్రేడ్-I అర్హతలు గల్గిన గ్రేడ్-II పండితులందరికీ గ్రేడ్-I స్కేలు ఇవ్వాలని తీర్పునిచ్చింది. ప్రభుత్వం లోగడ అంగీకరించిన విధంగా ఈ తీర్పును సామాన్యీకరించి అందరికీ వర్తింపజేస్తూ జీ.ఓ. ఇవ్వాలని ప్రాతినిధ్యం జరిపాము.

## సాధించిన ప్రగతి

రజతోత్సవాల నుండి నేటి వరకు చేసిన బహుముఖ కార్యక్రమాలు, ఆందోళన- పోరాటాలు, ఐక్య ఉద్యమాల ఫలితంగా మన సంఘం గణనీయమైన ప్రగతిని సాధించింది. సంఘ సభ్యత్వం 87,500 నుండి లక్షకు పైగా పెరిగింది. మన స్వతంత్ర కార్యాచరణకు తోడు ఐక్య ఉద్యమాలకు నాయకత్వం వహించే అవకాశం లభించింది. మన సంఘం చొరవతో ప్రభుత్వ విధానాలను ఎదుర్కొనే ప్రతిఘటనా ఉద్యమాల తీవ్రత పెరిగింది. ఉపాధ్యాయుల నియామకాలు, బదిలీలు, ప్రమోషన్ల ప్రక్రియలలో ప్రజాస్వామ్య పద్ధతులను పాటించటానికి మనం చేసిన కృషి మంచి ఫలితాలను యిచ్చింది. ప్రభుత్వ అక్రమ బదిలీలను, అక్రమ డెప్యుటేషన్లను ఎదుర్కోవడంతో మన సంఘానికి మంచి గుర్తింపు లభించింది. ఎయిడెడ్, మున్సిపల్, గిరిజన మేనేజ్‌మెంట్ల ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారం కోసం ప్రత్యేకమైన కృషి చేయడం జరిగింది. సామాజిక కార్యక్రమాలు, అఖిల భారత ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణం, సంఘీభావ కార్యక్రమాల్లో పాల్గొనడం విస్తృతంగా జరిగింది. పాఠశాల విద్యారంగంలో వస్తున్న పరిణామాలపై వెంటవెంటనే స్పందించడం, పరిష్కార మార్గాలు ప్రతిపాదించడం జరిగింది. అప్రెంటిస్ కాలాన్ని తగ్గించడానికి, అన్‌ట్రెన్డ్ ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి మన సంఘం విశేష కృషి చేసింది. వివిధ కార్యక్రమాలకు, ఉద్యమాలకు ఉపాధ్యాయులను సమీకరించగల శక్తి గణనీయంగా జరిగింది. ప్రసార మాధ్యమాలలో మన ప్రతిష్ఠ బాగా పెరిగింది. ఆడిట్ కమిటీ పని విధానం బాగా మెరుగయ్యింది.

కాగా ఈ కాలంలో నిర్మాణ సమస్యలను ఎక్కువగా ఎదుర్కోవలసి వచ్చింది. ఆర్థిక క్రమశిక్షణను అమలు జరుపటానికి ఎక్కువగా కేంద్రీకరించాల్సి వస్తున్నది. వెనుకబడిన జిల్లాల్లో ఉద్యమ విస్తరణ కోసం చేసిన కృషి పరిమితమైన ఫలితాలను మాత్రమే సాధించింది. ఉద్యమం పెరుగుదల, పెరుగుతున్న పలుకుబడికి తగిన విధంగా నిర్మాణ సౌష్ఠవాన్ని మెరుగుపరచుకోవలసి ఉన్నది.

జిల్లా శాఖలు చేసిన ఉద్యమ కృషి, నిర్మాణ పరిస్థితులకు సంబంధించిన సమీక్షలను కూడా జతపరచి, మీ సూచనలు, సలహాలు అందించి ఈ నివేదికను మరింత పరిపుష్టం చేయాలని కోరుతున్నాము.

## నీమాట - మాయ మాటల మూట

హైటక్కు తెలుగురేడు - నీకిదే వీడుకోలు
ప్రజలంత గోడుగోడు - దిగిపోతె మేలు మేలు
డియ్యేలు యివ్వకుండ - దిగులెంతో పెట్టినావు
మా జోలి రాకురాకు - మర్యాద కాదు నీకు

॥ హైటెక్కు ॥

దౌర్భగ్య ప్రభుతమీది డియ్యేలు ఆపినాది
ముసలోళ్ళ ఉసురు తగిలి - మొదలంట పోతవయ్య
ఉద్యోగ రంగమంత ప్రైవేటు పరము జేయ
ఉపాధి హక్కుకేమె - అపాయమొచ్చినాది

॥ హైటెక్కు ॥

నక్సల్సు దాడిజేస్తె - యెలక్షన్సు పెట్టుతావు
అన్నాలు దోస్తులంటూ - కాంగ్రెసును తిట్టుతావు
కరువొచ్చి రైతు లేమో - ప్రాణాలు తీసికొంటె
పరిహారమివ్వకుండా - పరిహాసమాడుతావు

॥ హైటెక్కు ॥

పోలీసు బలగమంతా - మంత్రూలకావు కొరకు
ఊరూర దోపిడీలు - ఘోరంగా జరుగు చుండె
కోటి వరములంచు - దీటూగ పల్కావు
పన్నూలు పెంచి నీవు - ప్రజలాను ముంచినావు

॥ హైటెక్కు ॥

కలకటేర్లను పిలిచి - కాని పనులూ చెప్పి
గొంతుచించుకోనీ - గంతూలేస్తావయ్యా
గాలిమోటరెక్కి - గ్రామాలు తిరిగేవు
మాటాలమూటలిచ్చి - మందీని ముంచినావు

॥ హైటెక్కు ॥

నకిలీల విత్తనాలు - వ్యవసాయమంత పాడు
పత్తిరైతూ గోడు - పట్టింది వల్ల కాదూ
కోట్లాది కోట్ల అప్పు - కొనివచ్చినావు నీవు
తమ వారికెల్ల పంచి - తైతక్కలాడుతావు

॥ హైటెక్కు ॥

కరంటు చార్జీలన్నీ - కఠినంగ పెంచినావు
సామాన్య జనాలంతా - మాన్యాలు పట్టినారు
తారకారా ముడికి - తద్దినము పెట్టావు
గద్దెను దించినావు - గంగాలో కలిపినావు

॥ హైటెక్కు ॥

సారాయి కొట్లు తెరిచి - సంతోషపడ్డవండి
సామాన్య ప్రజాలాకు - రోగాలు పంచినావు

॥ హైటెక్కు ॥

నగరాన-నడిబొడ్లో-నలుగుర్ని చంపావు
లాఠీతో బాదిబాది - నడుమంత విఱగగొట్టి
బందూకు గుండ్లతోటి గుండెల్లోకాలన్నావు...
ఆకలీ చావులకు - లోకులూ చస్తుంటె
స్వర్ణాంధ్ర యిదియంచు - సోదిచెప్పుతావు

॥ హైటెక్కు ॥

సర్వజనులొక్కలై - సచ్చెట్టు ఉతికి బాది
ఆరేసి మడత బెట్టి - అంగట్లో అమ్మతారు

॥ హైటెక్కు ॥

- జనకు ఉమ్మా నారాయణ రెడ్డి హైదరాబాదు.

# "ఐక్య ఉపాధ్యాయ" పత్రిక నివేదిక

## (జనవరి 2000-డిసెంబర్ 2003)

- డి. రామిరెడ్డి, Ex.M.L.C.,
ప్రధానసంపాదకులు



**కా**కినాడలో జరిగిన రజతోత్సవాలలో ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకునిగా కీ.శే. అప్పారి వెంకటస్వామి గారు బాధ్యతలు స్వీకరించారు. ఎవరు పత్రికా సంపాదకులుగా ఉన్నా ప్రారంభంనుండి పత్రికా నిర్వహణ బాధ్యత వారే చూస్తున్నారు కాబట్టి వారు ప్రధానసంపాదకునిగా బాధ్యతలు చేపట్టిన తర్వాత పత్రికను తీర్చిదిద్దడానికి ప్రయత్నించారు. అయితే హైదరాబాదులో సిబ్బంది క్రొత్త వారు కావడం, కంప్యూటరు వ్యవస్థ పరిపూర్ణంగా లేక పోవడం, ప్రింటింగు, పోస్టింగులో ఏర్పడిన యిబ్బందుల వల్ల పత్రికానిర్వహణ అనేక ఒడుదుడుకులను ఎదుర్కొన్నది. పత్రిక పని గాడిలో పడుతున్న దశలో 2001 జనవరిలో అకస్మాత్తుగ వారు అనారోగ్యం పాలై 2 నెలలు మృత్యువుతో పోరాడి తేది. 21.3.2001 మరణించారు. ఆ తర్వాత 2 నెలలు శ్రీ కె. జోజయ్య గారు ప్రధానసంపాదక బాధ్యతలు నిర్వహించారు. 2001 ఏప్రిల్‌లో జరిగిన రాష్ట్ర కౌన్సిలులో డి. రామిరెడ్డి గారిని ప్రధాన సంపాదకునిగా ఎన్నుకున్నారు. అప్పటి నుండి యిప్పటి వరకు వారే ప్రధాన సంపాదకులుగా కొనసాగుతున్నారు.

ఈ 4 సం॥కాలంలో పత్రిక సర్క్యులేషన్‌లో స్తబ్ధత వచ్చింది. సర్క్యులేషన్ పెరగడం లేదు; తరగడం లేదు. 18 సం॥లు పూర్తయిన జీవిత చందాలను రద్దు చేయడంవల్ల ఆ మేరకు సహజంగానే కొంత సర్క్యులేషన్ తగ్గుతుంది. మన సంఘ సభ్యత్వం పెరిగే కొద్దీ పత్రిక సర్క్యులేషన్ పెరగాలి. నెల్లూరు జిల్లాలో యుటిఎఫ్ సభ్యులు - ఐక్య ఉపాధ్యాయ పత్రిక నిష్పత్తి 2:1 గా ఉంది. పెద్ద జిల్లాలలో ఈ నిష్పత్తి 3:1; 4:1గా ఉంది. పత్రిక రూపంలో కొన్ని మార్పులు చేశాం. అట్ట డిజైన్‌ను శాశ్వతంగా ఉంచక ఏ నెలకానెల అవసరాన్ని బట్టి మార్చుతున్నాం. ప్రతినెల అట్టమీద కార్టూను తప్పక వేయాలనే నియమాన్ని మార్చాం. అవసరాన్ని బట్టి పోరాట ఫోటోలు, కార్టూన్లు, ప్రముఖుల ఫోటోలు వేస్తున్నాం. సంపాదకీయాలు ఆ నెలలో ఉన్న రాజకీయ ప్రాముఖ్యాన్ని బట్టి వ్రాస్తున్నాం.

వ్యాసాలు రెగ్యులర్‌గా వ్రాసేవాళ్లు తగ్గిపోయారు. జి.సి. మధుసూదన రావు గారు ఏదో ఒక అంశంపై దాదాపు ప్రతినెలా ఒక వ్యాసం పంపుతున్నారు. కేశవ రెడ్డిగారు కోరినపుడు వ్రాస్తున్నారు. ఇతరులు 1,2 వ్రాసినా స్థాయి ఉండడంలేదు. అందుచేత వివిధ దిన, వారపత్రికలలో వచ్చే వ్యాసాలలో మనకు సరిపడే వాటిని ఎంపిక చేసి ముద్రిస్తున్నాం. గుత్త పత్రికల ప్రభావం పాఠకుల మీద ఎక్కువగా ఉంది. మన ఉపాధ్యాయులు రెగ్యులర్‌గా 1,2 గుత్త దిన పత్రికలు చదువుతుంటారు. వాటిలో వాస్తవాలు తారుమారుగ వస్తుంటాయి. అందుచేత నడుస్తున్న రాజకీయాలపై సరియైన అవగాహన ఏర్పడడానికి ఉపయోగపడే వ్యాసాలను ఎంపిక చేసి వేస్తున్నాము.

**శీర్షికల నిర్వహణ :-** "అవినీతి పై అంకుశం", ఆదర్శ ఉపాధ్యాయులు", "మహిళా వేదిక" అనే క్రొత్త శీర్షికలు పెట్టాం. కాని జిల్లా శాఖలు సరియైన సమాచారం పంపనందున ఈ శీర్షికలు రెగ్యులర్‌గా నిర్వహించ లేకపోతున్నాం. జిల్లా / మండల శాఖలు సహకరిస్తే ఈ శీర్షికలు మరింత వాడిగా నిర్వహించగలం. గతంలో "మనం-మన ఆరోగ్యం" శీర్షికతో డా॥ వి. బ్రహ్మా రెడ్డి గారి రచనలు వేసే వాళ్లం. కాని ఈ మధ్య దినపత్రికలలో కూడ అనేక వ్యాధుల పై వ్యాసాలురావడం ఎక్కువైంది. అందుచేత రోగాలను గూర్చి గాకుండా, ప్రజారోగ్యానికి సంబంధించిన వ్యాసాలు వీలైనపుడల్లా వేస్తున్నాం.

ప్రబోధాత్మక గేయాలు కూడ తక్కువగా వస్తున్నాయి. సమకాలీన సామాజిక సమస్యలపై కథలు, గేయాలు వేయాలనుకుంటున్నాం. వడ్లమాను వెంకటేశ్వర్లు, మంకు శ్రీను లాంటివారు వైవిధ్యంతో కూడిన రచనలు పంపుతున్నారు. అవి చాలడం లేదు. అందుచేత యితర పత్రికలలో నుంచి, పుస్తకాలలో నుంచి సేకరించి గేయాలు వేస్తున్నాం.

గతంలో ఏదో ఒక సమస్య మీద 'నియమ నిబంధనలు' అనే శీర్షిక కింద వ్యాసాలు వేసే వాళ్లం. క్రొత్త సమస్యలు రానందున, ప్రశ్నోత్తరాలలోనే తగిన సమాచారం యిస్తున్నందున ఆ శీర్షికను రెగ్యులర్‌గా నిర్వహించడం లేదు. కాని నవతరం ఉపాధ్యాయులకు వివిధ అంశాలను గూర్చి వివరంగా తెలియ జెప్పాల్సిన అవసరముందని లేఖలు వస్తున్నాయి. అందుచేత జనవరి 2004 నుండి ఈ శీర్షికను రెగ్యులర్‌గా నిర్వహిస్తాం.

**అచ్చుతప్పులు :-** ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఏదో ఒక కారణంతో అచ్చుతప్పులు దొర్లుతున్నాయి. అందుచే జనవరి నుండి ఈ పనికొరకే ఒక బాధ్యుణ్ణి నియమించి అచ్చు తప్పులు రాకుండా చేయాలనుకుంటున్నాం.

**ఫిర్యాదులు:-** పత్రికలు చేరడం లేదనే ఫిర్యాదులు బాగా తగ్గిపోయాయి. లేఖ రాగానే సవరిస్తున్నాం. ఎక్కువ భాగం, చిరునామాలు మారడం వల్ల, కొన్ని చిరునామాల కాగితాలు చినిగిపోవడం వల్ల చేరడం లేదు.

**జీవిత చందాలు:-** 18 సం॥లు నిండిన జీవిత చందాలు 2003 డిసెంబర్ నెల ఆఖరుకు దాదాపు 6,000 ఉన్నాయి. వాటిలో కొందరు యిటీవల చేరిన వారున్నారు. వారివివరములు పంపితే వారికి 18 సం॥లు నిండేవరకు పంపగలం. రిటైరయినా పత్రిక కావాలనే వారుంటారు. వారిని గుర్తించి, రెగ్యులర్ చందాదారులుగా చేర్చాలి. ఫిక్స్‌డ్ డిపాజిట్ పై వడ్డీ నామ మాత్రంగా వస్తున్నది. అందుచేత ఆ వడ్డీతో ఈ స్కీమును కొనసాగించడం సాధ్యంకాదు.

**పాఠకుల అభిప్రాయాలు :-** కేవలం 10 మందిలోపు పాఠకులు మాత్రమే ప్రతినెలా పత్రికను గురించిన లేఖలు వ్రాస్తున్నారు. ఇది చాలదు. అభిప్రాయాలంటే అభినందించాలని కాదు. లోపాలోపాలు నిర్మొహమాటంగా వ్రాయాలి. అప్పుడే పత్రిక సానబెట్టబడుతుంది.

**సభ్యులు పత్రిక చందాల నిష్పత్తి** ఈ క్రింది విధంగా ఉంది. దీనిని పరిశీలిస్తే కొన్ని జిల్లాలు పత్రిక క్యాంపెయిన్‌లో ఎంత నిర్లక్ష్యం వహిస్తున్నాయో గ్రహించవచ్చు.

శ్రీకాకుళం:14 మంది సభ్యులకు ఒక పత్రిక; విజయనగరం:13 మందికి ఒకటి; విశాఖపట్టణం- 8:1; తూర్పుగోదావరి -5:1; పశ్చిమగోదావరి -6:1; కృష్ణా -7:1; గుంటూరు -6:1; ప్రకాశం -5:1; నెల్లూరు -2:1; చిత్తూరు -16:1; కడప -9:1; కర్నూలు -2:1; అనంతపురం -4:1; ఖమ్మం -4:1; వరంగల్లు -8:1; కరీంనగర్ -6:1; ఆదిలాబాద్ -4:1; మహబూబ్‌నగర్ -9:1; నల్లగొండ -4:1; నిజామాబాద్ -5:1; మెదక్ -8:1; రంగారెడ్డి -15:1; హైదరాబాద్ -7:1.

### పత్రిక జనరల్ క్యాంపెయిన్ ఫలితాలు
**(ఫిబ్రవరి 2003 నుండి మే 2003 వరకు)**

1. అత్యధిక పత్రికలు చేర్పించిన జిల్లాలు
   ప్రథమ స్థానం - నెల్లూరు 2,723 ద్వితీయ స్థానం - ఖమ్మం 604
   తృతీయ స్థానం - ప్రకాశం 563
2. కోటాలు అధిగమించిన జిల్లాలు:
   1. కర్నూలు 257/250, 2. ఖమ్మం 604/600,
   3. నల్లగొండ 518/400,
3. వ్యక్తి గత బహుమతులు:
   1. ప్రథమ బహుమతి - ఎస్.కె.మస్తాన్, నెల్లూరు జిల్లా -571.
   2. ద్వితీయ బహుమతి- జి.సత్తిరాజు, తూ॥గో॥ - 232.
   3. తృతీయ బహుమతి- యం. తిరుపతి రెడ్డి, ప్రకాశం జిల్లా - 211.

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## 9.1.2004 నాటికి సభ్యత్వం, మహాసభల నిధి వివరములు

| వ.సం. | జిల్లా | చెల్లించిన సభ్యత్వ రుసుం | రుసుం మేరకు సభ్యత్వం | చెల్లించిన మహాసభల నిధి | మహాసభల నిధి కోటా |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 19,278 | 3278 | 30,000 | 60,000 |
| 2. | విజయనగరం | 16,118 | 2686 | 60,000 | 70,000 |
| 3. | విశాఖపట్టణం | 6,180 | 1030 | 10,000 | 20,000 |
| 4. | తూ॥ గోదావరి | 76,642 | 12774 | 3,50,000 | 3,50,000 |
| 5. | ప॥ గోదావరి | 61,800 | 10300 | 3,00,000 | 3,00,000 |
| 6. | కృష్ణా | 48,432 | 8072 | 2,00,000 | 2,00,000 |
| 7. | గుంటూరు | 51,084 | 8514 | 1,75,000 | 3,00,000 |
| 8. | ప్రకాశం | 54,600 | 9100 | 2,50,000 | 2,50,000 |
| 9. | నెల్లూరు | 46,662 | 7777 | 2,00,000 | 2,00,000 |
| 10. | చిత్తూరు | 40,000 | 6666 | 60,000 | 1,25,000 |
| 11. | కడప | 11,352 | 1892 | - | 25,000 |
| 12. | కర్నూలు | 21,210 | 3535 | 50,000 | 75,000 |
| 13. | అనంతపురం | 33,810 | 5635 | 19,000 | 1,00,000 |
| 14. | ఖమ్మం | 36,600 | 6100 | 2,00,000 | 2,00,000 |
| 15. | వరంగల్ | 14,360 | 2393 | 30,000 | 50,000 |
| 16. | కరీంనగర్ | 12,750 | 2125 | 21,000 | 30,000 |
| 17. | ఆదిలాబాద్ | 8,496 | 1416 | 50,000 | 60,000 |
| 18. | యం॥ నగర్ | 13,500 | 2250 | 81,000 | 80,000 |
| 19. | నల్లగొండ | 27,900 | 4650 | 80,000 | 1,00,000 |
| 20. | నిజామాబాద్ | 2,400 | 400 | 20,000 | 20,000 |
| 21. | మెదక్ | 2,700 | 450 | - | 20,000 |
| 22. | రంగారెడ్డి | 11,700 | 1950 | 1,00,000 | 1,00,000 |
| 23. | హైదరాబాద్ | 15,258 | 2543 | 7,34,602 | 15,00,000 |
| 24. | కేంద్రం | 210 | 7 | 4,000 | - |
| 25. | ఇతరములు | | | 50,450 | |
| | మొత్తం | 6,33,042 | 1,05,543 | 30,75,052 | 42,35,000 |

యన్. నారాయణ

ప్రధానకార్యదర్శి

కోర్టు తీర్పులు

## ఉపాధ్యాయుల నుండి అధిక వృత్తి పన్ను వసూలుపై హైకోర్టు స్టే

-కె. జోజయ్య, అధ్యక్షులు, యు.టి.యఫ్.

1996 ఆగస్టు నుండి పెంచిన వృత్తి పన్ను రేట్ల ప్రకారము ఉపాధ్యాయుల నుండి రాబట్టాలని రాష్ట్ర వాణిజ్య పన్నుల కమిషనర్ యిచ్చిన ఉత్తర్వులను రద్దుచేయాలని యుటియఫ్ రాష్ట్ర కమిటీ వేసిన రిట్ పిటీషన్‌కు అనుకూలంగా రాష్ట్ర హైకోర్టు స్టే ఉత్తర్వులను మంజూరు చేసింది.

ఆంధ్రప్రదేశ్ వృత్తి పన్ను చట్టం 1987ననుసరించి జి.ఓ. 227 ఆర్థిశాఖ, తేది: 21.9.1996 ద్వారా రాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగుల వేతనం ప్రాతిపదికగా వృత్తి పన్నును పెంచుతూ ఉత్తర్వులిచ్చినది. దానిపై ఉద్యోగుల, ఉపాధ్యాయుల, కార్మికుల సంయుక్త కార్యాచరణ సమితి (జె.ఎ.సి.) ప్రాతినిధ్యం మేరకు నాన్‌గజిటెడ్ ఉద్యోగులకు సంబంధించిన సదరు ఉత్తర్వుల అమలును తదుపరి ఉత్తర్వులు యిచ్చువరకు నిలుపుదల చేయుచూ జి.ఓ. 48 ఆర్థికశాఖ, తేది: 15.3.97 విడుదల చేయుట జరిగినది. నాన్‌గజిటెడ్ ఉద్యోగులతో పాటు నాన్ గజిటెడ్ స్థాయికి చెందిన ఉపాధ్యాయులకు యీ ఉత్తర్వులను వర్తింప జేశారు. అందువలన రాష్ట్రంలోని అన్ని యాజమాన్యాల పాఠశాలలలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల నుండి కూడ పాత వృత్తిపన్ను రేటు అయిన రు.20/-ల చొప్పుననే వసూలు చేయడం జరుగుతోంది.

అయితే రాష్ట్ర వాణిజ్య పన్నుల కమిషనర్ ఆర్.సి.నెం.ఎ III (2)/777/ 2000 తేది.23.7.2003 ద్వారా ఒక వివరణనిస్తూ - జి.ఓ. 48 ద్వారా యిచ్చిన "నిలుపుదల" ఉత్తర్వులు కేవలం రాష్ట్ర ప్రభుత్వంలో పనిచేస్తున్న యన్.జి.ఓ.లకు మాత్రమే వర్తిస్తాయని, ఉపాధ్యాయులు యన్.జి.ఓ. లు కాదు గనుక వారు 1996 ఆగష్టు నుండి పెంచిన రేట్ల ప్రకారము వృత్తి పన్నును చెల్లించాలని- పేర్కొనుట జరిగినది. దీనిపై యుటియఫ్ పక్షాన రాష్ట్ర ప్రభుత్వానికి ప్రాతినిధ్యము చేయడం జరిగింది. అందుకు సంబంధించిన ఫైలు ఆర్థిక శాఖలో కూడా నడుస్తున్నది.

కాగా "కాళిదాసు కవిత్వం కొంత, నా పైత్యం మరి కొంత" అన్న చందంగా వాణిజ్య పన్నుల శాఖకు చెందిన జిల్లా అధికారులు కొందరు, వారి ఉత్తర్వులు అందీ అందగానే యిద్దరు, ముగ్గురు జిల్లా విద్యాశాఖాధికారులు - ఉపాధ్యాయులు పెరిగిన రేట్ల ప్రకారం 1996 ఆగష్టు నుండి చెల్లించవలసిన బకాయి మొత్తమును జనవరి నెలలో చలానా ద్వారా చెల్లించాలని, అపుడు మాత్రమే 2004 జనవరి నెల జీతము చెల్లించబడుతుందని ఆదేశాలిచ్చారు. దీనితో ప్రస్తుతం నెలకు రు.20/-చొప్పున చెల్లిస్తున్న వృత్తిపన్నుకు అదనంగా తమ తమ నెల జీతమునుబట్టి నెలకు రు. 25/-ల నుండి రు. 130/- వరకు గత 90 మాసములకు బకాయీలు చెల్లించవలసిన పరిస్థితి కల్పించబడింది. (1996లో పెంచిన వృత్తి పన్ను రేట్ల వివరములకై 2004 యుటియఫ్ డైరీ పేజి-44ను చూడగలరు).

ఈ నేపధ్యములో యుటియఫ్ రాష్ట్ర కమిటీ పక్షాన రాష్ట్ర హైకోర్టులో 2004 జనవరి 27న రిట్ పిటీషన్ (నెం.1516/2004) ను దాఖలు చేయడం జరిగింది. జనవరి 28న వాదప్రతివాదములను విన్న తరువాత జస్టిస్ మోతీలాల్ బి. నాయక్, జస్టిస్ డి. సుబ్రహ్మణ్యంలతో కూడిన హైకోర్టు డివిజన్ బెంచి తదుపరి ఉత్తర్వులు యిచ్చేవరకు - వాణిజ్య పన్నుల కమిషనర్ యిచ్చిన వివరణ ఉత్తర్వులను అమలు జరపరాదని - స్టే ఉత్తర్వులను మంజూరు చేయడం జరిగింది. ఈ స్టే ఉపాధ్యాయులకు ఎంతో ఊరటను కలుగజేసింది.

కాగా ఈ కేసులో వాదప్రతివాదనలు జరిగేటపుడు ప్రభుత్వ న్యాయవాది (జి.పి.) చేసిన వాదనలోని ఒక అంశమును గమనించడం అవసరం. ఇటీవల యిచ్చిన ఒక తీర్పులో సుప్రీంకోర్టు - "ఉపాధ్యాయులు ఉద్యోగులు కారు" అని పేర్కొన్నది గనుక పెరిగిన వృత్తిపన్ను నిలుపుదల ఉద్యోగులకే గాని, ఉపాధ్యాయులకు వర్తించదని సదరు జి.పి. గారి వాదన. యుటియఫ్ తరుపున వాదించిన అడ్వకేట్ శ్రీ ఎ. సత్యప్రసాద్ - జి.పి. గారి వాదనను పూర్వ పక్షం చేస్తూ వాదించిన మీదట న్యాయమూర్తులు స్టే మంజూరు చేయడం జరిగింది. కనుక సుప్రీం కోర్టు "ఉపాధ్యాయులు ఉద్యోగులు కారు"అని యిచ్చిన తీర్పు పూర్వాపరాలపై కూడా సరియైన అవగాహన కలిగివుండటం అవసరం.

## "ఉపాధ్యాయులకు గ్రాట్యూటీ చెల్లించనవసరం లేదు" సుప్రీంకోర్టు తీర్పు

"ఉపాధ్యాయులు ఉద్యోగులపరిధిలోనికి రారు, కనుక వారికి గ్రాట్యూటీ చెల్లించనవసరం లేదు" - అని 2004 జనవరి 13న సుప్రీం కోర్టు ఒక సంచలనాత్మక తీర్పు నిచ్చింది. ఈ తీర్పు గురించి టీవీల్లో, పత్రికల్లో చూసిన ఉపాధ్యాయులు భయాందోళనలకు గురయ్యారు. ఇప్పటికీ కొ[illegible] ఉపాధ్యాయులు ఆ విషయమై సంశయాలు వ్యక్తం చేస్తూనే వున్నారు, ఆ[illegible] చెందుతూనే వున్నారు. కనుక సుప్రీంకోర్టు యిచ్చిన ఆ తీర్పు దేశంలోని ఉపాధ్యాయులందరికి వర్తిస్తుందా, లేదా? అనే విషయాన్ని స్పష్ట పరచుకోవడం అవసరం.

### తీర్పు పూర్వపరాలు:

అహమ్మదాబాదు మున్సిపల్ కార్పొరేషన్‌లో పనిచేసిన ఒక ఉపాధ్యాయుడు తనకు గ్రాట్యూటీ చెలించాలని కోరుతూ వేసి న పిటీషన్‌పై గుజరాత్ హైకోర్టు తీర్పునిస్తూ "The Payment of Gratuity Act 1972" లో "Employee అను పదమునకు యివ్వబడిన నిర్వచనం ఉపాధ్యాయులకు వర్తించదు గనుక ఆ చట్టము క్రింద సదరు ఉపాధ్యాయునికి గ్రాట్యూటీ చెల్లించనవసరం లేదు" అని తీర్పు నివ్వడం జరిగింది. ఆ తీర్పుపై అహమ్మదాబాదు ప్రైవేట్ ప్రైమరీ టీచర్స్ అసోసియేషన్ సుప్రీంకోర్టులో సివిల్ అప్పీల్ (నం.6369/ 2001) ను వేసింది. దానిపై గుజరాత్ హైకోర్టు తీర్పునే బలపరుస్తూ సుప్రీంకోర్టు తీర్పు నివ్వడం జరిగింది.

**ఇంతకు చట్టంలో ఏమున్నది?** జాతీయ చట్టమైన " The Payment of Gratuity Act 1972" లోని సెక్షన్ -2 (ఇ) లో నిర్వచనం యీ క్రింది విధంగా వున్నది -

"Employee means any person (other than an apprentice employed on wages in any establishment, factory, mine, oilfield, plantation, port, railway, company or shop, to do any skilled, semi-skilled or unskilled, manual, supervisory, technical or clerical work in a managerial or administrative capacity...)

### తీర్పులో ఏమి చెప్పింది?

ఉపాధ్యాయులు పై నిర్వచనం పరిధిలోనికి రారు- అని పేర్కొంటూనే సుప్రీకోర్టు యీ క్రింది విధంగా వాఖ్యానించింది-

"26. Our conclusion should not be misunderstood that teachers although engaged in very noble profession of educating our young generation should not be given any gratutity benefit. There are already in several States seperate statutes, rules and regulations granting gratuity benefits to teachers in educational institutions which are more or less beneficial than the gratutity benefits provided under the Act. It is for the legislature to take cognizance of situation of such teachers in various establishments where gratuity benefits are not available and think of a seperate Legislation for them in this regard"

పై వాఖ్యానం ప్రకారం ప్రత్యేక నియమనిబంధనల క్రింద గ్రాట్యూటీ సౌకర్యము గల మన రాష్ట్ర ఉపాధ్యాయులకు సుప్రీం కోర్టు యిచ్చిన యీ తీర్పు వర్తించదు అని గమనించగలరు.

ప్రపంచీకరణను వ్యతిరేకించండి ప్రైవేటీకరణను తిప్పికొట్టండి యుద్ధోన్మాదాన్ని అంత మొందించండి

# ప్రపంచ సామాజిక వేదిక పిలుపు...

(ముంబాయి 2004)

యన్. రమణయ్య శాస్త్రి,యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు

**"భారత స్వాతంత్ర్య సమరానికి నాంది పలికిన స్థలం. ఎంతో మంది భరత మాత ముద్దుబిడ్డలకు జన్మస్థలం. నవ భారత రాజ్యాంగ నిర్మాత డా॥ బి.ఆర్. అంబేద్కర్ స్వస్థలం. ఫ్యాక్టరీ కార్మికుల నుండి వ్యవసాయ కూలీల వరకు అనేక కార్మిక సంఘాలకు పుట్టినిల్లు. అదే ముంబాయి మహానగరం. ఆ నగరంలో 16.1.2004 నుండి 21.1.2004 వరకు ప్రపంచ సామాజిక వేదిక నాల్గవ మహాసభలు అత్యంత ఉత్సాహభరితంగా, చైతన్యవంతంగా జరిగాయి."**

సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా, ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా, మత, యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా, డబ్ల్యు.టి.ఓ., ఐ.యం.ఎఫ్., వరల్డ్ బ్యాంకు తదితర సంస్థల ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా, కూడు,గూడు, గుడ్డ, నీరు, భూమి కోసం, బలహీన, దళిత, గిరిజన, అదివాసి వర్గాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరుతూ ప్రపంచంలోని సుమారు 150 దేశాల నుండి 80 వేల ప్రతినిధులతో ప్రపంచ సామాజిక వేదిక నాల్గవ మహాసభలు ముంబాయి నగరంలోని "గోరేగాం" ప్రాంతంలో గల అతి పెద్దదైన "నెస్కో" మైదానంలో 16.1.2004 నుండి 21.1.2004 వరకు జరిగాయి. మహాసభలకు ఒక రోజు ముందే అంటే 15.1.2004 నాటికి ముంబాయి మహానగరం ప్రపంచ సామాజిక వేదిక కార్యకర్తలతో నిండి పోయింది. ఎటు చూసినా సామాజిక వేదిక కార్యకర్తల నినాదాలు, నిరసన ప్రదర్శనలే దర్శనం ఇచ్చాయి. గోరేగాం ప్రాంతంలో చైతన్యం వెల్లి విరిసింది. 16.1.2004 సాయంత్రం ముంబాయి ఎగ్జిబిషన్ మైదానం సామాజిక కార్యకర్తలతో కిక్కిరిసిపోయింది. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధురాలు, ఆజాద్ హిందూఫౌజ్ క్యాప్టెన్ డా॥ లక్ష్మీసెహగల్ మహాసభను ప్రారంభిస్తూ ప్రపంచీకరణ వల్ల మూడవ ప్రపంచ దేశాలకు వచ్చే నష్టాలను, కష్టాలను వివరించి సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాటం చేయాలని, మరో ప్రపంచ నిర్మాణానికి నడుము కట్టాలని పిలుపునిచ్చారు. బ్రెజిల్ సామాజిక సంస్థ కార్యకర్త, డబ్ల్యు.ఎస్.ఎఫ్. వ్యవస్థాపకులలో ఒకరైన చికోవిటేకర్ మాట్లాడుతూ నయా ఉదారవాదానికి వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరుగుతున్నాయని, వాటిని సమన్వయ పరిచి సంఘటితం చేయడమే ప్రస్తుత కర్తవ్యం అని అన్నారు. ఇరాక్ పై అమెరికా ఏకపక్ష దాడిని పేర్కొంటూ దాని ద్వారా అమెరికా తన ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ విధానాలను అమలు చేయక పోతే ఇతర దేశాల పాలకులకు కూడా ఇదే (ఇరాక్) గతి పడుతుందని అన్యాపదేశంగా హెచ్చరించినట్లు అయిందని దీన్ని తీవ్రంగా ప్రతిఘటించాలని ప్రముఖ రచయిత్రి, నర్మాదా బచావ్ ఆందోళన కార్యకర్త శ్రీమతి అరుంధతి రాయ్ పేర్కొన్నారు.

ఇరాక్ ప్రజాస్వామ్య ఉద్యమ నాయకురాలు అమీర్ రెకాబీ ప్రసంగిస్తూ అమెరికా ఆధిపత్య విధానాలకు ఇరాక్ దురాక్రమణ ప్రత్యక్ష నిదర్శనం అన్నారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ నటి,



సామాజిక కార్యకర్త శ్రీమతి షబనా అజ్మీతో పాటు ఇతర దేశాల ప్రతినిధులు కూడా పాల్గొన్నారు. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు ముంబాయి మాజీ మేయర్ శాంతిబాయి పటేల్ ప్రతినిధులకు స్వాగతం పలికారు.

17.1.2004 నుండి 20.1.2004 వరకు వివిధ అంశాలపై వందలకొలది సెమినార్లు, వర్క్‌షాపులు, సదస్సులు జరిగాయి. వీటిలో వివిధ దేశాల నుండి సుమారు 2 వేలమంది పార్లమెంటేరియన్లు, శాసన సభ్యులు, వివిధ రాజకీయ పార్టీల నాయకులు పాల్గొన్నారు.

"యువత పై ప్రపంచీకరణ ప్రభావం" అనే అంశంపై జరిగిన సెమినార్‌నుద్దేశించి సి.పి.ఎం. పొలిట్‌బ్యూరో సభ్యులు శ్రీ సీతారాం ఏచూరి మాట్లాడారు. ప్రపంచీకరణ ప్రభావం వల్ల నిరుద్యోగం పెరిగిపోతున్నదని, దీని వల్ల యువతీ యువకులు నేరస్తులుగా మారడం, మాదక ద్రవ్యాలకు బానిసలు కావడం జరుగుతున్నదని అన్నారు.

విద్యారంగ సమస్యలపై జరిగిన సెమినార్‌లో విద్యారంగం నుండి ప్రభుత్వం తప్పుకోవాలని చూస్తుందని పర్యవసానంగా విద్యారంగం ప్రైవేటు పరం అవుతుందని, దాని వల్ల అందరికీ విద్య అందు బాటులో లేకుండా పోతుందని ఏచూరి అన్నారు.

సరళీకృత ఆర్థిక విధానాలను అత్యంత వేగంగా అమలు పర్చడంలో ముందు నిలిచి, చతికిల బడ్డ మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ దిగ్విజయ సింగ్ ఈ మహాసభలలో పాల్గొనడం విశేషం. ఆయన రాజ్యాంగం-ప్రజాస్వామ్యం, భూమి, గాంధీ తో కాసేపు, మానవీయ కోణంలో ప్రపంచీకరణ - అనే అంశాలపై జరిగిన సెమినార్‌లో పాల్గొంటూ ప్రపంచీకరణను గుడ్డిగా వ్యతిరేకించలేనని, టెక్నాలజీని పెంచు కోవడానికి, పంచుకోవడానికి ప్రపంచీకరణ అవసరమంటూనే గుత్తాధి పత్యానికి తాను వ్యతిరేకం అని పేర్కొన్నారు.

"నేటి సోషలిజం - సవాళ్ళు" అనే అంశం పై వివిధ దేశాల కమ్యూనిస్టు పార్టీలు ఒక సెమినార్‌ను నిర్వ హించాయి. దీనికి సి.పి.ఐ. ప్రధానకార్యదర్శి ఎ.బి. బర్ధన్ అధ్యక్షత వహించారు. ఇటలీ, బ్రెజిల్, క్యూబా, గ్రీస్, చైనా, ఫ్రాన్స్, పోర్చుగల్, అమెరికా దేశాల కమ్యూనిస్ట్ పార్టీలు ఈ సెమినార్‌లో పాల్గొన్నా యి. సి.పి.ఐ.(యం.) పొలిట్ బ్యూరో సభ్యులు సీతారాం ఏచూరి చర్చను ప్రారంభిస్తూ సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ శక్తులు ఎంత ప్రయత్నించినా సోషలిజాన్ని తుడిచి వేయలేవని పేర్కొన్నారు. మరో ప్రపంచం సాధ్యమేనని, అది సోషలిస్టు ప్రపంచమేనని ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలు స్పష్టం చేశాయి.

"రాజకీయ పార్టీలు - సామాజిక ఉద్యమాలు" అనే అంశం పై జరిగిన సదస్సులో సి.పి.ఐ.(యం.) పొలిట్‌బ్యూరో సభ్యుడు శ్రీ ప్రకాశ్ కారత్ మాట్లాడుతూ సామాజిక ఉద్యమాలు రాజకీయ పార్టీలను పూర్తిగా ప్రక్కన పెట్టడం మంచిది కాదని. అలాగే రాజకీయ పార్టీలు సామాజిక ఉద్యమాలతో సమన్వయం చేసుకోవాలని అన్నారు. అనేక సమస్యలపై జరిగే సామాజిక ఉద్యమాలు ప్రభుత్వాల పై వత్తిడి తెస్తే వాటికి రాజకీయ రూపం ఇచ్చి, ఫలితాలను ప్రజలకు అందించేది రాజకీయ పార్టీలే అని ఆయన పేర్కొన్నారు. ప్రముఖ మార్క్సిస్టు

విశ్లేషకులు, సోషల్ సైంటిస్టు పత్రిక సంపాదకులు, జె.ఎన్.యు. ఎకనామిక్స్ ప్రొఫెసర్ శ్రీ ప్రభాత్ పట్నాయక్ "సామ్యవాదం - ఆర్థిక వ్యవస్థ - సవాళ్ళు" అనే అంశంపై మాట్లాడుతూ ప్రస్తుత పరిస్థితులకు సోషలిజం పనికి రాదనే, సోషలిజానికి కాలం చెల్లిందనే ఉదారవాద, సామ్రాజ్య వాద శక్తుల ప్రచారాన్ని తిప్పికొట్టాలని, అందుకు సోషలిస్టు మేధావులు ముందుకు రావాలని కోరారు. ప్రస్తుత వ్యవస్థలో ఆకలి, నిరుద్యోగం, నిరాక్షరాస్యత, దోపిడి అనివార్య భాగాలుగా ఉన్నాయని, ఇదే సమయంలో సామ్యవాద ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి పూనుకున్న దేశాల్లోని ప్రభుత్వాలు వీటిని తొలగించగలిగాయని అన్నారు.

"వివక్షత, అణచివేత, జాత్యహంకారం, కులతత్వం" అనే అంశంపై జరిగిన సదస్సులో దళిత హక్కుల ఉద్యమ కారుడు అర్. కె. ఫెన్ని, ప్రముఖ మానవ హక్కుల అవార్డు గ్రహీత మార్టిన్ అక్వస్, నేపాల్ దళిత హక్కుల కమిషన్ సభ్యురాలు దుర్గాసాబ్ పాల్గొని ప్రపంచీకరణ కారణంగా భూ సంస్కరణలు ఆగిపోయాయని, ప్రైవేటైజేషన్ పెరిగిందని, తద్వారా రిజర్వేషన్లకు మంగళం పాడినట్లు అయిందని, అలాగే దళితుల పట్ల సామాజిక వివక్షతకన్న ఆర్థిక వివక్షత పెగిరిందని అన్నారు.

మీడియా పై ప్రపంచీకరణ ప్రభావం అనే అంశం పై జరిగిన సదస్సులో 'ది హిందూ' ఛీఫ్ ఎడిటర్ శ్రీ ఎన్. రాం మాట్లాడుతూ మీడియాపై గుత్తాధిపత్యం పెరిగిందన్నారు. ఇంకా అనేక సమస్యలపై సదస్సులు, వర్క్‌షాప్‌లు జరిగాయి. అంతేకాకుండా వివిధ సమస్యలపై ఫోటో ఎగ్జిబిషన్స్, పుస్తకాల ఎగ్జిబిషన్స్ కూడా ఈ మహాసభల సందర్భంగా ఏర్పాటు చేశారు.

ఈ మహాసభలలో యుటియఫ్ తరపున రాష్ట్ర సహాధ్యక్షులు శ్రీ ఎన్. రమణయ్య శాస్త్రి, కార్యదర్శివర్గ సభ్యులు శ్రీ పి. పుల్లయ్య, అడిట్ కమిటీ కన్వీనర్ శ్రీ జి. చిట్టిబాబు, ఖమ్మం జిల్లా అధ్యక్షులు శ్రీ బి. నర్సింహా రావు యుటియఫ్ ఆఫీస్ మేనేజర్ శ్రీ డి. మస్తాన్ రావు తో పాటు రంగారెడ్డి, పశ్చిమగోదావరి, నెల్లూరు తదితర జిల్లాల నుండి ప్రతినిధులు పాల్గొన్నారు. •

స్వచ్ఛమైన దేశభక్తి
మతరహిత సమాజానురక్తి–
ఓనా దేశ ప్రజలారా!
దేవుణ్ణి గురించి కాదు
మానవుణ్ణి గురించి మాట్లాడుకుందాంరండి!
ఈ దేశం జీవనదుల్లో
మానవత్వాన్ని ప్రవహింప చేద్దాం!
గుండెల మీద మహోన్నత
మానవతాకేతనం ఎగరేద్దాం!!

## జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ

### అవార్డు గ్రహీత


గుర్రం పుల్లయ్య, B.A.,B.Ed.

ప్రకాశం జిల్లా, ముండ్లపాడు యం.పి.పి. పాఠశాల. 'జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ' అవార్డు గ్రహీత. వీరు 1980లో శ్రీకాకుళం జిల్లాలో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుడుగ నియమింపబడి, 1993లో గిద్దలూరు మండలానికి జిల్లా బదిలీ పై వచ్చారు. వీరు జన్మభూమి, పల్స్ పోలియో కార్యక్రమాలలో చురుకుగా పనిచేశారు. వీరికి 2003 సం॥ లో జిల్లా విద్యాశాఖాధికారి గారు 'జిల్లా ఉత్తమ ఉపాధ్యాయుడు" అవార్డు యిచ్చి సత్కరించారు. జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు పొందినందులకు పుల్లయ్యగారిని అభినందిస్తున్నాను.

జి. రవీంద్రనాథ రెడ్డి
గౌ॥ అధ్యక్షులు
యుటియఫ్ ప్రకాశం జిల్లా శాఖ



## కవితలు

### మానవతా కేతనం

– డా॥ తీరం సుందర రావు, ఇంకొల్లు ప్రకాశం జిల్లా

ఊరూరా రాముడి గుడి వున్న దేశంలో
రాముడి కోసం నేలనుతవ్వుకుంటున్న
ఓనా జనులారా!
గుండెపొరల్లో దేవుణ్ణి చూడలేక
పురాణ శకలాల కోసం
పొరపొరలుగా భూమిని
తొలుచుకుంటున్న భక్త జన నాయకులారా!
గుండెల్లో మానవుణ్ణి చూడడం మరచిపోయి
గునపాలతో రాముణ్ణి వెతుకుతున్నారు.
పిలిస్తే పలికే మనిషిని వదిలిపెట్టి
పిలిచినా పలకని రాముణ్ణి జపిస్తున్నారు.

మానవుణ్ణి ప్రేమించ లేని వాళ్ళకు
దేవుణ్ణి పూజించే అర్హత లేదు.
దేవుణ్ణి ప్రేమించే వాళ్ళంతా
మానవుణ్ణి ప్రేమించే కారుణ్యమూర్తులు కావాలి.

అంతరంగంలో దేవుణ్ణి పూజిస్తూ
ఆచరణలో మానవుణ్ణి ద్వేషించే వాళ్ళకు
శివరాత్రయినా
శ్రీరామ నవమయినా ఒక్కటే!
చిత్తశుద్ధి లేని వాళ్ళకు
ఉగాదులు లేవు; ఉషస్సులూ లేవు.

చేసే పనిలో నిధిని చూసే వాళ్ళకు
దేవుడే కాదు; మానవుడూ కన్పించడు
మానవుడిలో వున్న దేవుణ్ణి చూస్తే
మానవుడే మహనీయుడవుతాడు.

దండం పెట్టుకోవడానికి
పండుగ రోజే కానక్కర్లేదు
గుండెల్లో కత్తులు దించుకుని
ప్రమిదలో వత్తులు వెలిగించడం దండగ.
నవ్వుల్ని మరచి పోయి
పలకరింపులు కరవైన మనకు
భజన చెక్కలు ఎందుకు?
చిత్తశుద్ధికరవైనపుడు
మానవుడు సైతం కనికరించడు
గుండెల్లో కన్నీటి పొరలు
ఇంకిపోయిన మనకు
పాతాళంఒ సైతం నీళ్ళుదొరకవు
గుక్కెడు నీళ్ళకోసం
జలయజ్ఞాలు చేసే నాయకులారా!
ఇపుడు చేయాల్సింది
యజ్ఞాలు కాదు; యాగాలు కాదు
మనిషిని గౌరవించే మానవతాక్రతువు–
ఇపుడు కావాల్సింది
రామ భక్తి కాదు

## విరామమెరుగని కలం యోధుడు, ఉద్యమనేత

### మైనేని వెంకటరత్నం.



జననం 29.10.1928 మరణం 12.01.1990

యు.టి.యఫ్. తొలితరం అగ్రనాయకులలో మైనేని వెంకటరత్నం గారొకరు. వీరు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని అమృతలూరులో 29.10.1928 లో జన్మించారు. భాషా ప్రవీణ చదివారు . గ్రేడ్-1 తెలుగు పండిట్‌గా పనిచేస్తూ 1983లో రిటైరైనారు. అప్పటి నుండి సంఘంలో పూర్తి కాలం పనిచేశారు. మంచి నిర్మాణదక్షులే కాకుండా, మంచి ఉపన్యాసకులు కవి, విమర్శకులు కూడా. ఐక్యఉపాధ్యాయ పత్రిక 1975 జనవరిలో ప్రారంభించి నప్పటి నుండి 1990 జనవరి లో చనిపోయేవరకు ప్రధానసంపాదకులుగా పనిచేసి పత్రికను తీర్చిదిద్దారు. వారి ఒరవడిలోనే నేటికీ మన పత్రిక నడుస్తున్నది. యు.టి.యఫ్. ఆవిర్భావానికి ముందు టీచర్స్ ఫెడరేషన్‌లో ఉంటూ ఉపాధ్యాయ పత్రికలో రెగ్యులర్‌గా కథలు, వ్యాసాలు వ్రాసేవారు. ఆయన అనేక రచనలు చేసినా పుస్తకాలుగా ముద్రించలేదు. కథల సంపుటి ఒకటి మాత్రమే ముద్రించారు. ఆ కాపీలు నేడు లభ్యంకావడంలేదు. శ్రేయోరాజ్యంలో పానకాల రాయుడు, సహజీవన సార్థక్యం, విఫలంకాని విజల్ లాంటి వ్యంగ్య కథానికలు ' బాలచంద్రుడు' 'సీతాపహరణం' లాంటి పిల్లల వీధిభాగవతాలు అమ్మనాన్న "రిహార్సలు" వంటి బాలలనాటకాలు, ' దేశం గర్జించింది' 'గేయరూపకం లేని మనిషి కుర్చీ అత్మకథ లాంటి కథలతోపాటు ఎన్నోస్కెచ్‌లు, వ్యాసాలు, మినీక వితలు, కార్టూన్ కతలు ఎన్నోవ్రాశారు. నెల్లూరు మహాసభకు వ్రాసిన స్వాగతగీతం వీరిని చిరంజీవిగా చేసింది. అడవిలోకి పంపినా అన్నం పుట్టించుకోగల నేర్పరి. అన్ని ప్రజాసంఘాల విద్యా గోష్ఠులకు వక్త, సాంఘిక వివాహాల నిర్వహణకర్త. జనవిజ్ఞాన వేదిక పనిమీద నెల్లూరు వెళ్లి 2 రోజులు నిద్రలేక, రాత్రి నిలబడి రైలులో ప్రయాణం చేస్తూ, ఒంగోలు స్టేషన్‌లో గుండెపోటు వచ్చి చికిత్సకు తీసుకుపోతుండగా మార్గమధ్యంలోనే కన్నుమూశారు. వీరి ఆశయాల కొనసాగింపే వీరికిచ్చే ఘనమైన నివాళి. ఈ తరం కార్యకర్తలను వారి జీవితాన్ని, రచనలను చదవాలి. జీర్ణించుకోవాలి, యువ కార్యకర్తలను బోధించాలి నలుగురికి ఆదర్శంగా నిలబడాలి.

**కవితలు**

### ఉపాధ్యాయ రత్నం - మన వెంకటరత్నం

అమృతలూరులో జన్మించిన జాతిరత్నం
తెలుగుతల్లి విజ్ఞాన సౌధ ఆణిముత్యం
ఆంధ్రసాహితీ స్రవంతి మణి మకుటం
ఉత్తమ ఉపాధ్యాయ చైతన్య కెరటం

కుటుంబ మంతా ఉపాధ్యాయ వృత్తికి అంకితమై
వామపక్ష భావజాలానికి వారధులై
లౌకిక తత్వ రాజకీయ రణరంగ సారథులై
అరుణబావుటా రెప రెపలకు ఆలంబనమయ్యే

మృదు, మధుర సంభాషణలతో మురిపిస్తూ
చిద్విలాస చిరునవ్వులు చిలుకరిస్తూ
షసందైన పలుకులతో అందరిని ఆకర్షిస్తూ
ఉద్యమ వాణి వేణువుల ఉత్తేజ పరుస్తూ

ప్రళయ కాలమేఘ గర్జనలా కలాన్ని కదిలించి
పీడిత, తాడిత ప్రజాళి ప్రతినిధియై భాసించి
పీడిత వర్గ వ్యవస్థ వ్యతిరేక ఉద్యమం సాగించి
సోషలిజ స్థాపనే ధ్యేయంగా ఆహరహం శ్రమించే

ప్రజా ఉద్యమాలకు చైతన్య గీతికలతో ఊపిరులూది
ఉపాధ్యాయ పోరాటాలకు మొక్కవోని ఆధిపత్యం వహించి
నవతరాలకు 'ఐక్య ఉపాధ్యాయ' జేగంటల వాణి వినిపించి
యువతరాలకు సామాజిక స్పృహను రంగరించి అందించే

సమసమాజ స్థాపనే ధ్యేయంగా జీవితమంతా వెచ్చించి
శ్రమజీవుల శ్రేయోరాజ్యం ఆశయంగా కలంతో గర్జించి
కార్మికలోక ప్రతినిధిగా ప్రతి క్షణం చైతన్య రవళివిన్పించి
అయ్యవార్ల హక్కులకై నిరంతరం రాజీలేని పోరాటం సాగించే

అచంచల దీక్షాదక్షుడైన మైనేని వెంకటరత్నం
ఎత్తిన ఎర్రబావుటా దించని నాయకత్వ లక్షణం
యు.టి.యఫ్. అరుణతారయై అలరిన త్యాగాల తోరణం
ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో ఆణిముత్యమై అలరె 'రత్నం'

**- వడ్లమాను వెంకటేశ్వర్లు, తెనాలి.**

### విజయ మృదంగం

భాగ్యనగర్ కనలేదే....!
మునుపెన్నడు ఈ ప్రభం'జనం'
రాష్ట్ర మహాసభల పర్వంలో
ఇది యుటియఫ్ ఘనవిజయం.

అతిరథులైన అతిథులు,
మహారథులు నాయకులు,
యావదాంధ్ర ప్రతినిధులు
ఆహ్వానితులైన వేళ

మురిసి మెరిసె 'అప్పారి ప్రాంగణం'
పదములు కదం త్రొక్కగా
నినాదాలు పదునెక్కగా
అరుణారుణ వర్ణములే
పతాకశీర్షికలకెక్కగ
సాగిన 'మహాప్రదర్శన'తో
పురవీధులాయె పావనం.

విద్యా, వైజ్ఞానిక సభల
నిర్వహణా తీరు తోన
మన ఉపాధ్యాయ లోకాన
సంఘాలన్నింటి లోన
గెలిచి నిలిచె మన సంఘం,
పులకాంకితులైన జనుల
మదిన మ్రోగ 'విజయ మృదంగం'

ఈ విజయాలను హృదిన నిలిపి
ఉద్యమాల ప్రతిన సల్పి
యుటియఫ్ ఘనత పెంచు
పటిష్ఠతకు పాటు పడుదాం!!
మన ప్రతిష్ఠను చాటి చెబుదాం!!

**- పి. గోపీనాథ్, పెనుబర్తి, నెల్లూరు జిల్లా**

## డీఎఫ్ఐడీ ఆర్థికసాయం......
# ఆంధ్ర పేదలపై ప్రేమతో కాదు
### గార్డియన్ పత్రిక కాలమిస్టు జార్జి మాన్‌బియో వ్యాఖ్య

బ్రిటన్‌కు చెందిన అంతర్జాతీయ అభివృద్ధి విభాగం (డీఎఫ్ఐడీ) ఆంధ్ర ప్రదేశ్‌కు చేస్తున్న ఆర్థిక సాయం ఈ రాష్ట్రంలోని పేదలపై ప్రేమతో ఎంత మాత్రం కాదని 'ద గార్డియన్' పత్రిక కాలమిస్ట్ జార్జి మాన్‌బియో తెలిపారు. భారత్‌లో మరోసారి వలస రాజ్యపాలనను పాదుకొల్పే కుట్ర లో భాగమే ఇదంతా అని ఆయన విమర్శించారు. 28.1.2004 నాడు హైదరాబాదులోని దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ (డీడీఎస్) నిర్వహించిన విలేకరుల సమావేశంలో ఆయన బ్రిటన్ ప్రభుత్వ వైఖరిని తీవ్రంగా ఎండగట్టారు. డీఎఫ్ఐడీ ఆంధ్ర ప్రదేశ్‌లో కాంట్రాక్టు వ్యవసాయాన్ని ప్రోత్స హిస్తోందని, ఇది చిన్న రైతుల ప్రయోజనాలను తీవ్రంగా దెబ్బతీస్తుందని ఆయన హెచ్చరించారు. చిన్న, మధ్య తరహా రైతులిన్న దెబ్బతీసి కాంట్రాక్టు వ్యవసాయం పేరుతో బడా కార్పొరేట్ సంస్థల్ని బాగుచేయడమే దీని వెనుక ఉన్న ప్రధాన లక్ష్యమని ఆయన తెలిపారు. బ్రిటన్‌లో ఇప్పుడు విద్య, వైద్యం మొదలుకుని ప్రభుత్వ సర్వీసులన్నిటినీ ప్రైవేటీ కరించారని, ఈ రంగాల్లో ప్రవేశించిన కార్పొరేట్ సంస్థలు దండిగా లాభాలు ఆర్జించాయని ఆయన చెప్పారు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో కూడా ప్రభుత్వ సర్వీసుల్ని ప్రైవేటీకరిస్తే... బహుళజాతి సంస్థలన్నీ అక్కడ ప్రవేశించి లాభాలు మూట గట్టుకోవాలన్నది కుట్రలో భాగమని, అందుకే ఆంధ్ర ప్రదేశ్‌లో ఇలాంటి సర్వీసులన్నింటినీ ప్రైవేటీకరించే దిశగా ప్రోత్సహించేందుకు డీఎఫ్ఐడీ సహాయం అందజేస్తోందని ఆయన వెల్లడించారు. ఇక్కడ తమ ప్రయత్నం ఫలిస్తే, ఇతర ప్రాంతాల్లో కూడా దాన్ని అమలు చేయాలన్నది బ్రిటన్ వ్యూహంగా అభిప్రాయపడ్డారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు కూడా అందుకు అనుగుణంగానే ఉన్నాయని, విజన్ -2020 డాక్యుమెంట్‌లో పేర్కొన్న అంశాలు ధనిక, బహుళజాతి సంస్థలకు లాభం చేకూర్చేవిగా మాత్రమే ఉన్నాయని ఆయన పేర్కొన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విధానాల వల్ల భూమిని నమ్ముకు బతుకుతున్న 2 కోట్ల మంది గ్రామీణులు ఉపాధి కోల్పోతారని, వీరంతా పట్టణాలకు వలసపోవలసిన పరిస్థితి ఏర్పడుతుందని చెప్పారు. నిజంగా విజన్-2020 పేదలకోసం రూపొందిస్తే, వాళ్లతో మాట్లాడి, వాళ్ల అవసరాలేంటో తెలుసుకుని చేయాలని, అందుకు విరుద్ధంగా మెకన్సే వంటి బహుళజాతి సంస్థ రూపొందించిన నివేదికను పేదలపై రుద్దడం వల్ల ఒరిగేదేమీ ఉండదని ఆయన పేర్కొన్నారు. నిజానికి బ్రిటన్ ప్రభుత్వ సంస్థయిన డీఎఫ్ఐడీ ఆంధ్రప్రదేశ్‌కు నిధులు ఇవ్వడం పట్ల బ్రిటన్ ఎంపీల్లో చాలా మంది అసంతృప్తిగా ఉన్నారని, తాము పన్నుల రూపంలో చెల్లిస్తున్న డబ్బును ఇలా ఖర్చు పెట్టడాన్ని బ్రిటన్ ప్రజలు కూడా వ్యతిరేకిస్తున్నారని అన్నారు. ప్రస్తుతం బ్రిటన్ ప్రజలు బహుళజాతి కంపెనీలు, ఐఎంఎఫ్ వంటి అంతర్జాతీయ సహాయ సంస్థలు, చివరగా అమెరికా నియంత్రణలో జీవనం సాగిస్తున్నారని ఒక ప్రశ్నకు సమాధానంగా మాన్‌బియో పేర్కొన్నారు. ప్రభుత్వ సర్వీసుల ప్రైవేటీకరణ వల్ల బ్రిటన్ ప్రజలకు జరిగిన లాభం కంటే నష్టమే ఎక్కువన్నారు. ప్రైవేటీకరణకు ముందు రైల్లో 9 పౌండ్లు చెల్లించి ప్రయాణించే దూరానికి, ఇప్పుడు 31 పౌండ్లు చెల్లించాల్సి వస్తోందని ఆయన తెలిపారు. ఇలాంటి అవలక్షణాలను అలవర్చు కోకుండా ఆంధ్రప్రదేశ్ జాగ్రత్త పడాలని, డీఎఫ్ఐడీ ఆర్థిక సాయం పేరుతో జరుగుతున్న కుట్రను గుర్తెరిగి నడుచుకోవాలని మాన్‌బియో పిలుపు నిచ్చారు. **- ఈనాడు, 28.1.04**

మాన్‌బియో ముంబాయిలో 22.1.2004 నాడు ఒక పత్రికా గోష్టిలు మాట్లాడుతూ, బ్రిటిషు ప్రభుత్వం గత సం॥ ఇదాయోపియాకు కరువు సహాయనికిచ్చిన నిధికి 15 రెట్లు ఆంధ్రప్రదేశకు యిస్తుంది. ఎందుకంత బ్రిటన్‌లో పబ్లిక్ సర్వీసుల ఎగుమతికి అవకాశముంది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ సర్వీసులను ప్రైవేటువరం చేస్తే వాటన్నింటిని బ్రిటిషు ప్రభుత్వం ఆక్రమిస్తుంది. 1970లో ఏమి జరిగిందో నేడు ఎ.పి.లో అదే జరుగుతుంది. ప్రతి ప్రభుత్వ రంగాన్ని అమ్మి వేశారు. చిన్న మధ్యరకం వ్యాపారాలు మూతబడ్డాయి. చిన్న రైతుల స్థానంలో ఆగ్రా పరిశ్రమలు వచ్చాయి. యిప్పుడు ఆంధ్రలో అదే పరిస్థితి కల్పించడానికి కృషి జరుగుతుంది అని మాన్‌బయో అన్నారు. ◆

## 21, ఫిబ్రవరి
## అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం
# ఐక్యరాజ్యసమితి విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక సంస్థ
### (యునెస్కో) 12వ తీర్మానం

**పూర్వాపరాలు:**

ప్రపంచంలోని వివిధ జాతుల ప్రజల మధ్య అవగాహన, పరస్పర సమాచారం ఇచ్చిపుచ్చుకొనే క్రమాన్ని, వివిధ జాతుల, భాషా సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకొని, ఆ వారసత్వ సంపదను మనకు అందించిన ఆయా జాతుల సంస్కృతులు, భాషల ప్రభావాన్ని విస్తరింప చేయాల్సిన ప్రాధాన్యాన్ని గుర్తించిన 'యునెస్కో' - (ఐక్య రాజ్యసమితి ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సంస్థ) 1974-1976- సంవత్సరాల లో తన 18వ 19వ సమావేశాల్లో ద్విభాషా విద్యా బోధనను బలపరుస్తూ కొన్ని తీర్మానాలను ఆమోదించింది.

యునెస్కో కార్యనిర్వాహక మండలి 1998 అక్టోబర్‌లో బహు భాషా విద్యలకు ఒక సలహా కమిటీని నియమించింది. అదే సంవత్సరం యునెస్కో డైరెక్టరు జనరల్ విద్యారంగంలో 'భాషావిభాగాన్ని' ఏర్పాటు చేశారు.

ఆ సందర్భంలో 1999 నవంబర్ 17న జరిగిన యునెస్కో 30వ సర్వ ప్రతినిధి సభ ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 21వ తేదీ 'అంతర్జాతీయ మాతృభాషాదినం'గా పాటించాలని ఏకగ్రీవ తీర్మానం చేసింది.

ఈ తీర్మానం వెనుక నేపథ్యం అమిత ఉత్తేజకరం అత్యంత స్ఫూర్తిమంతం.

ఫిబ్రవరి 21 ని అంతర్జాతీయ మాతృభాషా దినంగా ప్రకటించాలని బంగ్లాదేశ్ ప్రభుత్వం, యునెస్కోను అభ్యర్థిస్తూ ఒక ప్రతిపాదన పంపింది.

భారత్, పాకిస్తాన్, శ్రీలంకతో సహా 28, ఆఫ్రో, ఆశియా, లాటిన్ అమెరికా దేశాలు ఆ ప్రతిపాదనను బలపర్చాయి. కెనడాలో 'ప్రపంచ మాతృభాషా ప్రేమీమండలి' అనే ఒక సంస్థ వుంది. అందులో ఇంగ్లీషు, కుచి (KUTCHI) కాంటనీస్, జర్మన్, ఫిలిప్పినో, బెంగాలీ, హిందీ భాషలు మాట్లాడే ప్రతినిధులు సభ్యులుగా వున్నారు. వారు కూడా ఫిబ్రవరి 21ని 'అంతర్జాతీయ మాతృ భాషా దినం'గా ప్రకటించాలని ఐక్య రాజ్య సమితిని, యునెస్కోను అర్థించారు.

ఆ తరువాత నవంబరు 17,1999న యునెస్కో సర్వ ప్రతినిధి సభ - ఫిబ్రవరి 21ని అంతర్జాతీయ మాతృభాషాదినంగా ప్రకటించింది.

ఫిబ్రవరి 21న బంగ్లాదేశ్ గతచరిత్రలో ఏమి జరిగిందో, ఆనాటి పరిస్థితులేమిటో సింహా వలోకనం చేసుకోవడం అవసరం.

మన దేశ స్వాతంత్ర్య సమరం తర్వాత దేశ విభజన ఫలితంగా ఏర్పడిన పాకిస్తానులో భాగమైన తూర్పుబెంగాల్ ప్రాంతం తూర్పు పాకిస్థాన్‌గా పిలువబడేది.

బంగ్లాదేశ్ ప్రజలు, బెంగాలీ భాషను పాకిస్థాన్ అధికార భాషల్లో ఒకటిగా గుర్తించాలని ఉద్యమం ప్రారంభించారు. పాకిస్థాన్ పాలకులు - వారిలో అత్యధికులు నియుతులు ఆ ఉద్యమాన్ని అణిచి వేయడంతో ఆ ఉద్యమం విస్తరించి చివరికి విముక్తి పోరాటంగా మారి తూర్పు పాకిస్థాన్ బంగ్లాదేశ్‌గా స్వతంత్ర దేశంగా రూపొందింది. ఒక జాతి భాషా సంస్కృతుల రక్షణ కోసం ప్రారంభమైన ఉద్యమం ఒక దేశాన్ని ఏర్పాటు చేయడం ప్రపంచంలో అతి ముఖ్యమైన ఘటన.

ఫిబ్రవరి 21వ తేదీన జరుగనున్న మాతృభాషా దినోత్సవాన్ని జయప్రదం చేయాలని ఎస్.టి.ఎఫ్.ఐ. తమ అన్ని స్థాయిలలోని శాఖలకు యుటియఫ్ పిలుపునిస్తున్నాయి. ◆




ఎన్నికల డ్యూటీ చేసిన వారికి ఎరండులీవు

PROCEEDINGS OF THE COMMISSIONER AND DIRECTOR OF SCHOOL EDUCATION A.P. HYDERABAD.

**L.Dis. No.4756/D1-2/2003** **Dt. 7.11.2003**

Sub:- Suits - APAT - judgements of the A.P.A.T. in O.A.No.6843/2003, 6880/2003 & 6929/2003 filed by A.Narayana and 55 others Gr.I, T.P.Z.P.H. School, Ananthavaram, Thullur Mandal Guntur District, N.Ramakoteswara Rao, SGT. , M.P.U.P.School, Narukullapadu, Amaravathi Mandal and others and P.Jaya, HM Govt. High school for boys, Guntur Dist. and 5 others regarding Preservation of EL under F.R. 82(a) for election duty - Reg.

Ref:- Judgement dt. 20-10-2003 and 21-10-2003 in OA. 6843/ 2003 & 6880/2003 and 6929/2003 of the A.P.A.T. Hyderabad.

*****

The Hon'ble A.P.. Administrative Tribunal, Hyderabad in its Judgements in OA. 6843/2003 & 6880/2003 and 6929/2003 filed by A.Narayana and 55 others Gr. I.T.P., Z.P.H.School, Ananthavaram, Thullur Mandal, Guntur Dist., N.Ramakoteswara Rao, S.G.T.,M.P.U.P.School, Narukullapadu, Amaravathi Mandal and 18 others and P.Jaya HM Govt. High school for Boys, Guntur District and 5 others regarding Preservation of EL under F.R. 82(a) for election duty have issued the following orders.

The counsel for the applicants submitted that his O.A. is covered by the decision rendered in O.A. No. 54280/96, which read as follows.

1. G.O.Ms.No. 885, G.A.D. dt. 19.05.1991 has no retrospective effect. It has only prospective effect and the applicants who rendered service prior to issuance of the said G.O. are entitled for earned leave for the entire vacation during which they are forced to be in head quarters to receive the election duty orders.
2. That such of those applicants who were directed to be in head quarters to render election duty and serve election duty order are entitled for full earned leave under FR.82(a)

The learned GP/ZP after verification submits that the subject matter of this O.A. is similar to that of O.A.No.5428/ 96 and batch.

3. So having regard to the submissions made by the counsel, this O.A. is also disposed of as covered matter and the directions issued in O.A. No.5428/96 and batch are directed to be followed in this O.A. also.
4. The O.A. is disposed of accordingly. No. costs.

In view of the above the under mentioned officers are requested to take action as per A.P. Administrative Tribunal Orders and as per under itimation to this office without fail to avoid further legal complications in the matter.

This has the approval of the Commissioner & Director of School Education, Andhra Pradesh, Hyderabad

Sd/- VIDYASAGAR,
for Commissioner & Director of School Education.

ప్రధానోపాధ్యాయుల ప్రమోషన్లు గూర్చి

PROCEEDINGS OF THE COMMISSIONER AND DIRECTOR OF SCHOOL EDUCATION A.P. HYDERABAD.

**Proc.Rc.No. 3546/C3-1/2003** **Dt. 04-11-2003**

Sub:- Hon'ble High Court Orders on 18-09-2003 in W.P. No. 11325 of 2000 and batch - Not to take any action until further orders.

Ref:- Hon'ble High Court Orders dt. 18-9-2003 in W.P.11325 of 2000 and batch.

*****

The attention of all the Reginal Joint Directors of School Education and the District Educational officers in the State is invited to the orders of the Hon'ble High Court read above and they are requested not to make any transfers and promotions to any of the post until further orders.

Sd/- MANMOHAN SING,
Commissioner and Director of School Education.

--------

ఉపాధ్యాయ ఖాళీలు భర్తీ చేయుట గురించి

PROCEEDINGS OF THE COMMISSIONER AND DIRECTOR OF SCHOOL EDUCATION A.P. HYDERABAD.

**Rc.2125/Rc-1/2003** **Dt. 16.11.2003**

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Public Services - Direct Recruitment for the posts of teachers by the District Selection Committees - Permission to take up general recruitment to the vacancies meant for Direct Recruitment under the purview of the DSC-2003 - Orders - Issued.

---

EDUCATION (SER.VI) DEPARTMENT

**G.O.Ms.NO.137** **Dated. 13.11.2003**

Read the following

1. G.O.Ms.No.71 Edn.(Ser.VI) Dept., dt. 30.06.2000
2. G.O.Ms.No.224 G.A.(SPF-A)Dept.,dt. 30 06.2000
3. G.O.Ms.No.226 G.A. (SPF-A)Dept.,dt 01.07.2000
4. G.O.Ms.No.72 Edn. (Ser.VI) Dept., dt. 03.07.2000
5. G.O.Ms.No.73 Edn.(Ser.VI) Dept., dt. 03.07.2000
6. G.O.Ms.No.139 Edn.(Ser.VI) Dept., dt.23.10.2000.
7. G.O.Ms.No.47 Edn.(Ser.VI) Dept., dt. 10.05/2002
8. G.O.Ms.No.136 Edn.(Ser.VI) Dept., dt.13.11.2003
9. From the Commissioner and Director of School Education, Hyderabad Lr.Rc.No.125/Rc.1/2003, dt. 13.11.2003

*****

**ORDER:**

Government after careful consideration of the proposal contained in the reference 9th read above, hereby permit the Commissioner & Director of School Education, Hyderabad to initiate the process of recruitment to fill up 16,449 posts of teachers.

2. Th. recruitment shall be in accordance with the rules framed by Government in G.O. fourth read above., i.e., Andhra Pradesh Direct recruitment of Teachers (scheme of Selection) Rules 2000 and subsequent amendments issued thereto.

